శ్రీమతే శఠకోపాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః



# ఆచార్యహృదయచంద్రిక

('ఆచార్యహృదయము' నకు తెనుగు సేత)

'ఆదర్శాచార్య'

చిత్రకవి ఆత్రేయ



శ్రీమతే నారాయణాయ నమః

సత్ సంప్రదాయ పరిషత్

విశాఖపట్నం - బెంగుళూరు

# ఆచార్య హృదయ చంద్రిక

**('ఆచార్యహృదయము'నకు తెనుగు సేత)**

**'ఆదర్శాచార్య' చిత్రకవి ఆత్రేయ**

**ACHARYA HRIDAYA CHANDRIKA**

**(A TELUGU RENDERING OF 'ACHARYA HRIDAYAM'**
**By 'ADARSA CHARYA' CHITRAKAVI ATREYA)**


| | | |
|---|---|---|
| మొదటి ముద్రణ | : | శ్రావణం, 2010 |
| ప్రచురణ | : | **సత్ సంప్రదాయ పరిషత్**<br>**విశాఖపట్టణం - బెంగుళూరు** |
| సంపాదకులు © | : | శ్రీమతి నల్లాన్ చక్రవర్తుల కల్పనాప్రసన్న |
| ప్రతులు | : | 500 |
| మూల్యం | : | అమూల్యం |
| ముఖచిత్రం | : | నమ్మాళ్వార్లు, ఆళ్వార్ తిరునగరి |
| ప్రతులకు | : | **సత్ సంప్రదాయ పరిషత్**<br>555, గీత్‌శ్రీ, 9 మెయిన్,<br>12 క్రాస్, జె.పి. నగర్ -2,<br>బెంగుళూరు, 560078.<br>ఫోన్ : 080-26490364, 9980400555 |
| డి.టి.పి. | : | శ్రీమతి ఏ.యస్. జయలక్ష్మి<br>భవానినగర్, తిరుపతి -517 507. |
| ప్రింటింగ్ | : | సి.ఎన్. ప్రింటర్స్,<br>ప్రకాశంరోడ్, తిరుపతి |




శ్రీమతే రామానుజాయ నమః

# ఆచార్య హృదయ చంద్రిక

**('ఆచార్య హృదయము'నకు తెనుగు సేత)**

## అధ్యాయసూచిక





# హార్దాభివందనం

ఆత్రేయస్వామినా మార్యహృదయార్థవిదాం కృతిః ।
సేయం భవేత్ ప్రపన్నాళిస్వాంతసింహాసనస్థితా ॥

నమ్మాళ్వార్లు తాము అనుగ్రహించిన పెరియతిరువన్దాది ప్రబంధం చివరలో **"కార్ కలన్ద మేనియాన్ కైకలన్ద వాళియాన్ పార్ కలన్ద వల్‌వయిత్తాన్ పామ్బుణైయాన్ శీర్‌కలన్దశొల్ నినైన్దుపోక్కారేల్"** అని అంటూ భగవద్గుణానుసంధానంతో కాలక్షేపాన్ని చేసి, పాపనిబర్హణాన్ని చేసికొమ్మని ఉపదేశించారు. ఈ పాశురంలోని **"కార్ కలన్ద మేనియాన్", "కైకలన్ద వాళియాన్", "పార్ కలన్ద వల్ వయిత్తాన్", "పామ్బుణైయాన్"** అనే ప్రయోగాలను **"శీర్ కలన్ద శొల్"** అనే దానితో ప్రత్యేకప్రత్యేకంగా అన్వయించి సరసమైన అర్థాన్ని అభిజ్ఞులు తెలిపారు. వీటిలో **"పామ్బుణైయాన్ శీర్ కలన్ద శొల్"** అనే శబ్దసందర్భం శ్రీరంగంలో ఆదిశేషశయనంపై పరుండి ఉండే శ్రీరంగనాథుని కల్యాణగుణాలను గూర్చి తెలిపే తిరువాయ్‌మొళి దివ్యప్రబంధాన్ని తెలుపుతున్నదని ఆచార్యుల అభిప్రాయం. తిరువాయ్‌మొళి సాకల్యంగా శ్రీరంగనాథుని కల్యాణ గుణాలను కీర్తించే ప్రబంధమనే విషయాన్ని శ్రీపరాశరభట్టర్ తాము అనుగ్రహించిన తిరువాయ్‌మొళి ప్రబంధతనియన్ పాశురంలో - **"అరఙ్గర్ వణ్ పుకళ్ మేల్ ఆన్ఱ తమిళ్ మఱైకళ్ ఆయిరముమ్"** అని అంటూ స్పష్టంగా తెలియజేశారుకదా! ఈ తిరువాయ్‌మొళి ప్రబంధంయొక్క అర్థానుసంధానంతోనే పూర్వాచార్యులందఱు కాలక్షేపాన్ని చేశారు. ఇటువంటి తిరువాయ్‌మొళి అర్థగౌరవాన్ని సమగ్రంగా తెలియ జేసేది ఆచార్యహృదయ గ్రంథరాజం.

'**ఆచార్యహృదయ**' మనే నామంలో ఆచార్యశబ్దం నమ్మాళ్వార్లను నిర్దేశిస్తుంది. ఆచార్యశబ్దం **"అచినోతి హి శాస్త్రార్థానాచారే స్థాపయత్యపి స్వయ మాచరతే యస్మాత్ తస్మాదాచార్య ఉచ్యతే"** అని నిర్వచింపబడింది. శాస్త్రార్థాలను సమీకరించి గ్రహించినవాడు, వాటిని ఆచరింపజేసేవాడు, తాను ఆచరించేవాడు ఎవడో అతడే ఆచార్యుడు- అనే ఈ లక్షణం నమ్మాళ్వార్ల విషయంలో సంపూర్ణంగా అన్వయిస్తుంది. సకల శాస్త్రార్థసారం, **"ఆలోడ్య సర్వశాస్త్రాణి విచార్యచ పునః పునః, ఇదమేకం సునిష్పన్నం ధ్యేయో నారాయణః సదా"** అనే రీతిలో శ్రీమన్నారాయణుడే పరమాత్మ అనేది తత్త్వం. దీనిని **"మయర్వఱ మదినల మరుళినన్"** అనేటట్లు భగవానుని నిర్హేతుకకృపవల్ల తత్త్వజ్ఞానాన్ని పొందిన నమ్మాళ్వార్లు **"ఉయర్వఱ ఉయర్‌నల ముడైయవన్ యవనవన్... తొళుతుఎళుఎన్ మననే"** అని ఆ అర్థాన్ని తానాచరించి, **"వణ్‌పుకళ్ నారణన్

**తిణ్కళల్ శేరే"** అని అంటూ ఇతరులకు ఉపదేశించి, ఆచరింపజేశారు. అందువల్ల ఆచార్యపదం నమ్మాళ్వార్ల విషయంలో పూర్ణంగా అర్థవంతం. అటువంటి ఆచార్యుల హృదయాన్ని, అంటే - ఆశయాన్ని తెలియజేసే మహోన్నత గ్రంథమే ఆచార్యహృదయం.

ఆచార్యహృదయం నాల్గు ప్రకరణాలతో **234** చూర్ణికలతో అలరారుతున్నది. ఈ గ్రంథంలోని చూర్ణికలన్నీ ప్రధానంగా తిరువాయ్‌మొళి సూక్తులతో, అక్కడక్కడ మిగిలిన నమ్మాళ్వార్ల ప్రబంధసూక్తులతో కూర్పబడి ఉండడం విశేషం. ఈవిధమైన శైలికి ఆద్యులు బహుశః పెరియవాచ్చాన్‌పిళ్ళై అనవచ్చు. పాశురప్పడి రామాయణమనే లఘుకృతిని పెరియవాచ్చాన్ పిళ్ళై ఈ రీతిలోనే అనుగ్రహించారు. తరువాతి తరానికి చెందిన నాయనార్ ఆ శైలికి మఱింత మెఱుగులు దిద్దారు. శ్రీవరవరమునులు తమ వ్యాఖ్యానావతారికలో -**"ఇప్రబన్ధత్తిల్ ఇవర్ అరుళిచ్చెయ్‌కిఱ వాక్యఙ్గళెల్లామ్ అరుళిచ్చెయల్ శన్దైకళై చ్చేర్‌త్తు అరుళిచ్చెయ్‌కిఱతు"** అని ఈ అంశాన్నిగూర్చి ప్రస్తావించి, "ఈవిధంగానే ఆళ్వార్ల సూక్తులనే చూర్ణికలుగా నాయనార్ కూర్చడంలో ఉద్దేశ్యం ఏమంటే - భగవానుని నిర్హేతుకకృపవల్ల భ్రమవిప్రలంభాది దోషరహితమైన, పరమభక్తి రూపాపన్నమైన జ్ఞానాన్ని పొందిన ఆళ్వార్ల దివ్యసూక్తులు ఆప్తతమాలు; అత్యంత భోగ్యాలు కనుక, అవి తమకు అత్యంతం నిత్యం అభిమతాలు కనుక; ముత్యాల ముఖాలను తెలిసిన చతురుడు వాటిని చక్కగా కూర్చినపుడు ఆ ముత్యాలకు అంతకు ముందుకంటే ఎక్కు శోభ, విలువ కలిగేటట్లే, ఆళ్వార్ల శ్రీసూక్తుల మర్మాలను తెలిసిన తాము వాటిని కూర్చిన కూర్పువల్ల అవి రసజ్ఞులైనవారికి వాటిలోని అర్థంలో కంటే శబ్దమే మధురంగా ఉంటుందనే అభిప్రాయంవల్ల. దీనినిబట్టి ఈ ప్రబంధం శబ్దంలో, అర్థంలో గల మాధుర్యంవల్ల విశేషజ్ఞులకు మనోహరమని తెలుస్తున్నది.''- అని చేసిన వివరణవల్ల ఈ గ్రంథగౌరవం స్పష్టమవుతున్నది. ఆచార్యహృదయం ప్రధానంగా తిరువాయ్‌మొళియొక్క వైభవాన్ని తెలియజేసే గ్రంథమే అయినా, ఇందులో ప్రసక్తానుప్రసక్తంగా ఆళ్వార్ల మిగిలిన మూడు ప్రబంధాల వైభవంకూడా తెలుపబడింది.

ఆచార్యహృదయంలో నాయనార్‌చే ప్రస్తావింపబడ్డ విషయాలు కాని, ప్రామాణికమైన వాటి నిరూపణశైలి కాని అనితరసాధ్యాలు. ఏ చూర్ణికను అనుసంధించినా, అందులో తెలుపబడ్డ అర్థం శ్రీవరవరమునుల వ్యాఖ్యానం లేనిదే ఎటువంటి విద్వాంసులకైనా సంపూర్ణంగా అవగతం కాదన్నది ప్రత్యక్షరసత్యం. నారికేళపాకంలో చూర్ణికలు రచింపబడ్డాయనడంలో సందేహం లేదు. ఆచార్యహృదయగ్రంథంలోని అర్థగౌరవాన్ని, దానిని గ్రహించడంలోని క్లేశాన్ని దృష్టిలో పెట్టుకొన్న పెద్దలు- ఈ ఉద్గ్రంథాన్ని అర్థం చేసికొనేటట్లు అనుగ్రహించవలసినదిగా నాయనార్‌నే ప్రార్థించే ఈక్రింది పాశురం



గమనార్హం. **"తన్దరుళ వేణుమ్ తవత్తోర్ తవప్పయనాయ్ వన్ద ముడుమ్బై మణవాళా ! శిన్దైయినాల్ నీ యురైత్త మాఱన్ నినైవిన్ పొరుళ్ అనైత్తు ఎన్ వాయురైత్తు వాళుమ్ వకై"** (తపస్విజనుల తపఃఫలంగా అవతరించిన ముడుమ్బైకులంలోని అళకియమణవాళ ప్పెరుమాళ్ నాయనార్ స్వామీ! మీరు పల్కిన నమ్మాళ్వార్ల భావనయొక్క అర్థాన్ని, అంటే- ఆచార్యహృదయమనే గ్రంథంలోని అర్థాన్ని అంతటినీ నేను నోటితో పల్కి ఉజ్జీవించే రీతిని నాకు అనుగ్రహించాలి). శ్రీవరవరమునులు సైతం చాలా కాలం వేచి ఉండి, చివరకు తమ వార్ధకదశలో ఆచార్యహృదయానికి వ్యాఖ్యానం రచించినట్లు, **"జ్ఞానచతుర్థికళిన్ మేలేయిఱే ఆనన్దషష్ఠికళుక్కు ఉదయమ్"** మొదలైన చూర్ణికలలోని తాత్పర్యాన్ని అర్థం చేసికోవడంకోసం తిరునారాయణపుర వాస్తవ్యులు, సమకాలీనులు అయిన **"ఆయ్"** అనే ఆచార్యవర్యులతో సంప్రదించినట్లు శ్రీవరవరమునుల చరిత్రను తెలిసే సాంప్రదాయికచరిత్ర గ్రంథం అయిన **"యతీంద్రప్రవణప్రభావం"**లో తెలుపబడింది. శ్రీవరవరమునులేకాక, ఆయ్ కూడా ఆచార్యహృదయానికి వ్యాఖ్యానం రచించారు.

ఉద్యానవనంలో నాయకీనాయకుల యాదృచ్ఛికసమాగమం, వారి చక్షుస్సంగమం, మనఃప్రీతి - మొదలైన మన్మథావస్థలు, నాయకీనాయకుల విరహాలు, నాయకుని చేరాలనే నాయకి తహ తహ, ఆమెను నివారించే ఆమె తల్లి, నాయకీ నాయకుల సమాగమానికి తోడుపడే చెలికత్తె, నాయకి విరహబాధను చూచి, దానికి కారణాన్ని తెలిసికోవడం కోసం, దానిని ఉపశింపజేయడంకోసం తల్లిచేసే సోదెకత్తెను ప్రశ్నించడం మొదలైన ప్రయత్నాలు- ఇత్యాద్యంశాలు **"అకమ్"** అనబడే ద్రావిడశృంగార వాఙ్మయంలో సాధారణాలే అయినా వీటిని నమ్మాళ్వార్లు పరమాత్మ- జీవాత్మల పరంగా అన్వయిస్తూ తిరువిరుత్తం, తిరువాయ్‌మొళి ప్రబంధాలలో అనుగ్రహించిన శ్రీసూక్తులలోని సాంకేతికమైన మర్మాలను నాయనార్ వివరించినరీతి అత్యద్భుతం. తిరువిరుత్త ప్రబంధాన్ని వ్యాఖ్యానిస్తూ అళకియమణవాళచ్చీయర్ కూడా ఇటువంటి స్వాపదేశ వ్యాఖ్యానాన్ని చేసినా, నాయనార్ చేసిన సమన్వయం, వివరణం అనితరసాధ్యాలు.

ఆచార్యహృదయంలో ప్రస్తావింపబడ్డ అంశాలు అన్నీ రసఘనాలు, వ్యాఖ్యాన సాపేక్షాలు, సదాచార్యుల సన్నిధిలో మాత్రమే గ్రహించడానికి సాధ్యాలు. వీటిలో దివ్యదేశాల అర్చామూర్తులలో ప్రకాశించే ఒకగుణాన్నిగూర్చిన విషయంలోని ఏకదేశాన్ని మాత్రం యథామతి విన్నవిస్తాను.

భగవానుని రూపాలు పర-వ్యూహ-విభవ-అంతర్యామి-అర్చారూపాలలో అయిదు విధాలుగా ఉంటాయని శాస్త్రాలలో తెలుపబడింది. ఈ అయిదు రూపాలు సమస్త కల్యాణగుణవిశిష్టాలే అయినా, **"సర్వం పూర్ణమ్ సహోమ్"** అనే రీతిలో అర్చావతారంలో

అన్నీ స్ఫుటంగా పూర్ణంగా ప్రకాశిస్తాయి. అందువల్ల అర్చావతారరూపాలలో ఆళ్వార్లు విశేషమైన ఆదరాన్ని ప్రదర్శించారు. ఈక్రమంలో నమ్మాళ్వార్ల తిరువాయ్మొళి ప్రబంధంలోని 28 కల్యాణగుణాలను గూర్చి ప్రస్తావించి, నాయనార్ అవి ఏయే దివ్యదేశాలలో స్ఫుటంగా వ్యక్తమవుతున్నాయి? అనే అంశాన్ని ఆళ్వార్ల శ్రీసూక్తుల ఆధారంగా నిరూపించారు. ఆ గుణాలలో సౌకుమార్యమనే గుణాన్ని గూర్చి కొంచెం ప్రస్తావింపబడుతున్నది.

పరమాత్మకు గల అసంఖ్యాకాలైన కల్యాణగుణాలలో సౌకుమార్యమని, మార్దవమని రెండు కల్యాణగుణాలున్నాయి. ఇవి రెండు, పైపైన చూచినపుడు ఒకటిగా విగ్రహగుణాలుగా తోచినా, వాస్తవానికి ఇవి రెండు వేఱు వేఱు గుణాలు. భగవద్రామానుజులు శరణాగతిగద్యంలో **"సౌందర్యసౌంగధ్యసౌకుమార్య"** అని, **"సౌశీల్య వాత్సల్యమార్దవార్జవ"** అని వీటిని ప్రత్యేకగుణాలుగా నిర్దేశించారు. అంతేకాక సౌకుమార్యాన్ని దివ్యవిగ్రహగుణంగా, మార్దవాన్ని స్వరూపగుణంగా నిర్దేశించారు. అందుల్ల ఇవి వేఱు వేఱు గుణాలు. వీటి నిర్వచనాలనుకూడా పూర్వాచార్యులు తదనుగుణంగానే చేశారు. పెరియవాచ్చాన్పిళ్ళై గద్యవ్యాఖ్యలో సౌకుమార్యగుణాన్ని- **"నాయ్చ్చియారుమ్ ఉఱైక్కపార్క్క ప్పొఱాతపడి పుష్పహాససుకుమారమాయిరుక్కై"** (దివ్యదేవేరులు సైతం తేరిపార చూడలేని రీతిలో పుష్పహాససుకుమారంగా ఉండడం సౌకుమార్యం) అని, శ్రీదేశికులు గద్యభాష్యంలో **"మహాబలత్వేఽపి పుష్పహాస ఇతినామ దుహానం సౌకుమార్యమ్. యథోక్తమ్ 'సుకుమారౌ మహాబలౌ' ఇతి"** అని నిర్వచించారు. ఈ సౌకుమార్యగుణం తిరువణ్పరిశారమ్ అనే దివ్యదేశంలోని అర్చామూర్తిలో దర్శించవచ్చునని నాయనార్- **"శ్రమమనమ్ శూళుమ్ సౌకుమార్యప్రకాశమ్ ఆయ్చ్చేరియిలే"** అనే చూర్ణికలో తెలిపారు. అంటే- భగవానుడు పరమపదం నుండి ఈ లోకానికి వచ్చి అవతరించి దాసుల కష్టాలను తీర్చడంలో పడిన శ్రమను అనుసంధించే భక్తుల మనస్సును వ్యాకులంతో భ్రమింపజేసే సౌకుమార్యగుణప్రకాశం ఆయ్చ్చేరిలో- అంటే నమ్మాళ్వార్ల తల్లి ఉడైయనంగై పుట్టినిల్లు అయిన తిరువణ్ పరిశారంలో దర్శించవచ్చు- అని భావం.

నమ్మాళ్వార్ల ఈ దివ్యదేశాన్ని, అచటి స్వామిని తిరువాయ్మొళిలోని **"అఙ్గు మిఙ్గుమ్"** అనే (8-3) దశకంలో కీర్తించారు. ఈ దశకవ్యాఖ్యానానికి అవతారికను అనుగ్రహించేనమ్పిళ్ళై ఈడులో- **"కీళిల్ తిరువాయ్మొళియిల్ పత్తామ్పాట్టిలే - "ఓర్ కోల నీల నన్నెడుమ్ కున్ఱమ్ వరువతొప్పాన్" ఎన్ఱు వడివళకై అనుసంధిత్తవాఱే, తామ్ పట్ట క్లేశత్తై మఱన్దు, "ఇవ్వడివోడే సంసారత్తిలే తనియే వన్దు అవతరిత్తు** ఉలావానిఱ్కుమ్. శత్రుక్కళుమ్, మధ్యస్థరుమ్, ప్రయోజనాంతరపరరుమాయ్, ఇవనుక్కు ప్పరివుడైయార్ ఒరువరు మిన్ఱిక్కే యిరుక్కిఱ సంసారత్తిలే, అర్థికళుడైయ అపేక్షితఙ్గళై ప్పూరిక్కైక్కాక సంసారసజాతీయనాయ్, శిలర్క్కు పరతంత్రనాయుమ్,శిలర్ అర్థిత్తతువే వ్యాజమాక, అవతారత్తుక్కు ప్పిఱ్పట్టార్క్కు క్కోయిల్కళిలుమ్, గృహఙ్గళిలుమ్ సన్నిహితనాయుమ్ వర్త్తిక్కిఱ ఇవనుడైయ సౌకుమార్య మఱిన్దు పరియక్కడవారొరుత్తరు మిల్లై. నాను ముతవప్పెఱుకిఱిలేన్" ఎన్ఱు అవన్ తనిమైక్కు వెఱుత్తు భీతరాక, "నమక్కు ప్పరివర్ ఇల్లై" ఎన్ఱు భయప్పడవేణ్డా, ముముక్షుక్కళుమ్, ముక్తరుమ్, నిత్యసిద్ధరుమ్ నమక్కుప్పరికైయే యాత్రయాయిరుక్కుమవర్కళన్ఱో ! నమక్కు త్తాన్ వేఱే శిలర్ పరియవేణ్డియిరున్దతో" ఎన్ఱు సర్వేశ్వరన్ తన్ సర్వశక్తిత్వత్తై క్కాట్టి సమాధానమ్ పణ్ణ, సమాహితరాయ్ హృష్టరాకిఱార్"** (గడచిన దశకంలోని పదవ పాశురంలో 'అద్వితీయమైన అందమైన నీలపర్వతం నడచి వచ్చేటట్లున్నవాడు'' అని అంటూ భగవానుని అందాన్ని అనుసంధించగానే, ఆళ్వార్లు తాము పడిక్లేశాన్ని మఱచిపోయి, "ఈ దివ్యరూపంతో భగవానుడు సంసారంలో ఒంటరిగా వచ్చి అవతరించి సంచరిస్తూ ఉంటాడు, శత్రువులు, మధ్యస్థులు, ప్రయోజానంతరాలను కోరేవారు తప్ప ఇతని పట్ల ప్రేమను కలవారెవ్వరూ లేని ఈ సంసారంలో, అర్థిజనుల కోరికలను పూరించడంకోసం సంసారులకు సజాతీయుడై, కొందరికి అధీనుడై, కొందరి ప్రార్థనను వ్యాజంగా చేసికొని, ఈ దివ్యరూపంతోనే, సంసారంలోను, అవతారాలకు వెనుకబడినవారికి కోవెలలోను, గృహాల లోను అవతరించి సన్నిహితుడై ఉండే ఇతని సౌకుమార్యాన్ని తెలిసికొని, సహాయపడే వారెవ్వరూ లేరు; నేనుకూడా సహాయపడలేకున్నాను''. అని అతని ఒంటరితనానికి గర్హించి, భీతిని పొందగా, భగవానుడు "నాకు సహాయపడేవారు లేరు'' అని భయపడవద్దు. ముముక్షువులు, ముక్తులు, నిత్యులు, సిద్ధులు నాకు సహాయపడడమే జీవనయాత్రగా కలవారు కదా! నాకు అయితే వేఱే ఇంకొకరు సహాయపడవలసి ఉన్నదా!'' అని తన సర్వశక్తిత్వాన్ని దర్శింపజేసి, ఆళ్వార్లను సమాధానపఱచగా, సమాధానాన్ని పొందినవారై, ఆనందిస్తున్నారు) అని అన్నారు. ఈ అవతారికనుబట్టి ఈ దశకంలో ఆళ్వార్లు అర్చారూపిగా వేంచేసి ఉండే భగవానుని సౌకుమార్యాన్ని దర్శించి, అతనికి సహాయపడే వారెవ్వరూ లేరని భయపడగా, ఆ భయాన్ని తన సర్వశక్తిత్వాన్ని ప్రదర్శిచడం ద్వారా స్వామి తీర్చాడని తెలుస్తున్నది. ఈ దశకంలో కీర్తింపబడ్డ అర్చామూర్తి అయిన తిరువాళ్మార్బన్ వేంచేసి ఉండే దివ్యస్థలం తిరువణ్ పరిశారమ్ కనుక నాయనార్ సౌకుమార్యగుణాన్ని ఈ దివ్యదేశంలోని స్వామిలో దర్శించవచ్చునని అన్నారు. ఇక, ఈ దశకంలోని ఆళ్వార్ల సూక్తులు ఏవిధంగా భగానుని సౌకుమార్యగుణాన్ని

తెలుపుతున్నాయో గమనిద్దాం. ప్రారంభ పాశురంలో గల **"ఇనైయై"** అనే విశేషణాన్ని నమ్బిళ్ళై సౌకుమార్యగుణానుగుణంగా- **"ఇప్పడి పట్టాయెన్ఱు- నిరతిశయ సౌకుమార్య యుక్త నెన్ఱు. ఇవర్ నెఞ్జిల్ అవన్ సౌకుమార్యమే యాయిత్తు ఉఱైత్తిరుప్పతు"** అని వ్యాఖ్యానించారు. ఇటువంటి వివరణాన్నే ఇరుపత్తు నాలాయిరప్పడిలోకూడా గమనించవచ్చు. అదే విధంగా- **"ఎన్బర్ శరణమే"** అనే సూక్తిలో కాకుస్వరాన్ని భావించి, **"సుకుమారవిషయ మెన్ఱఱివారిల్లై"** అని వివరించారు. మూడవ పాశురంలోని - **"ఆఴియుమ్ శఙ్గుమ్ శుమప్పార్ తామ్"** అనే ప్రయోగంలో గల **'శుమప్పార్'** (మోసేవారు) అనే పదప్రయోగస్వారస్యాన్నిబట్టి శంఖచక్రాలను మోయడం పెనుభారంగా తోచేవారు- అనే అర్థాన్ని గ్రహించి- **"అవన్ సౌకుమార్యత్తాలే మలైఎడుత్తాప్పోలే శుమైయాయ్త్తోన్ఱు కిఱ ఇవర్క్కు"** అని వివరించారు. ఇటువంటి వివరణాన్నే పెరియవాచ్చాన్‌పిళ్ళై, నంజీయర్, అఴకియ మణవాళ చ్చీయర్ కూడా చేశారు. అదేవిధంగా **"ఓర్ మున్ఱా పురువాకి", "పడి నీణ్డు తావియ", "తిరునీలమణియార్ మేనియోడు", "తావియ నీళ్కఴల్"** అనే ప్రయోగాలను సౌకుమార్యగుణపరంగా వ్యాఖ్యానించిన నంబిళ్ళై, నంజీయర్, పెరియవాచ్చాన్ పిళ్ళై **"ఎమ్బెరుమాన్ తన్మైయై ఆర్ అఱికిఱ్పార్"** అనే ప్రయోగాన్ని **"సర్వేశ్వరనాన ఉన్నుడైయ సౌకుమార్యత్తై శిలరాలే అఱియలాయిరున్దతో! అన్యపరరాయిరుక్కిఱవర్కళ్ ఉన్ సౌకుమార్యత్తై అఱియ వల్లవర్కళ్!"** ఇత్యాదిగా సౌకుమార్యగుణానికి అనుగుణంగా వివరించారు. అంతేకాక చివరి పదియవ పాశురానికి అవతారికను అనుగ్రహించే నంజీయర్, పెరియవాచ్చాన్‌పిళ్ళై **"నమ్ సౌకుమార్యాదికళై అనుసంధిత్తు ప్పరివరాయ్ నమక్కు రక్షకరాయిరుప్పార్ అనేకర్ ఉళర్; ఒరుత్తర్ పరియవేణ్డాతపడి నాన్ పెరుమిడుక్కన్"** అని పల్కినందువల్ల శ్రీదేశికులు నిర్వచించిన **"మహాబలత్వేఽపి పుష్పహాస ఇతి నామ దుహానమ్ సౌకుమార్యమ్"** అనే సౌకుమార్య లక్షణం ఈపాశురంలో సుసంగతమవుతున్నది అని స్పష్టపడుతున్నది. ఈ విధంగా ఈ దశకాన్ని సమగ్రంగా సౌకుమార్యగుణానుగుణంగా ఆఴ్వార్లు అనుగ్రహించి నందువల్ల, పూర్వాచార్యులు తదనుసారంగా వ్యాఖ్యానించినందువల్ల, నాయనార్ ఈ దశకంలో ప్రధానంగా కీర్తింపబడ్డ తిరువణ్‌పరిశారమ్ అనే దివ్యక్షేత్రంలో అర్చామూర్తి అయిన తిరువాఴ్మార్బన్ అనే స్వామిలో సౌకుమార్యం ప్రకాశిస్తున్నదని పలికారు. ఈ విధమైన స్వారస్యాన్ని మిగిలిన కల్యాణగుణాల విషయంగా కూడా గమనించవచ్చు.

గొప్ప పరిశోధనాత్మకమైనది, దివ్యసూరిసూక్తి సమన్వయాత్మకమైనది. అయిన ఆచార్యహృదయగ్రంథంయొక్క వివరణాన్నిగూర్చి చేసే ఎవరి ఎటువంటి ప్రయత్నమైనా ఎంతో ధైర్యసాహసాలు, ఆగ్రంథం ప్రమేయంపై పట్టు ఉంటేగాని సఫలం కాదు.



కీర్తిమూర్తులు, మహామహోపాధ్యాయ ఉ.వే. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారి సన్నిధిలో చిరకాలం శుశ్రూష చేసి, పలు సంప్రదాయ గ్రంథాల కాలక్షేపాన్వయాన్ని పొందిన అదృష్టశాలులు, బహుశ్రుతులు అయిన ఆదర్శాచార్య శ్రీమాన్ చిత్రకవి ఆత్రేయ స్వామివారు ఇప్పటికే తిరుప్పావై పూదండ, వకుళాభరణ నాయకి, జీవన రామాయణం, ధర్మసందేహం వంటి పలు సద్గ్రంథాలను రచించి చిన్నజీయర్‌స్వామి వారివంటి మహనీయుల మంగళాశాసనాలకు పాత్రమైనారు. వీరు ఇపుడు అందించే ఆచార్యహృదయచంద్రిక ఆచార్యహృదయానికి యథాతథమైన అనువాదం కాకపోయినా, ఆ గ్రంథంలోని ముఖ్య విషయాలు ఏవీ లోపించకుండా, సమగ్రతకు కొఱత రాకుండా, అందరికీ అందుబాటులో సరళ భాషలో రచింపబడ్డ ఒకచక్కని ప్రయత్నం. ఇంతవరకు ఆచార్యహృదయానికి సరళమైన ఆంధ్రభాషలో అనువాదం రాని లోటు దీనితో కొంతతీరింది అనడంలో సందేహం లేదు. వీరు ఈ అనువాదప్రయత్నంద్వారా నమ్మాఴ్వార్ల విషయంలో, శ్రీవరవరమునుల విషయంలో, స్వాచార్యుల విషయంలో, భాగవతుల విషయంలో స్వరూపానురూపమైన, వాచికమైన కైంకర్యాన్ని చేసికొని కృతకృత్యులయినందుకు వీరికి నేను హార్దంగా అభివందనాలను సమర్పిస్తున్నాను. వీరు ఆచార్యహృదయంలోని నాల్గు ప్రకరణాలలో గల విషయాలను వింగడించి వాటిని మొత్తం 18 అధ్యాయాలుగా కూర్చడం చాలా సమంజసం. ఆచార్యహృదయ సూత్రాల సంఖ్యలో(234) అంకెలను కూడితే తొమ్మిది వస్తుంది; వీరి అధ్యాయాల సంఖ్యలోని (18) అంకెలను కూడితే కూడా తొమ్మిదే వస్తుంది- అనే ఈ సామ్యం గమనించదగినది. తమిళభాషలో ఎక్కువ పరిచయం లేని, ఆచార్యహృదయాన్ని కాలక్షేపం చేయాలనే ఆశ కలిగినవారికి ఈ గ్రంథం తప్పక ఒక కరదీపిక అనడంలో ఏ సందేహం లేదు. అల్పజ్ఞుణ్ణి అయినా, నాపై గల వాత్సల్యంచేత శ్రీమాన్ ఆత్రేయ స్వామివారు నా స్వరూపానురూపంగా గ్రంథాన్నిగూర్చి విన్నపించ వలసినదిగా నన్ను ఆజ్ఞాపించినందుకు వారికి నేను కృతజ్ఞుణ్ణి. వారి మాటను కాదనలేక మాత్రమే ఈ విజ్ఞప్తిని చేశాను. ఈ ఆచార్యహృదయచంద్రికను ఆంధ్రదేశం లోని ప్రపన్నులంతా ఆదరించి, పఠించి ఆనందిస్తారని ఆశపడుతూ సెలవు తీసుకొంటున్నాను. స్వస్తి.

తిరుపతి
18-7-2010

ఇట్లు
భాగవతవిధేయుడు
ఈ.ఏ. శింగరాచార్యులు

## ఆచార్యహృదయచంద్రిక

# విన్నపము

మధురమైన మణిప్రవాళ భాషలోని **'ఆచార్య హృదయము'** ఒక అపూర్వ సత్సంప్రదాయ సాహిత్యావలోకనము. ఈ గ్రంథమునకు శ్రీమణవాళ మహామునుల సమగ్రవ్యాఖ్యానము ఒక దివ్యాభరణము.

**'ఆచార్య హృదయము'**ను తమ కాలక్షేపములో కడపటిదివ్యప్రబంధముగా మా ఉపకారకాచార్యులు **ప్రవచన శిరోమణి, మహామహోపాధ్యాయ శ్రీ ఉ.వే. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామివారు** వారి అంతరంగ శిష్యుడనైన ఈ రామానుజ దాసుడికి అనుగ్రహించారు. దీనిలోని సంక్లిష్టతను, సమున్నత భావ సంపదను స్థాలీపులాకంగా వివరించారు.

అయితే, 'ఆచార్యహృదయము'లోని అమూల్య సృజనాత్మక భావాలు, విలువైన అభిప్రాయాలు, విశిష్ట విశ్లేషణలు, స్వతంత్రతీర్పులు వరిష్ఠ ప్రతిభావంతుల నాకర్షించి, వారి ప్రవచనములద్వారా, వ్యాసముల ద్వారా, గ్రంథములద్వారా సగమునకు పైగా భక్తజనుల హృదయాలను ఇప్పటికే దోచుకొన్నవి. ఈ కారణం వలననే, ఈగ్రంథం చదువుతూంటే పలుచోట్ల 'ఈభావం ఎక్కడో చదివినట్లుందే!' అనిపిస్తుంది. ఒక రత్నాల గనిని ఎంత మంది త్రవ్వినా, జాతిరత్నాలకు లోటులేనట్లే, ఈ గ్రంథములోని భావమణులను ఎంతమంది లోతుగా అధ్యయనముచేసి అనుభవించినా, భగవద్విష యానుభవమునకు పరిమితి ఉండదు! ఆ ఆనందము, అనుభూతి అపరిచ్ఛిన్నము.

పరమహంస పరివ్రాజకాచార్యులు, శ్రీరామానుజుల ప్రతినిధులు **శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగరామానుజజీయరు స్వామివారు** 'శరణ్యా' పత్రికను స్థాపించిన ఈ పదునాలుగు వత్సరములలోను, దాసుడి సంపాదకీయ వ్యాసాలుగా, ప్రతినెలా వరుసగా ఆళ్వారాచార్యుల కథలు, వకుళాభరణ నాయకి, సత్ సంప్రదాయసంగతులు శ్రీశ్రీశ్రీ జీయరుస్వామి వారి కటాక్షముతో, వెలుగు చూచినవి. 'ఆచార్యహృదయము'నకు తెనుగుసేత గత మూడు సంవత్సరములుగా వెలువడుతూ, 2010 దీపావళి స్వాతి నక్షత్రంలో దాసుడు 78వ సంవత్సరంలో కృతకృత్యుడగునాటికి సుసంపన్నం అగుచున్నది. ఈ గ్రంథమును **'ఆచార్యహృదయచంద్రిక'** అను పేర వెలువరించుటకు



దాసుడు సంకల్పించినాడు. అంతా భగవత్ కటాక్షం. భాగవత ఆచార్య కటాక్షం. ఈ పుస్తకానికి **'ఆచార్యహృదయచంద్రిక'** అని పేరిడుటకు కారణమేమనగా ఇది **'ఆచార్య హృదయము'**నకు తు, చ తప్పని అనువాదము కాదు. విషయ అన్వయవివరణములలో సంక్లిష్టతలు లేకుండ చూడబడినది. అంత అవసరము కాదనుకున్నవి, విషయాంతర ములు వదలివేయబడినవి. కాని గ్రంథములోని ఏ ప్రకరణములోని ఏ భావములు క్లుప్తం చేయబడలేదు, లుప్తం గావింపబడలేదు. **'శరణ్యా'** పత్రికాశయమునకు అనుగుణంగా, వీలైనంత సరళభాషలో, వ్యవహారిక శైలిలో, సామాన్యులకు కూడ అర్థమయ్యే రీతిలో ఈ 'ఆచార్యహృదయచంద్రిక' వ్రాయబడినది. వెన్నెల వెలుగులు, మెరపుల జిలుగులు నిండిన 'ఆచార్య హృదయము' శ్రీమణవాళమహామునుల సుందర సమగ్రవ్యాఖ్యానముతో **వేదాంత వాచస్పతి శ్రీ ఉ.వే. శ్రీమాన్ కందాడై శేషాచార్యులు** గారి అనువాదం తోడ్పాటుతో, దాసుడి శక్తి మేరకు తెనుగు సేత లోపల, ఆలోపల వెలువడుచున్నది. ఆచార్యులవద్ద కాలక్షేపములు చెప్పుకొనువారికే గాక, సామాన్య భక్తులకు, జిజ్ఞాసువులకు ఈ పుస్తకం ఉపయోగపడాలని దాసుడి ఆకాంక్ష.

భగవదనుగ్రహంతో, సదాచార్యుల సన్నిధిలో గ్రంథకాలక్షేపాలు సాగిస్తున్న ప్రపన్నులెవరైనా, వారి ఆచార్యుల శ్రీహస్తాక్షరితో లేఖ పంపితే వెంటనే వారికి ఈగ్రంథం పంపగలనని దాసుడి మనవి

ఈ రామానుజ దాసుడు ప్రార్థించిన వెంటనే, దివ్యమంగళాశాసనం అనుగ్రహించిన, **శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామివారి సన్నిధిలో** 'కలిసి (1992) శ్రీభాష్యం' కాలక్షేపం చేసిన ఆనాటినుండి ఈ దాసుడిని అవ్యాజకటాక్షంతో చూచి, బదరీక్షేత్రంలో అరవై రోజుల శ్రీఅష్టాక్షరీ మహామంత్రదీక్షను కటాక్షించి ధన్యుణ్ణి చేసిన, శరణ్యా' ద్వారా దాసుడికొక అస్థిత్వాన్ని (సత్తు)ను కృపచేసిన సత్యసంకల్పులు, నీతి, నియమము, నిష్ఠ- అను త్రిసూత్రానుష్ఠానంతో భగవద్రామానుజులను అనుక్షణమూ తలపింపచేస్తూ, ప్రసిద్ధగ్రంథకాలక్షేప ఆచార్యులుగా, సత్సంప్రదాయ అనుష్ఠాన ఆచార్యులుగా, తమ అమేయప్రతిభా సంపదతో సత్గ్రంథకర్తగా వెలుగొందు చున్న **పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ రామానుజ జీయరుస్వామి**వారికి కృతజ్ఞతాపూర్వక సాష్టాంగ దండప్రణామములు సమర్పిస్తున్నాను.

దాసుడి ప్రార్థనపై, 'ఆచార్య హృదయ చంద్రిక'కు చక్కని ప్రవేశికను ప్రసాదించిన **'పండితరత్న' వేదాంతవాచస్పతి వ్యాఖ్యాతృచక్రవర్తి శ్రీ ఉ.వే. శ్రీమాన్ డాక్టర్ ఈ.ఏ. శింగరాచార్య స్వామివారికి,** ఈ గ్రంథమును తిరుపతిలో అచ్చు వేయించి ఇచ్చిన వారి సహృదయతకు దాసుడు కృతజ్ఞతా పూర్వకదాసోహములు సమర్పిస్తున్నాడు.

'ఆచార్యహృదయం' గ్రంథసంద్రములో మునిగి, తేలడానికి దాసుడికి శక్తిని కటాక్షించిన ఆచార్యులకు శ్రీమన్నారాయణునికి, భాగవతోత్తములకు అనేకానేక దాసోహములు సమర్పిస్తూ, సెలవు తీసుకుంటున్న.

శ్రీఆండాళ్‌తిరునక్షత్రం భాగవతదాసుడు,

12, ఆగస్టు, 2010 **ఆత్రేయ**

ఆదర్శాచార్య చిత్రకవి ఆత్రేయ
555, 9 మెయిన్, 12 క్రాస్
జె.పి.నగర్-2. బెంగళూరు- 560078
ఫోన్ : 9980400555, 080-26490364
Email : adarsaacharyaatreya@yahoo.com





# అఴ్గకియ మణవాళప్పెరుమాళ్ నాయనార్

## వైభవ సంగ్రహం

ద్రావిడామ్నాయహృదయం గురుపర్వక్రమాగతమ్ ।
రమ్యజామాతృదేవేన దర్శితం కృష్ణ సూనునా ॥

(ఆచార్య పరంపరాప్రాప్తమైన ద్రావిడవేదహృదయం వడక్కు త్తిరువీదిప్పిళ్ళై కుమారులైన అఴ్గకియమణవాళప్పెరుమాళ్ నాయనార్‌ద్వారా ఆచార్యహృదయ గ్రంథరూపంలో దర్శింపజేయబడింది.)

నమ్పిళ్ళై తిరువాయ్‌మొఴ్రికి ప్రసాదించిన ఈడువ్యాఖ్యను గ్రంథస్థం చేసిన మహోపకారకులు వడక్కుత్తిరువీదిప్పిళ్ళై అనే ఆచార్యవర్యులు. వీరి ఇద్దఱి కుమారులలో పెద్దకుమారుడు శ్రీపిళ్ళైలోకాచార్యులవారు కాగా, రెండవవారు అఴ్గకియమణ వాళప్పెరుమాళ్ నాయనార్. వీరే ఆచార్యహృదయకారులు.

శ్రీపిళ్ళైలోకాచార్యులవారు జన్మించిన తరువాత మొదటి అబ్దపూర్తినాడు నంబిళ్ళై మొదలైన పెద్దలంతా శ్రీరంగాలయానికి వెళ్ళినపుడు, స్వామి నమ్పిళ్ళైను చూచి అర్చాముఖంగా "మీవంటి కుమారులను (పిళ్ళైలోచార్యులవారిని) వడక్కుత్తిరు వీదిప్పిళ్ళైక్కు అనుగ్రహించారు కదా ! ఇపుడు నావంటి కుమారుని ఇంకొకనిని పిళ్ళైకు అనుగ్రహించండి'' అని నియమించగా, నమ్పిళ్ళై ఆవిధంగానే వడక్కుత్తిరువీదిప్పిళ్ళైను అనుగ్రహించారు. తత్ఫలంగా వడక్కుత్తిరువీదిప్పిళ్ళైకు మార్గళి (మార్గశిర) మాసంలో ధనిష్ఠానక్షత్రంనాడు ఇంకొక కుమారుడు కలిగాడు. వారే అఴ్గకియమణవాళప్పెరుమాళ్ నాయనార్. వీరి తల్లిగారి పేరు శ్రీరంగనాచ్చియార్. శ్రీరంగనాథుని దివ్యాజ్ఞవల్ల జన్మించినవారు కావడం వల్ల శ్రీరంగనాథుని తిరునామం అయిన **"అఴ్గకియమణ వాళన్'** అనే పేరే వీరికి పెట్టబడింది.

తండ్రిగారి వలెనే పరమవిరక్తులైన శ్రీపిళ్ళైలోకాచార్యులవారు, నాయనార్ ఇద్దరు లౌకికవిషయాలలో వైరాగ్యభంగం వాటిల్లకూడదనే ఉద్దేశ్యంతో నైష్ఠిక బ్రహ్మచారులు గానే తమ జీవితాన్ని పూర్ణంగా గడిపారు. ఈ గొప్పతనంవల్లనే గృహస్థులై ఉండే మిగిలిన బ్రహ్మచారులు **"ప్రపన్ననుక్కు విహితవిషయనివృత్తి తన్నేఱ్ఱమ్"** అని పలుక డానికి సందేహించగా, శ్రీపిళ్ళైలోకాచార్యులవారు ఈ అపూర్వార్థాన్ని శ్రీవచన భూషణంలో సూత్రీకరించారు.

తండ్రి అయిన వడక్కుత్తిరువీధిప్పిళ్ళై సన్నిధిలో నాయనార్ పంచసంస్కారాలను పొంది నిత్యానుసంధానాదులను అధికరించారు. శ్రీభాష్యాదిగ్రంథాలను, శ్రుతప్రకాశిక రహస్యాలు మొదలైన సకల శాస్త్రార్థాలను అనుగ్రహించిన వారు నంబిళ్ళై. తిరువాయ్ మొళి మొదలైన దివ్యప్రబంధాలను, వాటి వ్యాఖ్యలను బోధించినవారు అన్నగారైన శ్రీపిళ్ళైలోకాచార్యులవారు.

నాయనార్ అనుగ్రహించిన గ్రంథాలలో అత్యుత్తమ గ్రంథం ఆచార్యహృదయం. శ్రీవచనభూషణాన్నిగూర్చి కొందరు ఆక్షేపించగా, అందులో తెలుపబడ్డ మహార్థాలను సుప్రతిష్ఠితం చేయడంకోసం శ్రీరంగనాథుడు నాల్గు తిరువీధులలో వేంచేసే ఒకానొక సమయంలో ఆచార్యహృదయంలోని నాల్గు ప్రకరణాలను ఒక్కొక్క ప్రకరణం ఒక్కొక్క వీధి చొప్పున, అనుగ్రహించారనే ప్రసిద్ధమైన ఐతిహ్యం ఉన్నది. ఈ గ్రంథాన్ని సాక్షాత్తుగా ఆలకించిన శ్రీరంగనాథుడు ఆనందంగా ఆమోదించి అనుగ్రహించాడట. ఈ గ్రంథమే కాక, తిరుప్పావై ప్రబంధానికి ఆఱాయిరప్పడి అనే విస్తృత గంభీరవ్యాఖ్యను, అమలనాదిపిరాన్, కణ్ణినుణ్ శిఱుత్తాంబు మొదలైన దివ్యప్రబంధాలకు వ్యాఖ్యానాలను, అరుళిచ్చెయల్ రహస్యమ్ అనే రహస్యత్రయార్థవివరణాత్మకమైన స్వతంత్ర గ్రంథాన్ని రచించారు. **"తణ్ణీరాల్ వైయకురువిన్ తమ్బిమన్నుమణవాళముని శెయ్యుమవై తాముమ్ శిల"** (ఉపదేశరత్తినమాలై-47) అని అంటూ శ్రీవరవరమునులు, నాయనార్ కొన్ని ప్రబంధాలకు విస్తృతవ్యాఖ్యలను కృపజేసినట్లు తెలిపారు.

నాయనార్, శ్రీపిళ్ళైలోకాచార్యులవారికి వయస్సులో రెండు, మూడు సంవత్సరాలు మాత్రమే చిన్న, సుమారునూఱేండ్లు **"కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతం సమాః"** అనే రీతిలో భగవద్భాగవత కైంకర్యాన్ని నిర్వహిస్తూ గడిపిన నాయనార్ శ్రీపిళ్ళైలోచార్యులవారు జీవించి ఉండగానే ఆచార్యశ్రీపాదసన్నిధిని చేరారు. శ్రీపిళ్ళైలోకాచార్యుల వీరి విశ్లేషాన్ని సహించలేక చాలా పరితపించి, వీరి శ్రీచరణాలను తమ శిరస్సుపై పెట్టుకొని- **"మాముడమ్బై మన్నుమణవాళవణ్ణలొడు శేముడన్ వైకున్దమ్ శెన్దక్కాల్- మామెన్ఱు తొట్టురైత్త శొల్లుమ్ తుయన్దన్నిలాళ్ పొరుళుమ్ ఎట్టెళుత్తు మిజ్గురైప్పారార్?"** అని అంటూ విలపించారట.





## అళకియమణవాళ ప్పెరుమాళ్ నాయనార్ వాళిత్తిరునామం

**మన్నియాశీర్ మదిళరఙ్గమ్ మకిళవన్దోన్ వాళియే**
**మార్గళియిల్ అవిట్టత్తిల్ వన్ద వళ్ళల్ వాళియే**
**మిన్నుపుకళ్ ఆరియమనమ్ మొళిన్దరుళ్వోన్ వాళియే**
**మేన్మై మికు తిరుప్పావై విరిత్తురైప్పోన్ వాళియే**
**తెన్నురైయిల్ ఉలకారియన్ తిరువడియోన్ వాళియేశౌ**
**శ్రీకృష్ణపాదకురుశెల్వమైన్దన్ వాళియే**
**అన్నపుకళ్ ముడుమ్బై నమ్బిక్కన్బుడైయోన్ వాళియే**
**అళకియమణవాళన్దన్ అడియిణైకళ్ వాళియే**

(స్థిరమైన సంపదను కల, ప్రాకారాలచే పరివేష్ఠితమైన శ్రీరంగం ఆనందించే టట్లుగా అవతరించిన వారికి మంగళం. మార్గళిమాసం ధనిష్ఠానక్షత్రంలో అవతరించిన ఉదారులకు మంగళం. ప్రకాశించే కీర్తిని కల ఆచార్యహృదయం గ్రంథాన్ని అనుగ్రహించినవారికి మంగళం. మిక్కిలి గౌరవాన్ని కల్గిన ఆఱాయిరప్పడి వ్యాఖ్యను తిరుప్పావైప్రబంధానికి రచించినవారికి మంగళం. ద్రావిడప్రబంధ వ్యాఖ్యానాలను శ్రీపిళ్ళైలోకాచార్యులవారి సన్నిధిలో అధికరించినవారికి మంగళం. శ్రీకృష్ణపాదగురువుల గారాబుపట్టికి మంగళం. స్థిరమైన కీర్తిని కల ముడుంబైవంశంలో జన్మించిన శ్రీపిళ్ళైలోచార్యులవారి విషయంలో భక్తిని కలవారికి మంగళం. అళకియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ శ్రీచరణాలు రెండిటికి మంగళం.)



# ఆచార్యహృదయం కాలక్షేపం ఆరంభంలో పఠించవలసిన ప్రార్థన

శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్ ।
యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్ ॥

లక్ష్మీనాథసమారమ్భాం నాథయామునమధ్యమామ్ ।
అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరమ్పరామ్ ॥

యో నిత్య మచ్యుతపదామ్బుజయుగ్మరుక్మ వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే ।
అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసిన్ధోః రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥

మాతా పితా యువత యస్తనయా విభూతిః సర్వం యదేవ నియమేన మదన్వయానామ్ ।
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణయామి మూర్ధ్నా॥

భూతం సరస్య మహదాహ్వాయ భట్టనాథ శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్ ।
భక్తాంఘ్రిరేణుపరకాలయతీన్ద్రమిశ్రాన్ శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్॥

ఆచార్యస్వాంతవక్తార మభిరామవరాభిధమ్ ।
శ్రీకృష్ణతనయం వందే జగద్గురువరానుజమ్ ॥

పణవాళరవణై ప్పళ్ళిపయిల్ పవర్ క్కెవ్వుయిరుమ్
కుణపోగ మెన్ట్ల కురుగైక్కదిప నురైత్త తుయ్య
వుణర్ వావినుట్పొరుళొన్టు మఱియా వులగఱియ
మణవాళన్ మాఱన్ మనమురైత్తాన్ వణ్ ముడుంబై వేందే

మాదవత్తోన్ మాఱన్ మనంగూఱుం మణవాళన్
తోదవత్తి త్తూయ్మఱైయోరాన పెత్తార్ నీతియినాల్
ఆంగవర్తాళ్వేర్ పెత్తారాయి మణవాళమునియిన్
పూంగమలత్తాళ్గళ్ నెంజే పోత్తు

తన్దరుళ వేణు న్దవత్తోర్ తవప్పయనాయ్ ।
వన్ద ముడుమ్బైమణవాళా శిన్దైయినాల్ ।
నీ యురైత్త మాఱన్ నినైవిన్ పొరుళనైత్తు ఎన్ ।
వా యురైత్తు వాళుమ్ వకై ॥





## మొదటి అధ్యాయము

# ఆచార్యహృదయచంద్రిక

అవతరణము : సదాచార్య సమాశ్రయణము చేసిన ప్రపన్నులు తమ సత్సంప్రదాయ కాలక్షేపములలో చివరిగా అధ్యయనం చేసే గ్రంథం ఆచార్యహృదయం. ఈ గ్రంథమును అనుగ్రహించినవారు అళకియమణవాళ పెరుమాళ్ నాయనార్. వీరు అష్టాదశ రహస్యములను కృపజేసిన శ్రీపిళ్ళైలోకాచార్యుల వారి తమ్ములు. శ్రీరంగనాథుని వరప్రసాదులు. వీరు ఆచార్య హృదయముతో బాటు, అరుళిచ్చెయల్ రహస్యము అను ఒక గ్రంథమును రచించినారు. ఈ గ్రంథంలో వీరు తిరుమంత్రము, ద్వయమంత్రము, చరమశ్లోకార్థములను ఆళ్వారుల పాశురముల ఆధారముగా వివరించినారు. ఇంకా, ద్రావిడామ్నాయ హృదయము అను మఱొక గ్రంథమును, 'తిరుప్పావుకు' ఆఱాయిరప్పడి అను విపుల వ్యాఖ్యానాన్ని అందించారు. శ్రీనాయనార్ ఆచార్యహృదయము వ్రాయుటకు కారణమును గూర్చి ఐతిహ్యము లున్నవి.

### ఆచార్య హృదయము- ఐతిహ్యములు

శ్రీపిళ్ళైలోకాచార్యుల వారు తమ శ్రీవచనభూషణములో కొన్ని వర్ణాశ్రమ విధులను గురించి విరుద్ధంగా వ్రాశారని కొంతమంది పండితులు శ్రీరంగనాథునికి విన్నవించారట. విషయం తెలుసుకుందామని శ్రీరంగనాథుడు అర్చకులద్వారా శ్రీపిళ్ళైలోకాచార్యుల వారిని పిలువనంపిరట. ఆ సమయంలో పిళ్ళైలోకాచార్యులవారు ఇంటిలో లేనందువల్ల, వారి తమ్ములగు శ్రీనాయనారు శ్రీరంగనాథుని సేవించి శ్రీవచన భూషణముపై వచ్చిన ఆక్షేపములకు సమాధానం చెప్పుటకు ఉద్యమించారట. పెరుమాళ్ళు ఉత్సవములో నాలుగు వీధులు చుట్టి వచ్చేలోపుగా నాలుగు ప్రకరణములతో ఆచార్య హృదయము రచించి శ్రీరంగనాథుని సన్నిధిని సమర్పించారట!

శ్రీవచనభూషణమును గురించి శ్రీవేదాంతదేశికులవారు తమ రహస్యత్రయ సారములో చేసిన కొన్ని విమర్శలకు సమాధానముగా శ్రీనాయనారులు ఆచార్య హృదయము రచించిరని ఒక అభిప్రాయమున్నది. 'నమ్మాళ్వారుల అభిప్రాయమే' ఆచార్య హృదయమని కొందరు చెప్పుదురు.

ఆచార్యహృదయములోని చూర్ణికలు అన్నీ నాలాయిర పాశురములను ఉట్టంకించును. ఈ గ్రంథములోని భాషాశైలి మిక్కిలి కఠినము. గొప్ప పండితులకు జ్ఞానానుష్ఠానములున్న ఆచార్యులకే తప్ప ఈ గ్రంథము సామాన్యులకు అర్థము కాదు. అయితే శ్రీమణవాళ మహామునులు ఈ గ్రంథమునకు కృపజేసిన విశద

వ్యాఖ్యానము మనకు కరదీపిక. ఈ వెలుగులో మనము ఈ బృహత్ గ్రంథమును కొంతవరకు అర్థము చేసికొనగలము. ఆచార్యహృదయము ఒక జ్ఞాన సాగరము. లోతుగా మునుగు వారికే దీనిలోని రత్నాలు లభ్యమవుతాయి. ఆచార్య హృదయము కన్న ముందు శ్రీవచనభూషణమును లోతుగా అధ్యయనము చేయుట అవసరము.

శ్రీవచనభూషణములో శ్రీపిళ్ళైలోకాచార్యులవారు పురుషకార వైభవము, ఉపాయ వైభవము, సదాచార్య సమాశ్రయణము మున్నగు అనేక విషయములను సవిస్తరముగా చెప్పి, కడపట మోక్షోపాయము ఆచార్యుడేనని తేటతెల్లము చేసిరి. ఆచార్య పదవి ఎంత గొప్పదో భగవంతుని నరనారాయణావతారమే ప్రకటించినది. తిరుమంత్ర ద్వయమంత్ర ఉపదేశములు సాక్షాత్తు పరమాత్మయే పరమాచార్యునిగా ఉపదేశించినవే గదా! భగవద్గీత జగద్గురువుగా శ్రీకృష్ణుడు పదేశించినదే గదా!

కాని, ఆచార్యలక్షణము లేమిటో, వారి వంశము లెట్లుండ వలెనో, వారి జ్ఞానా నుష్ఠానములు ఎటులుండవలెనో, వారి దినచర్య లెటులుండవలెనో - ఈవిషయము లన్నింటినీ శ్రీవచనభూషణము బాగుగా వివరించలేదు. క్లుప్తముగనే చెప్పినది. అన్నగారు రచించిన శ్రీవచనభూషణములోని ఈకొఱతను తీర్చుటకై తమ్ముడు శ్రీనాయనారులు బాగుగా ఆలోచించి, నిదర్శన పూర్వకముగ ఆచార్యవైభవమును తెలిపే ఈ ఆచార్య హృదయమును వెలయించిరి. ఈగ్రంథములో వీరు శ్రీనమ్మాళ్వారును ఉదాహరణముగా తీసికొని, ఆచార్య లక్షణములను సూక్తులను తుదముట్ట వివరించిరి.

ఆచార్యుల కుండవలసిన ప్రధాన లక్షణములు నాలుగు- సద్వంశము, జ్ఞానము అనుష్ఠానము, పరోపదేశము. ఈ లక్షణములను శ్రీనమ్మాళ్వారులో చూపించుచు, తొలి ప్రకరణమున, శ్రీశఠకోపుల జన్మశ్రీకృష్ణుని, శ్రీవేదవ్యాసుని జన్మల కంటెను విశిష్టమైనదిగా అభివర్ణిస్తారు. రెండవ ప్రకరణంలో, శ్రీనమ్మాళ్వారుల జ్ఞానాతి శయమును, ఆయన కృపజేసిన గ్రంథములలోని పాశుర చరణముల నుట్టకించుచు నిరూపిస్తారు. మూడవ ప్రకరణంలో, శ్రీశఠకోపుల వారి దివ్యదేశ అనుభవములను విస్తారంగా ప్రస్తావిస్తారు. చివరి నాల్గవ ప్రకరణంలో శ్రీనమ్మాళ్వార్లు తిరువాయ్ మొళి గ్రంథం ద్వారా చేసిన దివ్య ఉపదేశములను విశదంగా వివరిస్తారు. ఈ 'ఆచార్య హృదయచంద్రిక'లో ఇవన్నీ ప్రకరణములలో గాక, అధ్యాయములలో వివరింపబడినవి.

యథార్థముగా, శ్రీవచనభూషణము, ఆచార్యహృదయము- ఈ రెండును ఒక గ్రంథమని చెప్పవచ్చును. **"జ్ఞాన మనుట్టాన మివై"** అని శ్రీమణవాళ మహామునులు సాయించినట్లు, శ్రీవచనభూషణము జ్ఞానభాగమును, ఆచార్య హృదయము అనుష్ఠాన భాగమును వివరించు ఒకే గ్రంథ రాజముగ విరాజిల్లును.



శ్రీనాయనారులు సర్వశాస్త్ర పండితులేగాక, నాలుగు వేల దివ్యప్రబంధమును కరతలామలకము చేసికొన్న అప్రమేయ ప్రతిభామూర్తి. అంతేకాదు. వారు తమ సర్వ స్వతంత్ర అభిప్రాయములను కడు సాహసముగ నిక్కచ్చిగా పాఠకుల ముందుంచు ధీశాలి. విషయము ఎంత గహనమైనను, మనోరంజకముగ విపులముగ చెప్పగల అమేయశక్తి సంపన్నులు.

**ఆచార్యస్వాంతవక్తార మభిరామవరాభిధమ్ ।**
**శ్రీకృష్ణతనయం వందే జగద్గురువరానుజమ్ ॥**

ఆచార్యహృదయం దివ్యప్రబంధ ప్రాశస్త్యం గురించి తెలుసుకున్నాము. పెరియజీయర్ (శ్రీమణవాళమహామునులు) విశద వ్యాఖ్యానముతో ఈగ్రంథమును పరిచయం చేసుకునే వినమ్ర ప్రయత్నం ఇది. అకించనులం ఈ జ్ఞాన సాగరంలో మునుగుతున్నాం. ఎలా, ఎప్పుడు ఎక్కడ తేలుతామో ఆశ్రియఃపతికే ఎఱుక !

శ్రియఃపతి, సర్వస్వామి అయిన సర్వేశ్వరుడు నిరతిశయ ఆనందమయమగు శ్రీవైకుంఠమున నిత్యసూరులచే సదా సేవింపబడుచుండును. నిత్యవిభూతి (శ్రీవైకుంఠము) లో నిత్యసూరులు, ముక్తజీవుల వలె, లీలావిభూతి (ఈ ప్రపంచము)లో ఉండే మనము కూడ స్వామికి నిత్యకైంకర్యము చేసికొని ఆనందించుటకు అవకాశం ఉన్నది.

అయితే మనమాభాగ్యమునకు నోచుకొనక, నానాకష్టాలు పడుతున్నాము. అట్టి జీవులను (మనల్ని) ఉజ్జీవింప చేయవలెనను సంకల్పముతో శ్రియఃపతి వీరికి దేహేంద్రియముల నిచ్చెను. జ్ఞానప్రకాశమును, ప్రవృత్తినివృత్తులను కలుగజేసెను. వివేక సాధన సంపత్తులను అలవరచుకొనుటకు వేదశాస్త్ర దీపముల నిచ్చెను. ఇవన్నీ కష్ట సాధ్యములైనందున సులభమైన అష్టాక్షరీ మంత్రమును ఉపదేశించెను. వివిధ అవతారములనెత్తి లోక రక్షణకై పాటుపడెను. ఇన్ని చేసినా, మనము బాగుపడలేదు! **'మాటి మాటి పలపిఱప్పుం పిఱన్దు'** అన్నట్లు, మారి అనేక జన్మల నెత్తినా శ్రియఃపతి సన్నిధికి చేరుకొనలేక పోయినాము.

ఇక, మహాపురుషుల దివ్యబోధనలద్వారా, ఈ ప్రపంచమును బాగుచేయతలచి, శ్రియఃపతి తన దివ్యాంశమును నమ్మాళ్వార్లలో ప్రవేశపెట్టి, కటాక్షించెను. మహనీయు లైన నమ్మాళ్వార్ శ్రీసూక్తులే సర్వలక్షణ యుక్తమగు 'తిరువాయ్‌మొళి' దివ్యప్రబంధ మయ్యెను. శ్రీమణవాళ మహామునులు అనుగ్రహించిన అవతారికను క్లుప్తంగా తెలిసికొన్న మనం ఇక ఆచార్యహృదయం గ్రంథాధ్యయనానికి పూనుకొందాం.

## రెండవ అధ్యాయము

# పరమకారుణ్యమూర్తి - శ్రియఃపతి

ఈ ప్రబంధము **'కారుణికనాన సర్వేశ్వరన్'** అను శ్రీసూక్తితో ప్రారంభమగుచున్నది. శ్రియఃపతి పరమకారుణ్యమూర్తి. స్వతంత్రుడు కూడ. దయగల వాడే అయినా, స్వతంత్రుడు కాకపోతే, తాను అనుకున్నట్లు ఏమీ చేయజాలడు. అట్లే, కృపగలవాడు కాకపోతే స్వతంత్రుడైనా ఏమీ చెయ్యడు. అందువల్ల కృప, స్వేచ్ఛ- రెండూ కలిగి సంసారి చేతనులను ఉద్ధరించేవాడు శ్రియఃపతి. అతడు కృపామూర్తి అయిన లక్ష్మీదేవితో విశిష్టుడు. 'సర్వేశ్వరన్' అను పదము ఈశుని (నియమించువాని) ఈశితవ్యుని (నియమింపబడువాని) మధ్య సంబంధమును తెలుపును. ఇచట ముందు 'కృప'ను తరువాత 'సంబంధమును' చెప్పుట వలన, సంబంధమే ముఖ్యమైనదిగ చెప్పినట్లయినది. అనాదిగా దేవునికి జీవునితో గల సంబంధమే, అభిమానమే, ఆయనను కృపామూర్తిని చేయునని తెలియుచున్నది. అజ్ఞానాంధకారములో కొట్టుమిట్టాడుచున్నవారికి జ్ఞానదీపమిచ్చి సదసద్వివేకమును గలిగించు కరుణా సముద్రుడే పరమాత్మ. వివేకము వలన ఫలము ఏమంటే ఏది స్వీకరింపవలెనో, ఏది విడిచిపెట్టవలెనో మనకు తెలియును. ఇచ్చట నమ్మాళ్వారులు ప్రసాదించిన **'వీడుమిన్ ముత్తవుమ్', 'అత్తరై పత్తు'** అను పాశురములు మనస్సులో అనుసంధింపవలెను. అపుడు దుఃఖము త్యాజ్యమగును. సుఖము ఉపాదేయ మగును.

**'ఇన్నముదెన్నత్తోన్ఱి'** (తిరువాయ్‌మొళి-7-1-8) అని ఆళ్వారులన్నట్లు, శబ్దాది విషయములు భోగ్యములుగా ఎట్టి వారినైనను భ్రమింపజేయును. దుఃఖమును కలిగించును. దుఃఖము పోయి, సుఖములు ఎట్లు కలుగును? **'కళిప్పుమ్ కవర్వుమత్తు'**- గర్వము కష్టము తొలగి, అన్నట్లు అల్పము, అస్థిరము, దోషభూయిష్ఠమగు విషయలాభము వలన కలుగు గర్వమూ, ఆ గర్వము లేకపోవుటచే దుఃఖము పోవును. షడ్భావ వికారములు పుట్టుక, ఉనికి, మార్పు, వృద్ధి క్షయము, నాశములు పోయి శుద్ధ సత్త్వముగా ప్రకాశించు అప్రాకృత శరీరము పొంది- **'అన్దమిల్ పేరిన్బమ్'** -మేరలేని గొప్ప ఆనందము- అనగా పరమపదములభించును.

సంసారులకు వచ్చు లెక్కలేని దుఃఖములకు హేతువేది? **'మఱన్దేనున్నై మున్నమ్'** (మునుపు నిన్ను మరచి ఉంటిని) అని తిరుమంగై ఆళ్వార్ సాయించినట్లు ఆత్మ విషయమై తెలిసికొనకుండుటయే! **'పిరవినోయరుప్పాన్ ఱిలే నిరున్దేన్'** అని వారే ఆనతిచ్చినట్లు, సంసారమును త్యజించుటకు కోరికగాని, దానికి కావలసిన ధైర్యముగానీ



లేకుండుట **'అమ్బరి శరిన్దుకొణ్డు'** (తిరుమాల్-38) (కోరవలసిన కైంకర్యములు తెలిసికొని) అని తొండరడిప్పొడి ఆళ్వార్ చెప్పినట్లు చేతనుడు పురుషార్థ విషయ జ్ఞానమును అనగా అర్థ పంచక జ్ఞానమును తెలిసికొని ఉండవలెను.

**ప్రాప్యస్య బ్రహ్మణోరూపం ప్రాప్తుశ్చ ప్రత్యగాత్మనః,**
**ప్రాప్త్యుపాయం ఫలం ప్రాప్తే స్తథా ప్రాప్తి విరోధిచ ॥**

అని 'వృద్ధహారీత' లో వివరించినట్లు ప్రాప్యుడగు పరమాత్మ స్వరూపము, ప్రాప్తయగు జీవాత్మ స్వరూపమును, ప్రాప్తికి వలసిన ఉపాయమును, ప్రాప్తి ఫలమును, ప్రాప్తి విరోధులును చేతనుడు కోరి తెలుసుకొనవలెను.

అతి ముఖ్యమైన ఈ అర్థపంచకమును మనము తెలుసుకొన లేకుండుటకు కారణము రెండు ఎక్కువగుట! ఒకటి తక్కువగుట! అనగా సత్త్వ రజస్తమో గుణములలో రజస్తమో గుణములు ఎక్కువగా, సత్త్వగుణము బాగా తక్కువగా నుండుట. రజస్తమోగుణములు అన్యథా జ్ఞానమును, విపరీత జ్ఞానమును కలుగజేయును. సత్త్వగుణము సరియైన జ్ఞానమును కలుగ జేయును.

సారాంశమేమంటే, అనాదిప్రకృతి సంబంధమువలన అవిద్య. దీని మూలముగ పుణ్య, పాపకర్మలు, వీటివలన అజ్ఞాన హేతువైన జన్మము, దీని వలన రజస్తమో గుణముల వృద్ధి, దీనివలన అర్థ పంచక జ్ఞానము లేకపోవుట, దీని మూలముగ ప్రాప్తించునదే సంసారదుఃఖము. అట్లే అనాది భగవత్ సంబంధము మూలంగా, మనకు పరమాత్మ సౌహార్దము, కృప, కటాక్షములు కలిగి, దాని వలన సత్త్వగుణము వృద్ధిపొంది, దీని వలన అర్థపంచక జ్ఞానము కలిగి, దీని మూలమున **'జ్ఞానాన్మోక్షః'** అన్నట్లు జ్ఞానము వలన మోక్షము కలుగును.

**'అడియేన్ అడైన్దేన్ ముదల్ మున్నమే'** (తిరువాయ్‌మొళి -1-2-10) దాసుడు మొదటి నుండియే నిన్ను ఆశ్రయించి ఉండువాడు అని ఆళ్వార్ సాయించినట్లు నారాయణుడు నారములకు (జీవులకు) అయనము (ఆశ్రయము) కద!

అచిత్ (ప్రకృతి)సంబంధముతో ఆత్మ లోహపు చిట్టెముతో మాణిక్యము చేరినట్లు పరమాత్మ సంబంధముతో అదే ఆత్మ ఒక కీటకము కందీరీగ సామ్యము బొందునట్లగును. ఇది ఎట్లగునో తెలిసికొందము.

ప్రకృతి (అచిత్) సంబంధముతో ఆత్మలోహపు చిట్టెముతో మాణిక్యము చేరినచో ఏమగునో అట్లే అగును. అనగా లోహపు చిట్టెములోని మాణిక్యము కాంతి పోగొట్టు

కొనును. చిట్టెములోని మాణిక్యము కాంతి పోగొట్టుకొనును. లోహము దానిని తినివేసి బొత్తుగ ఉనికిలేకుండ చేయును., **'అన్నలత్తొణ్పొరుల్'** - ఆనందము, తేజోరూపములు అయిన ఆత్మవస్తువులు- అని తిరువాయ్‌మొళిలో (1-2-10) నమ్మాళ్వారులానతిచ్చి నట్లు ప్రకృతి సంబంధముతో హానిపొందును. **'అసన్నేవ స భవతి'** అన్నట్లు అట్టివాడు ఆత్మకలిగినను లేనివాడు అగును.

అదే భగవంతునితో ఆత్మకు సంబంధము ఏర్పడినచో కందిరీగతో కీటకము నకు సామ్యమేర్పడి నట్లగును. అది ఎట్లనగా, కందిరీగవంటి ఒక పురుగు ఒక కీటకమును తెచ్చి, ఒకచోట నుండి దాని చుట్టూ మట్టితో గూడుకట్టి, దానికొక సన్నని రంధ్రముంచి, దానిలో నుంచి ఊదు చుండును. అపుడు ఆ కీటకము ఎటూపోలేక, తనను అచటకు తీసుకువచ్చిన కందిరీగనే మనసున స్మరించుచుండును. తుదకు కందిరీగగా అగును. ఇదిలోక ప్రసిద్ధము. అట్లే, **'పొరుళల్లాత వెన్నై'** (తిరువాయ్ మొళి-5-7-3)లో ఆళ్వారులు 'ఒక వస్తువుగా చూచుటకు తగని నన్ను' అని నివేదించినట్లు ఆ ఆత్మయొక్క తక్కువస్థితిని జూడక విభువగు పరమాత్మ తనతో ''పరమం సామ్యముపైతి'' (ముండకోపనిషత్-3-1-3) పరమ సామ్యమును పొందుచున్నాడు. అపుడు ఆ ఆత్మను 'సన్తమేనంతతో విదుః (అంతట సత్తగల వానినిగా తెలిసికొందురు). అపుడు ఇంతకు ముందుండిన పాపములేగాక, రాబోవు పాపములును తొలగును. **'తిరుమాలే నానుమ్ ఉనక్కుప్పళవడియేన్'** ఓ శ్రియఃపతీ ! నేను నీ కింకరుడను- అని పెరియాళ్వార్ సాయించినట్లు, అనాదిగా నుండు శేషశేషి సంబంధము స్థిరపడును. **'ఉరవేల్ నమక్కింగొళిక్క వొళియాదు'** మీతో మా సంబంధం పోవునది కాదు- అని ఆండాళ్ తల్లి చెప్పినట్లు భగవత్ సంబంధము సహజమైనది నిత్యమైనది.

వాత్సల్యములో కన్నతల్లి మన్ను తినాలని ఆశపడిన బిడ్డను తినరానిదైన మన్నును తినిపించి తరువాత ఆ మాంద్యమును పోగొట్టుటకు మందు ఇచ్చునట్లు, **'ఎవ్వుయిర్క్కుమ్ తాయోన్'** సమస్త ఆత్మలకు తల్లివంటివాడు. (తిరువాయ్‌మొళి) పరమాత్మ చేతనుల రుచికనుగుణముగ ఐహిక బంధములను కల్పించి, తరువాత వాటిని తొలగించి తనతో సంబంధమును స్థిరపరచును. కర్మ,జ్ఞానము, భక్తి- వీటికంటె మిన్న అయిన ప్రపత్తి నిండుగా కలిగి ఉన్న చేతనులు పరమాత్మ భోగమును పొందుదురు. దీనినిబట్టి తేలేదేమిటంటే భగవంతుడు మనకు ప్రవృత్తి, నివృత్తులను ప్రసాదించును. స్వప్రయత్న నివృత్తి రూపమగు ప్రపత్తి చేతనునకు పారతంత్ర్యమును కలుగజేసి, అతని నుజ్జీవింప జేయును.



**చతుర్విధార్థములు**

1. దేవ, మనుష్య, తిర్యక్, స్థావరాకారముగ నాలుగు విధముల శరీరము.
2. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర రూపముగ నాలుగు విధముల వర్ణము.
3. బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్యాములను నాలుగు విధముల ఆశ్రమము.
4. 'ఆర్తో జిజ్ఞాసు, రర్థార్థీ, జ్ఞానీచ' అన్నట్లు నాలుగు విధముల అధికారము.
5. ధర్మము, అర్థము, కామము,మోక్షము అను నాలుగు విధముల ఫలము.
6. సాలోక్యము, సామీప్యము, సారూప్యము, సాయుజ్యము అను నాలుగు విధముల మోక్షమును.
7. కర్మ, జ్ఞానము, భక్తి, ప్రపత్తి అను నాలుగు విధముల సాధనమును,
8. పంచాగ్ని విద్యయందు జెప్పిన గర్భగతి, యామ్యగతి, ధూమాది గతి, అర్చిరాది మార్గము అని నాలుగు విధముల గతిని,
9. కృత, త్రేతా, ద్వాపర, కలి అని నాలుగు విధముల యుగమును,
10. ధ్యాన, యజన, అర్చన సంకీర్తన రూపమగు నాలుగు విధముల యుగ ధర్మమును,
11. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, అను నాలుగు విధముల వ్యూహమును,
12. సిత, పీత, శ్యామ, నీల అను నాలుగు విధముల రూపమును
13. సృష్టి స్థితి, సంహారము, మోక్షప్రదత్వము అను నాలుగు విధముల క్రియయును,
14. ఆమోద, ప్రమోద, సమ్మోద, వైకుంఠాది రూపమగు నాలుగు విధముల వ్యూహస్థానము.

ఇట్లు చతుర్విధములు అనేకములున్నవి గదా !

వీటిని తెలుపునట్టి అనేక శాస్త్రములకు ఉనికి పట్టు మన భారతవర్షము. జంబూద్వీపమునందున్న తొమ్మిది ఖండములలో భరతఖండము ఇతర భూలోక స్వర్గముల వలె భోగభూమిగాదు. ఇది మోక్షసాధనకు అనుగుణమైన కర్మభూమి, **'అత్ర జన్మసహస్రాణాం సహస్రైరపి సత్తమ, కదాచిల్లభతే జన్తుర్మానుష్యమ్ పుణ్య పంచయాత్'** - వేలకు వేలు జన్మల తరువాత నీ ఆత్మపుణ్యాతి శయమున మానుష జన్మము నెత్తును. దుర్లభమైన ఈ జన్మము శాశ్వతమా? ఎప్పటికీ కాదు! **"మానుషో**

**దేహో దేహినాం క్షణభంగురః"** - **"మిన్నిన్నిలయిల మన్ను ఇరాక్కైకళ్"** (తిరువాయ్ మొళి)- దేహాది విషయములు మెఱపుల వలెనే అస్థిరములు. ఆత్మ ఒక్కటే స్థిరము.

**'శతాయుర్వై పురుషః'**- మనుష్యుని ఆయుస్సు, నూఱు సంవత్సరములని వేద శాస్త్రములలో చెప్పబడినను **'అనన్తపారం బహువేదితవ్య మల్పశ్చకాలో బహవశ్చ విఘ్నాః'** అన్నట్లు తెలిసికొనవలసిన దానికి అంతులేదు. విఘ్నములా అనేకములు. **'శ్రేయాంసి బహువిఘ్నాని భవన్తి మహతా మపి'** గొప్పవారికైనను, మంచి పనులకు అనేక ఆటంకములు వచ్చును. **'చంచలం హి మనః కృష్ణ ప్రమాధి బలవద్దృడమ్'**(గీత) అన్నట్లు ఒక విషయమునందు అరక్షణమైన మనుష్యుని స్థిరముగా ఉండనీయదు. ఇట్టి నిలకడలేని మనస్సుతో ధర్మశాస్త్రములను, వాని సారమును గ్రహింపగలమా?

**'అసార మల్పసారంచ సారం సారతరం త్యజేత్, భజేత్సారతమం శాస్త్రం రత్నాకర ఇవామృతమ్'** సముద్రమునుండి అమృతము తీయునట్లు సారరహితమైన దానిని, కించిత్ సారముగల దానిని సారమైన దానిని, దానికంటె ఎక్కువసారమైన దానిని త్యజించి, అన్నింటిలోను ఎక్కువ సారముగల శాస్త్ర సారమును గ్రహింపవలెను.

యజ్ఞయాగాది కర్మలను గురించి వివరించు వేదపూర్వ భాగము అల్పసారము. బ్రహ్మప్రాప్తికి సాధనములను గురించి చెప్పు ఉపనిషత్ (వేదోత్తర భాగము) సారమైనది. ఆ ఉపనిషత్తులందు చెప్పబడు పరబ్రహ్మ, పరతత్త్వ, పరంజ్యోతి, పరమాత్మ మున్నగు శబ్దములచేతను, శంభుశివాది శబ్దములచేతను ప్రతిపాదింపబడువాడు నారాయణుడే అని స్పష్టముగ చెప్పు 'నారాయణానువాకము' సారతరమైనదిగా చెప్పుదురు. భగవత్పరత్వమునకు ముఖ్య చిహ్నమగు సర్వాంతరాత్మత్వమును ప్రకాశింప జేయునదై అవ్యాపక మంత్రములుగాక, భగవన్మంత్రములలో శ్రేష్ఠములు, వ్యాపకములు అయిన మూడు మంత్రములను ప్రతిపాదించునట్టి 'విష్ణుగాయత్రి' సారతమమైనది.

అట్టి సారతమమైన విష్ణుగాయత్రిలోను వేదాంత తాత్పర్యమై **(ఋచో యజూంషి సామాని తదైవాథ్వరణానిచ, సర్వమష్టాక్షరాన్తస్థమ్'**- (చతుర్వేదములును అష్టాక్షరీ మంత్రములో ఇమిడి ఉన్నవి) అన్నట్లు సకల వేద సంగ్రహమగు తిరుమంత్రము తేనె, పాలు, అమృతము అగును. అని తిరుమంగై ఆళ్వార్ శ్రీసూక్తి.

ఈ తిరుమంత్రమును భగవంతుడు వేదములలో నుండి అనుగ్రహించిన మూడు విధములను తెలిసికొందము.



## మూడవ అధ్యాయము

# అష్టాక్షరీ మంత్రవైభవము

సకలవేద, వేదాంతసారమైన తిరుమంత్రమును భగవంతుడు మూడు విధములుగా అనుగ్రహించెను. తుమ్మెద వివిధ పుష్పములందు సంచరించి సర్వరసములు గల తేనెను గ్రహించునట్లు సర్వేశ్వరుడు వేదశాఖలందు సారభూతము లగు సమస్తార్థములను బోధించు తిరునామమును తేనెవలె భోగ్యముగ అనుగ్రహించెను. తొలుత, హంస నీటితో కలిసి ఉండు పాలను నేర్పుతో వేరుజేసినట్లు, పరమాత్మ హంసరూపియై అజ్ఞానాంధకారమును పోగొట్టు వేద శాస్త్రములను బయలు పరచినాడు. **'అముతం గొండ పెరుమాన్'** (అమృతము గొనివచ్చిన స్వామీ !) అని తిరుమంగై ఆల్వారులు ఆనతిచ్చినట్లు రాక్షసుల నుండి భయపడినవారై మరణ రాహిత్యమును గోరిన దేవతలను రక్షించుటకై క్షీరసముద్రము జిలికి అమృతము ఒలికినట్లు సంసారమునకు భయపడి మోక్షము గోరువారిని రక్షించుటకు భోగ్యమైన అమృతము వలె నుండు తిరుమంత్రమును కటాక్షించెను.

ఆ తిరుమంత్రము లోకహితమును కూర్చుటకై, శ్రియఃపతి బదరికాశ్రమమున నరనారాయణులుగా అవతరించి, తానే శిష్యుడుగా, ఆచార్యుడుగా నుండి సస్వరూప శాస్త్రము సంకోచమును పొందకుండ, ఉపదేశ, అనుష్ఠానములచే దానిని విస్తరింపజేసెను. ఎట్లు విస్తరింపజేసెననగా, **"కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్, కోహ్యన్యః పుండరీకాక్షాన్మహాభారతకృద్భవేత్"** అని విష్ణుపురాణము ప్రకటించినట్లు కృష్ణద్వైపా యనుడని పిలువబడు వ్యాసుని నారాయణునిగా తలంపుము. అట్టి సర్వేశ్వరుడైననే తప్ప మరి ఎవరు మహాభారతమును రచింపగలరు? ఇట్లే శ్రియఃపతి అనేక ముని శ్రేష్ఠులను అవతరింపజేసెను.

వేద శాస్త్రాభ్యాసమునకు విశేష యోగ్యతలు కావలెను. శాస్త్ర తాత్పర్యమగు తిరుమంత్రమునకు అట్లు అవసరము లేకుండ సర్వసామాన్యముగ శ్రద్ధగల వారందరికీ అధికారమున్నది. శాస్త్రజ్ఞులు తెప్ప కొయ్యతో ఏటిని ఈదువారు. ఒక చేతితో తెప్పకొయ్యను బట్టుకొని వేరొక చేతితో ఈత కొట్టునట్లు శాస్త్రకోవిదులు సంసార సముద్రమును ఈదుటకై ప్రయత్నింతురు. అయితే శాస్త్ర సారమును తెలిసినవారు పడవ మీద కూర్చొని నిశ్చింతగా పోవువారి వలెనే రెండు చేతులను వదలి ఎపుడు గట్టును చేరుదుమా అని నిరీక్షించుచుందురు. **"విష్ణు పోతం"** - విష్ణు రూపమగు

పడవే - వారికి రక్షకము. శాస్త్రజ్ఞులు స్వయత్నముచే భగవత్ కృప పొందవలెనని ప్రయత్నింతురు. శాస్త్ర సారమగు తిరుమంత్రమును పొందినవారు స్వయత్నమేదీ లేకుండ ఆత్మకడ తేరుటకు భగవంతుడొక్కడే ఉపాయమని గాఢముగా విశ్వసింతురు. ఇట్టి వారు పడవ నెక్కి రెండు చేతులెత్తి సముద్రమును దాటువారు. స్వప్రయత్నము చేయువారు ఒక చేతితో తెప్పకొయ్య పట్టుకొని, రెండవచేతితో ఈత కొడుతూ రేవు చేరాలనుకున్నవారు.

ఆత్మస్వరూప విషయ జ్ఞానమున స్వరూప జ్ఞానమనీ, స్వరూపయాథాత్మ్య జ్ఞానమనీ తారతమ్యమున్నది. ఆత్మ భగవంతునికి శేష భూతమైనదనీ, జ్ఞానానంద స్వరూపమనీ, జ్ఞాతృత్వాది గుణములు గలదనీ, భాగవత శేషత్వ పర్యంతమైన భగవచ్ఛేషత్వము గలదనీ, చెప్పబడినది. **'సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహబ్రహ్మణ విపశ్చితా'** ముక్త పురుషుడు పరబ్రహ్మమును, వాని కల్యాణ గుణములను అనుభవించుచున్నాడు. అని ఆత్మయొక్క భోక్తృత్వము కూడ తెలుపబడినది. అట్టి శాస్త్రము యొక్క తాత్పర్యము అయిన తిరుమంత్రార్థమును తెలిసికొనిన పిమ్మటే పారతంత్ర్య భోగ్యతా రూపమగు ఆత్మస్వరూప యథాత్మ్య జ్ఞానము ప్రకాశించును.

'శేషత్వము అనగా ఏమి ?- 'పారతంత్ర్యము' అనగా నేమి ? ఇష్టము వచ్చిన విధమున ఉపయోగపరచుకొనుటకు తగినదిగా నుండుట శేషత్వము. శేషికి యిష్టము వచ్చిన విధమున వినియోగపడుట పారతంత్ర్యము. శేషత్వము బంగారు ముద్దవంటిది కాగా పారతంత్ర్యము బంగారు నగ వంటిది. స్వరూపజ్ఞాన దశలో శేషత్వము తెలియును. స్వరూప యాథాత్మ్య జ్ఞాన (యథార్థజ్ఞాన) దశలో పారతంత్ర్యము తెలియును. స్వరూపజ్ఞానమును సూర్యునితోను, స్వరూప యాథాత్మ్యజ్ఞానము చంద్రునితోను పోల్చుతగునని ఆళ్వారుల శ్రీసూక్తి.

ఆత్మ భోగ్యవస్తువు, భోక్త (అనుభవించునట్టిది) కూడ, ఆత్మభోగ్యవస్తువు మాత్రమే అయి, భోక్తకాని పక్షమున అది సర్వేశ్వరునిచే అనుభవింపబడునే కాని, సర్వేశ్వరుని అనుభవించునది కాకపోవును. అందుకే వేద శాస్త్రమున **'అహమన్న మహమన్నం'** అనుచోట ఆత్మయొక్క భోగ్యతను తెలిపి, అంతటితో ఆగక **'అహమన్నాదః'** అంటూ ఆత్మయొక్క భోక్తృత్వము కూడ తెలుపబడినది. ఇచట 'అన్నం అనగా పరమాత్మచే అనుభవింపబడునది అని అర్థము. **'అన్నాదః'** అనగా భగవత్ గుణానుభవము చేయునది అని అర్థము. కావుననే ఆళ్వారాచార్యులు **'పడియాయ్ కిడన్దు ఉన్ పవళ వాయ్ కాణ్బేనే'** - గడపవలె పడియుండి పగడముల



వలె ఎఱ్ఱగా నుండు నీ తిరుముఖమును (అధరములను) సేవించుచున్నాను- అనుచూ తొలుత పారతంత్ర్య మూలకముగ భోగ్యతను తెలిపి, తరువాత భోక్తృత్వమును తెలిపి ఉన్నారు.

'ఆచార్య హృదయమ్' ప్రథమ ప్రకరణం. 26వ సూత్రమున ఒక విశిష్ట విషయమును చెప్పుచున్నారు. 'కర్మము అసత్యమును, అనిత్యమును అయిన వర్ణమునకు అనుగుణముగా నుండును. కైంకర్యము సత్యమును, నిత్యమును అయిన దాస్యమున కనుగుణముగా నుండును. వీటికి శాస్త్ర విధి, భగవంతుని పట్ల ప్రీతి ప్రేరకములుగా నుండును.

వర్ణమును (నేటి కులమును) అసత్యమని చెప్పుటకు కారణమేమనగా, అది ఆత్మయొక్క స్వాభావికమైన స్వరూపము కాకపోవుటచే ఎల్లకాలము ఒక్క విధముగా నుండదు. అది ఔపాధికము, అసత్యము. నశ్వరమునగు దేహమున్నంతవరకే ఉండును. దాస్యమును, కైంకర్యమును సత్యమనీ, నిత్యమనీ చెప్పుటకు కారణమేమనగా, అది ఆత్మయొక్క స్వభావికమైన స్వరూపమగుటచే ఎల్లకాలము ఒక్క విధముగ ఉండునదై ఆత్మ ఉన్నంత వరకు ఉండునది. **'ఉకన్దు పణి శెయ్‌తు'** ఇష్టపడి పనిచేయుటే కైంకర్యము. భగవంతుని అనుభవించుటలో ప్రీతి మూలకమైనది కైంకర్యము.

ప్రపన్నులు కైంకర్యమునకును, ఉపాసకులు కర్మమునకు ఆశ్రయములు. గాయత్రీ ఉపదేశము పొందిన వేదవేత్తలగు కర్మనిష్ఠుల జన్మము శ్రేష్ఠమైనది. అట్లే వేదతాత్పర్యమును గుర్తెరిగినవారు, దానికిని **'తామును మాయిన శెయ్యుమ్'** అన్నట్లు తల్లి అయిన తిరుమంత్రోపదేశముచే ప్రపన్నులకు కలుగునది శ్రేష్ఠమైన జన్మము. తిరుమంత్ర ప్రసిద్ధమగు భగవత్సంబంధము విషయమై తిరుమంగై ఆళ్వార్ అనుగ్రహించిన పాశురము (తి.మొ.1-1-6) **'కులన్దరుమ్ శెల్వమ్'** తాత్పర్యము స్మరించవలెను- భగవత్సంబంధము కలిగిన పిమ్మట మంచి వంశమునిచ్చునదియు, మంచి సంపత్తునిచ్చునదియు, కర్మముల నన్నిటిని నశింపజేయునదియు, పరమపదము నిచ్చునదియు, పెద్ద స్థానమగు కైంకర్యము నిచ్చునదియు, భగవంతుని ఇచ్చుటయే గాక, భగవదనుబవమునకు కావలసిన వాటి నన్నిటిని ఇచ్చునదియు, కన్నతల్లివలె హితములైన వాటినన్నింటిని ఇచ్చునదియు, కైంకర్యము రుచి రూపమగు భక్తి నొసంగునది అయిన **'నారాయణ'** అను తిరునామమును నేను కనిపెట్టితిని, అని తిరుమంగై ఆళ్వార్ శ్రీసూక్తి.

ఇకపై కర్మనిష్ఠులు, ప్రపన్నులు ఈ ఇరువురి కూటస్థులను పేర్కొనుచున్నారు.

కర్మనిష్ఠులు, గోత్ర చరణ కూటస్థులు పరాశర, పారాశర్య, బోధాయనాదులు. ప్రపన్నుల కూటస్థులు. నమ్మాళ్వార్. తిరుమంగైఆళ్వార్, శ్రీభాష్యకారాదులు. గోత్ర చరణ కూటస్థులు పారాశర్యాదులు ఇచట చరణములనగా వేదశాఖలు. అట్టి శాఖలనధ్యయనము చేసిన వారిని కూడ 'చరణములు' (చరణులు) అనియే పిలుతురు. అన్ని వేద శాఖలను ప్రవర్తింప జేసినవాడు వేదవ్యాసుడే అయినా, ఆయన తరువాత ఆయా శాఖలను ప్రత్యేకముగ ప్రవర్తింపజేసిన వారు కరక, కలాప, కణ్వాదులు అయినందున పారశర్యాదులని 365వ సూత్రమున జెప్పబడినది.

సూత్ర కూటస్థులు బోధాయనాదులు. సూత్రమనగా కర్మానుష్ఠానమును ప్రతిపాదించు కల్పము. అనేక కల్పములను రచించిన ఆపస్తంబ అశ్వలాయనాదులను కూడ కలుపుకొని బోధాయనాదులని పేర్కొన్నారు.

**'పత్యుః శ్రియః ప్రసాదేన ప్రాప్త సార్వజ్ఞ సంపదమ్, ప్రపన్న జన కూటస్థం ప్రపద్యే శ్రీ పరాంకుశమ్'** - శ్రియఃపతి అనుగ్రహము వలన దివ్యజ్ఞానమును పొందిన వారు ప్రపన్న జన కూటస్థులగు శ్రీనమ్మాల్వారులను శరణు జొచ్చుచున్నారు. **"కూటస్థులు"** అనగా మూల పురుషులు. ఇతరులకు ఉపదేశించియు, తాము అనుష్ఠించియు ప్రపత్తి మార్గము తలయెత్తునట్లు చేసి, దానిని వృద్ధిపరచిన వారగుట వలన వీరు ప్రపన్న జనకూటస్థులని పిలువబడుచున్నారు.

**'స్వాధ్యాయోధ్యేతవ్యః'**- వేదము నధ్యయనము చేయవలసినది అన్నట్లు మొదట వేదములను ఆచార్యుని వద్ద సంత చెప్పుకొని ఆచార్యుడుచ్చరించిన రీతిని ఉచ్చరించుచు, వేదమంత్ర రాశిని గ్రహించి, మీమాంసా శాస్త్రము మున్నగు వాని సాహాయ్యముతో వేదార్థములను తెలిసికొని, ఆచరించితే బ్రాహ్మణత్వము సిద్ధించును. అట్లే, వేదరూపమై వేయి శాఖలు గల తిరువాయ్‌మొళిని ఆచార్యుని వద్ద సంతచెప్పుకొని, ఆచార్యోపదేశ మూలముగ దాని అర్థమును తెలిసికొని, అందు చెప్పిన ప్రకారం అనుష్ఠింపగలిగితే వైష్ణవత్వము సిద్ధించును.

## ద్రావిడ సంస్కృత వేద సామ్యము :-

నిజమే కాని సంస్కృత వేదమునకు ద్రావిడ వేదమునకు సామ్యమున్నదా ? ఉన్నది. వేదమునకు అంగోపాంగములున్నట్లు దీనికిని గలవు. ఋగ్వేదము మొదలుగా గల నాలుగు వేదములకును శీక్ష, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, కల్పము, జ్యోతిషము అనుషడంగములును, మీమాంసా శాస్త్రము, న్యాయశాస్త్రము, పురాణము



ధర్మశాస్త్రము మున్నగు ఉపాంగములు ఎనిమిది చేరి మొత్తము పదునాలుగున్నట్లు, ద్రావిడ వేదములు (తిరువాయ్‌మొళి ఇత్యాది) నాలుగింటికి, **'కలియన్ వాయొలి శెయ్‌త పనువల్'** తిరుమంగై ఆళ్వారులు సాయించిన శాస్త్రము- అన్నట్లు వారి ప్రబంధములు (వేదాంగములు) మిగతా ఎనిమిది మంది ఆళ్వారులు సాయించిన ప్రబంధములు కలిసి పదునాలుగగును.

అయితే వేదములు అపౌరుషేయములు గదా! ద్రావిడ వేదములట్లు కావుగదా! ఆళ్వారులు రచించినవి గదా! అనవచ్చును. **'అనాది నిధనాహ్యేషా వాగుత్ సృష్టా స్వయంభువా'** ఆది అంతములు లేని ఆ వేదవాక్కు బ్రహ్మముచే బయలు పరువబడినది. పరబ్రహ్మము చతుర్ముఖ బ్రహ్మను సృజించగా, అతడు వేదములను వెలయించినాడు. మొదట పరబ్రహ్మమే బ్రహ్మకు వేదములను సాక్షాత్కరింప జేసినాడు. అట్లే, ఋషులు వేదమంత్ర ద్రష్టలైనారు. నారాయణ రూపుడైన వేదవ్యాసుడు వేదరాశిని విభజించి లోకమునకు ప్రకాశింపజేసినాడు. **'ఉలకమ్ పడైత్తాన్ కవియాయ్ నేఙ్కు'** (తి.వా.3-9-10) కవి అయిన నాకు జగత్తు సృజించిన శ్రియఃపతికి అని నమ్మాళ్వార్ అనుగ్రహించినట్లు సర్వేశ్వరుడే తన వాక్కులనే తమ ద్వారా వెలయింప జేసినారని శఠకోపమునులన్నారు గదా! ఆ విధముగా శ్రీమన్నారాయణుని దివ్య ఆస్థాన కవిగా శఠకోప యతీంద్రులు ప్రసిద్ధులు. వారి 'ఇయర్పా' అనబడు తిరువిరుత్తము. తిరువాశరియము, తిరువన్దాది అను మూడు ప్రబంధములు వరుసగా ఋగ్వేదము, యజుర్వేదము, అథర్వణవేదముల స్థానంలో ఉంటాయి. గానరసముతో మంచి నాదముతో నుండు- శఠకోపుల నాల్గవ కావ్యము, తిరువాయ్‌మొళి సామవేదముగా వెలసినది. 'విశ్వకవి'గా శఠకోపులు ప్రాతఃస్మరణీయులు.

తిరువాయ్‌మొళిని ఛాందోగ్య ఉపనిషత్‌కు సమానమని కూడ పెద్దలు చెప్పుదురు. శ్రీరామాయణములో వలె గంగ జన్మవంటి అన్య విషయ ప్రస్తావనలు లేక శ్రియఃపతి విషయమే గల బృహత్ కావ్యము తిరువాయ్‌మొళి. కొందరు పూర్వాచార్యులు ఈ గ్రంథమును శాస్త్రార్థములను నిర్ణయించుటకు ఆకరగ్రంథముగా నుంచుకొనిరనిన దీని ప్రామాణ్యము తెలియును.

శ్రీమహాభారతము, భగవద్గీత క్రమముగ పంచమ వేదముగను, ఉపనిషత్తులు గను అయినట్లు తిరువాయ్‌మొళి కూడ వేద వ్యాఖ్యగును, వేద రహస్యముగ నగును. అయితే సంస్కృత వేదమునకు గల పలు అలంకారములు ద్రావిడ వేదమగు తిరువాయ్ మొళికి గలవా? అను సందేహమునకు సమాధానము ఇది- ఉదాత్తాది స్వరములును,

పద, క్రమ, జట, వాక్య, పంచాదులును పాద, వృత్త, ప్రశ్న, కాండ, అష్టక, అంశ, పర్వాదులైన వేదాలంకారముల వలెనే అక్షరం, అశై, శీర్, పన్దమ్, అడి, తొడై, నిరై నిరై, ఓశై, తళై, ఇనమ్, యాప్పు పా, తురై పణ్, ఇశై, తాళమ్, పత్తు, నూరు, ఆయిరమ్ మొదలగు అలంకారములు ద్రావిడ వేదమునకును గలవు.

అంతేగాక మట్టితో జేరి కలుషితమై సహ్యాద్రి నుండి ప్రవహించు జలము. 'తోతవత్తి' (నిర్మలమై పవిత్రమైన శాస్త్రజ్ఞులనెడి రేవు), 'శంగణితురై' (శంఖములచే నలంకరించి ఉన్న తామ్రపర్ణీ తీరము) అను రేవుల లోనికి వచ్చినపుడు స్వచ్ఛజలమై, లోపల నుండు వానిని ప్రకాశింపజేసినట్లు, అల్పజ్ఞులచే దూషితముగా చేయబడిన వేదము యథార్థ జ్ఞానమునకు ఆశ్రయమగు ఆళ్వారుల జేరి తేటపడి అనగా దోషరహితమై సమస్తార్థములను తెలుపును. మేఘము త్రాగిన సముద్ర జలము వలెనే వేద విద్యా సాగర వచనము నమ్మాళ్వారుల వాక్కును పొందిన తోడనే సర్వదా సర్వాధారమగును కద!

తిరువాయ్‌మొళి గ్రంథమును రచించిన నమ్మాళ్వారులు చతుర్థ కులమున జన్మించిన వారు కదా! మరి ఆ గ్రంథము ప్రమాణమెట్లగును? అన్న ప్రశ్నకు సమాధానము యిది- భగవద్విషయమనిన ప్రీతి జూపునట్టి ప్రపన్నుల గృహములందు వారి కిష్టమైన పదార్థమును శరీరముగా గొని ఆనందమును పెంపుచేయునట్టి అర్చావతార విషయమున 'ఇది ఈ లోహముతో జేయబడినది' అను ద్రవ్య నిరూపణము ఎంత దోషమో, అట్లే నమ్మాళ్వారుల జన్మ నిరూపణము అంతే దోషము. కులమును మాత్రమే చూచు అల్పబుద్ధులకు పంచమ వేదముగా ప్రసిద్ధికెక్కిన మహాభారతమును, శ్రీభగవద్గీతయును త్యాజ్యములు కావలసివచ్చును. అట్లనుకొనిన తక్కువ కులమువాడగు గుహదేవుడు, ఎక్కువకులమువాడగు శ్రీరామచంద్రునికి సరిసమాన స్నేహితుడగునా? **'ఆత్మ సమస్సఖా!'** అని శ్రీరాముడు అతనిని పిలుచునా? శబరి శాలలో విందారగించునా? కృష్ణుడు విదురినింట విందారగించునా? కావలసినది కులముకాదు. భగవదనుగ్రహమే! నమ్మాళ్వారును, తిరువాయ్‌మొళిని గౌరవించిన వారికి భగవదనుగ్రహము కరతలామలకము.

ఇంతటితో 'ఆచార్య హృదయము' ప్రథమ ప్రకరణము 'ఆచార్య హృదయ చంద్రిక'లో మూడవ అధ్యాయము సుసంపన్నమైనవి.



## నాలుగవ అధ్యాయము

# ఆళ్వారుల భక్తి స్వరూపము

భగవద్విషయ సంబంధము లేని వర్ణాశ్రమములు జ్ఞానానుష్ఠానములు శవాలంకారముల వంటివని, గాన నిష్ప్రయోజనములని హేయములని చెప్పి 'ఆచార్య హృదయము' గ్రంథములో ప్రథమ ప్రకరణము సమాప్తి చేసిరి. ఇక, రెండవ ప్రకరణంలో మొదటి సూత్రము ఇది. **'అణైయవూరప్పునైయ, అడియుమ్, పొడియుమ్ పడ, పర్వతభవనంగళిలే, ఏతేనుమాక జనిక్క పెఱుకిఱ'** తిర్యక్ స్థావరజన్మంగళై పెరుమక్కళుమ్ పెరియోరుమ్ పరిగ్రహిత్తు ప్రార్థిప్పర్‌కళ్' -శేషశయనముగాను, గరుడపక్షిగాను, తులసి చెట్టుగాను, భగవంతుని శ్రీపాదములును, వాని దాసుల శ్రీపాదధూళియును తమపై బడునట్లు వేంకటాచలమునను, శ్రీవైష్ణవుల గృహములందును ఏదైనా ఒకటిగా, జన్మింపగోరుచు నిత్యసూరులు, శ్రీశుకాది మహర్షులు ప్రార్థించుచుందురు. ఆత్మనిరూపకమైన 'శేషత్వమునకు అనుకూలమైన జన్మమేదైనను ఉత్కృష్టమై ఉజ్జీవన హేతువగునని ఈ మొదటి సూత్రము నిరూపించును.

స్పృశించిన సుఖముగా ఉండునది, శైత్యము, మార్దవము సౌలభ్యము స్వభావముగా గలది శ్రియఃపతి శయనించుటకు అన్ని విధముల తగినది. ఆదిశేషువు గదా! ఇక శ్రియఃపతి సంతోషముతో ఆర్తరక్షణకు, అనుకూలురను ఆనందింప జేయుటకు గరుడపక్షిని వాహనముగా జేసికొని తిరుగును కదా! **'తోళిణైమేలుమ్ నన్మార్ పిన్మేలుమ్ శుడర్ ముడి మేలుమ్, తాళిణైమేలుమ్ పుణన్ద తణ్ణన్దు'ళాయ్-** రెండు భుజముల మీదను, మేలైన వక్షస్థలము మీదను, ప్రకాశించు కిరీటము మీదను, శ్రీపాదద్వయము మీదను సమర్పింపబడిన చల్లని తులసి దళములుగల స్వామివారు అని తిరువాయ్‌మొళిలో నమ్మాళ్వారులు కృపచేసిరి గదా! ఇట్లే శ్రియఃపతి శ్రీపాదస్పర్శగలుగుటకు, వాని భక్తుల శ్రీపాదధూళి పడుటకు, ఆస్వామి ప్రేమించినట్టి దివ్యదేశమునగాని, వారి భక్తులభిమానించిన ప్రదేశమున గాని నివసించుటకను కూలమగు జన్మను- ఒక లతగా, ఒక ఔషధిగా, ఒక కదంబ వృక్షముగా, యమునా తీరమున కుందవృక్షముగా, స్వామి పుష్కరిణిలో నారపక్షిగా, చేపగా, సంపెగగా, స్వామికైంకర్యమునకు నిత్యము ఉపయోగించు ఒక పాత్రగా, గర్భగుడిలో గడపగా, కీటకముగా నైన- పుట్టు భాగ్యము కలుగవలెనని ఉద్ధవుడు, శ్రీకులశేఖర పెరుమాళ్ మున్నగు భాగవతోత్తములు స్వామిని కీర్తించి, ప్రార్థించిరి గదా!

శేషత్వము లేని కేవలము జ్ఞానానందమయమైన ఆత్మను కోరుకొనని వారికి దేహ సంబంధమైన వర్ణము ఆదరణీయమా? ముమ్మాటికీకాదు. అని చెప్పుటకు విశ్వామిత్రుడు వ్యాసుడు, దత్తాత్రేయుడు, శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, నమ్మాళ్వారు ఉదాహరణములు. అవతారపురుషులైన వీరి జన్మ వర్ణములనిరూపింప ప్రయత్నించుట మహాపచారము. విడువదగిన వర్ణవ్యవస్థానిరసనమునకే భగవంతుడు ఒక్కొక్క యుగములో ఒక్కొక్కవర్ణములో నవతరించెను!

భగవంతుని విశేషకటాక్షము ఉండవలెనేగాని, జన్మవర్ణములు ప్రతిబంధకములు గాబోవు అని శ్రమణి (శబరి), విదురుడు, గోపికలు ఋషిపత్నులు నిరూపించిరి.

నమ్మాళ్వార్ల విషయమున, **'ఎన్నై తన్నాక్కి'** (తిరువాయ్‌మొళి-7-9-1) అన్నట్లు తనతో సమానముగ జ్ఞానశక్తులు కలవారినిగా శ్రియఃపతి జేయగా, ఆళ్వారులు **'ఊరుమ్ నాడుములకముమ్ తన్నై పోలవనుడైయ పేరుమ్ తార్కళుమే పితత్తి'** (తి.వా. 6-6-2) అన్నట్లు భగవత్ సంబంధము కల లోకుల నందరిని తమ వలెనే భగవదనుభవ పరులనుగా జేసిరి. దీనికంతయు హేతువు భగవంతుని నిర్హేతుక కటాక్షవిశేషమేగదా! అట్లు గాకున్న, మనము ఎన్నిజన్మములెత్తి ఎన్ని సాధనలు చేయవలెనో గదా!

వేలకొలది జన్మలలో చేసిన సత్కర్మల వలన ప్రసిద్ధ వంశములలో జన్మించి, చదివి, వ్రాసి, తత్త్వజ్ఞులై, గాయత్రీ జపము, సంధ్యావందనము, పంచమహాయజ్ఞములు (దేవ, పితృ, భూత, బ్రహ్మ, మనుష్య యజ్ఞములు), అధ్యయన, అధ్యాపన, యజన, యాజన, దాన, ప్రతిగ్రహములను షట్కర్మలను జేసి, ఇటువంటి నిత్యకర్మాను ష్టానములలో నిష్ణాతులు కావలసి ఉండును. అంతేకాదు. వివేక, విమోక, అభ్యాస, క్రియా, కల్యాణ, అనవసాద, అనుద్ధర్షములను సాధన సప్తకమును అనుష్ఠించవలసి ఉండును. ఈ సాధన సప్తకమును సంగ్రహంగా తెలిసికొందాము.

**వివేకము :** - 'జాత్యాశ్రయనిమిత్తా దుష్టాదన్నాత్కాయశుద్ధిర్వివేకః- పుట్టుకతోనే చెడ్డవి- ఉల్లి, వెల్లుల్లి, ములగ మున్నగునవి జాతిదుష్టములు. వేరొక దాని సంబంధము వలన చెడునట్టివి- అధర్మ కార్యములద్వారా ఆర్జించినవి ఆశ్రయదుష్టములు. ఏదో ఒక నిమిత్తమువలన చెడునట్టివి- ఎంగిలి, వెంట్రుకలు మున్నగునవి పడి చెడి పోవునవి నిమిత్త దుష్టములు ఈ మూడు దోషములు లేని ఆహారమును వివేచనముతో భుజించుట వివేక మనబడును. ఇవి వివేకము కాయశుద్ధిని అంతఃకరణ శుద్ధిని కలిగించును. **'ఆహారశుద్ధౌ సత్వశుద్ధిః'** పరిశుద్ధమైన ఆహారము వలన సత్వశుద్ధి



కలుగును అని శృతి. ఇట సత్వమనగా అంతఃకరణము- అని శ్రీభాష్యకారులును, వివేకమనగా అంతఃకరణ శుద్ధికి మూలమగు అన్నశుద్ధి అని ఆచ్చాంబిళ్ళైవారును సాయించి ఉన్నారు.

**విమోకము :- 'విమోకః కామానభిష్వఙ్గః'** -కామములో ఆతురుత లేకుండుట. ఏదో ఒక వికారము వలన విషయములననుభవింపకుండ ఉండజాలరు. అట్టి వికారమే అభిష్వంగ మనబడును. అట్టి కోరిక లేకుండుట అనభిష్వంగము.

**అభ్యాసము :- 'ఆరంభణ సంశీలనం పునః పునరభ్యాసః'** అన్నట్లు ధ్యానమున కాధారమైనట్టి వస్తువు (ఆలంబనము) నందు అనేక పర్యాయములు పరిశీలనము జేయుట. ఇచట ఆలంబనమనగా శుభాశ్రయము- శ్రియఃపతి.

**క్రియ :-** పంచమహాయజ్ఞాది నిత్యకర్మలను యథాశక్తి అనుష్ఠించుట. ఆచరణమే శ్రీచరణములను చేరుటకు ఆలంబనము.

**కల్యాణము :-** సత్యము, ఆర్జవము, దయ, దానము, అహింస, అనభిధ్య కల్యాణ మనబడును. సత్యమనగా భూతహితము. ఆర్జవమనగా మనోవాక్కాయములలో ఏక రూపముగా నుండుట. దయ అనగా స్వార్థమును అపేక్షింపక పరుల దుఃఖమును జూచి సహింపజాలక వారి దుఃఖమును పోగొట్టుటకు ప్రయత్నించుట, దానమనగా లోభము లేకుండ ప్రదానము చేయుట. అహింస అనగా త్రికరణముగా పరులను పీడింపకుండుట. ఇతరులు చేసిన అపకారములను మనసులో పెట్టు కొనక పోవుట, పరుల వస్తువులను తనవని తలంపకుండుట అనభిధ్యము అనబడును.

**అనవసాదము :-** సాధన సప్తకంలో వివేకము, విమోకము, అభ్యాసము, క్రియ, కల్యాణములను గురించి తెలిసికొన్నాము. ఇపుడు ఆఱవదైన **'అనవసాదము'** గురించి విశిష్టార్థం తెలుసుకుందాం. దేశకాలములు విషమించుట వలన, శోక, భయ హేతువు లగు విషయములను స్మరించుట వలన మనస్సుదైన్యము నందుట అవసాదనమ బడును. అది లేక పోవుట అనవసాదము.

**అనుద్ధర్షము :-** దేశకాలములు అనుకూలముగ నుండుట చేతను, ప్రియ విషయములను తలచుకొనుట చేతను కలుగునట్టి సంతోషము మితిమీరకుండుట అనుద్ధర్షమనబడును.

వీటితోబాటు శమము (అంతఃకరణ నియమనము), దమము (బాహ్యేంద్రియ నిగ్రహము) వృద్ధి పొందవలెను. ఇవి ఆత్మగుణములలో ప్రధాన మైనవి.

అంతేకాదు. ఆత్మకు హానికరమైన ఎనిమిదింటిని తొలగించుకొనవలెను. అవి ఇవి : కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య, అసూయ, అజ్ఞానములు. ఆ పైన అవలంబించవలసిన ఎనిమిది ఉన్నవి. పరిమళభరితమైన భోగ్యమైన ఈ ఎనిమిది పుష్పవిశేషములతో శ్రియఃపతిని ఆరాధించవలెను. అహింస, ఇంద్రియ నిగ్రహము, సర్వభూతదయ, క్షమ, జ్ఞానము, సత్యము, ధ్యానము, తపము - ఈ ఎనిమిది విష్ణువుకు ప్రీతికరములు. సాధన సప్తకములో వీటి ప్రస్తావన ఉన్నను, సర్వేశ్వరునికి నిత్యార్చన వలెనే, ఇవి నిత్యాచరణలో నుండవలెనని పుష్పవిశేషములుగా పేర్కొనబడినవి.

ఇట్టి క్లిష్టమైన 'యోగ నీతి' పరమైన సాధ్యసాధన భక్తి నవలంబించి ఆత్మను సాక్షాత్కరించుకొను వారు అరుదుగా నుందురు. అట్లుగాక, సిద్ధిసాధన భక్తిని (ప్రపత్తి) స్వీకరించిన వారు ముందుగ భగవంతుని అనుగ్రహమునకు పాత్రులగుదురు. ఆళ్వారుల భక్తి పైరెండు విభిన్నభక్తిమార్గములలో దేనికి చెందును ? వారి భక్తి పైరెండు విధములకు చెందనిది. విశిష్టమైనది. అది స్వప్రయత్నముతో సాధించు కొనగలిగినట్టి ఉపాయరూపమగు భక్తికాదు. కాగా, భగవదనుభవ నిష్ఠమై ఉపాయ ఫల రూపమున లభించునట్టి సిద్ధభక్తియును గాదు!

**'ఆటియాక్కాలత్తుళ్ళే యడిమైక్కణన్బు శెయ్‌విత్తు'** (తి.వా. 2-3-3) -జ్ఞానము లేని కాలమున కైంకర్యమున ప్రీతికలుగజేసిన వాడవు' అని చెప్పినట్లు జ్ఞానముండునట్లు ఊహించుటకును అవకాశము లేని బాల్యముననే ప్రాప్తిఫలమగు కైంకర్యము నందు అత్యంత ప్రీతిని కలుగజేసినావు. తులసిలో పరిమళము వలెనే పుట్టుకతోనే సహజముగ **'తళువినిన్ఱ కాదల్'** (తి.వా.4-7-11) 'చేరియున్నప్రీతి' అన్నట్లు విడిచిపెట్టవలయునను కొన్నను విడిచిపోకుండ నిత్యమునుండు **'కట్టమే కాతల్'**- 'బహుచెడ్డ ఆశను కల్పించినా వని నమ్మాళ్వారులు సాయించినారుగదా! **'ఆటెనక్కు నిన్ పాదమే శరణాగత్తన్దొళిన్దాయ్'** (తి.వా. 5-7-10) ఉపాయముగా నీ శ్రీపాదములనే ఇచ్చితివి అని, **'అడిమేల్ శేమంగొళ్ తెన్ కురుగూర్ శడగోపన్'** నీ పాదములే క్షేమకరములుగ నమ్మాళ్వారులు స్వీకరించి, **'నాకణైమిశై నమ్బిరాన్ శరణేశరణ్'** శేషశయనమున పవ్వళించి యున్నట్టి మనస్వామి యొక్క శ్రీపాదములే శరణు అని నిశ్చయించిరి గదా ! ఫలితార్థమేమనగా నమ్మాళ్వారుల భక్తి స్వప్రయత్నముచే సాధించినట్టిది కాదు. అపేక్షించి పొందినట్టిదియుకాదు. అయితే ఇది స్వభావ సిద్ధమై సత్తకును, భోగమునకును, వృత్తికిని సాధనభూతమైనది. ఇది అంతయు ఆ శ్రియఃపతి నిర్హేతుక కృప, కృషి ఫలితమే !



సరే, బాగున్నది. అయితే ఒక సందేహము. ఈ జన్మలోనే గాక గతజన్మలలోను ఏ భక్తి, ముక్తి సాధనములను అనుష్ఠింపనివారు, మన ఆళ్వారుల వంటివారెందరో ఉండగా, భగవంతుడు వీరిని ఒక్కరినే కటాక్షించుటకు కారణమేమి? దృష్టాంతముల ద్వారా తెలిసికొందాము. ఒక దేశమునకు రాజు లేడు. రాజును ఎన్నుకోవడం కోసం, పట్టపుఏనుగును కండ్లకు గంతలు గట్టి వదిలారు. ఆ ఏనుగు దేశమంతా తిరిగింది. ఒక సామాన్య రైతును తన పైకి ఎక్కించుకుంది. ఆ రైతే రాజయినాడు. దేశంలో ఎందరో ప్రముఖులుండగా, ఆ ఏనుగు ఒక సామాన్యుడికి ఎందుకు పట్టం గట్టింది? కారణం ఎవరు చెప్పగలరు? అట్లే, రాజయినవాడు, వేటకు వెళ్ళి వరించి పెళ్ళి చేసికొని, ఆమెను పట్టమహిషి చేస్తాడు. ఎంతోమంది ఆమె కంటె అందగత్తెలుండగా, ఆమెనే ఆ రాజు ఎందుకు వరించాడు? కారణం ఎవరు చెప్పగలరు? అట్లే, లోకంలో ఎంతోమంది జీవులుండగా 'మా ఆళ్వారే' అంటూ శఠకోపులవారినే శ్రియఃపతి ఏల కటాక్షించిరి? అంటే కారణం ఏమిటి? సర్వేశ్వరుడు నిరంకుశుడు, స్వతంత్రుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సర్వనియామకుడు. ఆయన ఎప్పుడు, ఎవరిని ఏవిధంగా, ఎందుకు ఎక్కడ కటాక్షిస్తాడో ఎవ్వరూ చెప్పలేరు ! తమపై భగవత్కటాక్షము వర్షించుటకు కారణముగా తన సుకృతమేదీ లేదని తమ ఆకించన్యమును ఆళ్వారులు విన్నపించుకున్నారు.

**'మయర్వర మతి నల మరుళినన్'** (తి.వా. 1-1-1) ఇంచుకైనను ప్రమాదము లేనట్టి జ్ఞానానందములను కృపజేసిన వాడు- అని, తమకు భక్తి కలుగుటకు కారణము భగవత్ కృప అని ఆరంభించి **'ఎన్గాల్ అమ్మాన్ తిరువరుళ్‌కళ్'** (తి.వా. 10-7-5) అను పాశురము వరకును జ్ఞానదశయందును, ఉపాయవరణ దశయందును, మోక్షప్రాప్తిదశయందును సర్వసామాన్యముగ తొలినుండి తుదివరకు **'మాలరుళాల్ మన్నుకురుగూర్ శడగోపన్'** స్వస్థచిత్తుడై తిరునగరి యందున్నట్టి శఠకోపులు అనినారు. ముద్దముద్దకు నెయ్యివేసుకుంటేనే గాని తినలేని సుకుమారుల వలెనే నిలుచుండుట కున్ను వాని కృపతోనె నిల్చొనవలసిన స్వభావము గల వీరికి **'ఆరావన్బిలడియే నున్నడి శేర్‌వణ్ణమరుళాయ్'** (తి.వా. 6-10-2) అపరిచ్ఛిన్న ప్రీతితో నున్నట్టి నేను నీ శ్రీపాదములు చేరునట్టి విధమును కృపచేయుమా అనుటచే **'నలమరుళినవన్'** (భక్తిని కృపజేసినవాడు) అనుచోట భక్తికి  కారణముగా చెప్పబడినట్టి వాని కృపయే వాని శ్రీపాదప్రాప్తికిని సాధనమనిరి.

**"ఇన్నిన్ఱ నీర్మై యిని యామురామై"** (తిరువిరుత్తమ్-1) అట్లు భగవత్కృప కలిగిన పిమ్మట శరీరాదులయందు రుచివాసనాదులు సమీపకుండునట్లు చేయమని

ప్రార్థించినప్పుడే వీరి కోరికను నెరవేర్పవలసి యుండగా, వీరికి తన సంశ్లేష విశ్లేషములను కలుగజేసి, తద్వారా జ్ఞాన భక్తులను వృద్ధిపొందింప జేసిరి. సంశ్లేషము వెంటనే విశ్లేషము. విశ్లేషము వెంటనే సంశ్లేషము. ఇట్లు తనతో కలయిక, ఎడబాటులను శ్రియఃపతి కలిగించుటకు కారణమేమి? తెలిసికొందము.

శ్రియఃపతిలో సంశ్లేషము అనుభవించునపుడు జ్ఞానమును, విశ్లేషము అనుభవించునపుడు, భక్తిని వృద్ధి పొందించుట ఎట్లున్నదనగా పెద్ద కమ్మలను పెట్టుకొనుటకు వీలుగా నూలుపెట్టి, వత్తిదూర్చి, బెండుపెట్టి చెవిరంధ్రములను పెంచుటవలెను, పెక్కు రోజులు ఉపవాసమున్నవారికి, మొదటనే అన్నము పెట్టక, అన్నాన్ని నూరి వంటి నిండ పూసి, బొరుగుల గంజిని, సగ్గుబియ్యపు జావను త్రాగించి, ఆహారము ఇమిడిన తరువాత మామూలు అన్నము పెట్టినట్లును ఉండును.

**'ఆత్తవల్లనకై కాట్టుమమ్మాన్'** (తి.వా. 4-5-5) సహించునట్లు విలక్షణములయిన మార్గములను చూపించునట్టి స్వామీ! అన్నట్లు తన గుణచేష్టితాదులను చూపించి ఆళ్వారును తన దాసునిగా జేసుకొని నాడట! అయితే వీరికి జ్ఞానవృద్ధులను పెంపొందించుట ఎందుకు? అని ప్రశ్న. **'మునియే నాన్ముకనే'** అను తిరువాయ్‌మొళి వరకు మానసికానుభవము తప్ప ప్రత్యక్షానుభవము లేనట్టి వీరికి ఇవి వృద్ధిపొందుటకు అనుకూలముగ నుండు సంశ్లేష విశ్లేషము లేవి? **'కరుత్తుక్కు నన్టు మెళియనాయ్'** (తి.వా. 3-7-11) మనస్సుకు మిక్కిలి సులభుడు- అని, **'నిఱ్కుమున్నే వన్దు'** (తి.వా. 7-4-6) స్వామి నాముందర వచ్చి నిలుచున్నాడు అని 'కైక్కుమెయ్‌తాన్' (ఆలింగనము నకు అలివి కానివాడు) అన్నట్లు **'ఎళియనాయ్'** మున్నగు తావుల చెప్పినట్లు సాక్షాత్కార సమానమగు మానసానుసంధానము గానీ బాహ్యానుభవముగానీ కలుగనందువలన అంతఃకరణము శిథిలమగుచున్నది.

సంసారులకు స్వామితో సంయోగ వియోగములు కలుగుటకు పుణ్యాపాపములే గదా హేతువులు. అయితే ఆళ్వారుల విషయంలో ఏమైనది? **'శార్న్ద విరువల్ వినైకళుమ్ శరిత్తు'** (తి.వా. 1-5-10) నాతో చేరియున్నట్టి క్రూరములయిన పుణ్యాపాపములను రెంటిని పోగొట్టి అనీ, **'తిలతైలవత్ దారువహ్నివత్'** తిలలోతైలముండునట్లు, కట్టెలో నిప్పుండునట్లు అన్నట్లు విడతీయుటకు అలివి కాకుండ ఆత్మతో జేరిఉండు. పుణ్యాపాపరూపములగు క్రూరకర్మలను బలవంతులు పెద్దగోడను పడద్రోయునట్లు తానే పోగొట్టుటచే ఆళ్వారులకు ఇవి రెండూ లేవు.



ఆ సర్వేశ్వరుడే ఆళ్వారులకు జ్ఞానభక్తులను వృద్ధిపొందింపవలెననెడి ఇచ్ఛతో **'తుళక్కత్తముతమా యెంగుమ్ పక్కమ్ నోక్కఱియాన్ ఎన్‌పైన్దామరై క్కణ్ణన్'** (తి.వా. 2-6-2) నిర్భయుడై, అమృతము వంటివాడై నాయందుండి తామరపుష్పముల వంటి నేత్రములు గల సర్వేశ్వరుడు పార్శ్వమునందు చూచుటకు తెలియనివాడై ఉన్నాడు. అనగా లోక రక్షణమునుగురించి గాక మనస్సును ఏకాగ్రముగ నాయందే ఉంచి, ప్రక్కనున్న తన దేవేరుల (పిరాట్టి మారుల) వైపున్నూ చూడక, నావైపే కరుణాకటాక్షములను ప్రసరింతురు. కలయికలో ఆనందమును, ఎడబాటులో దుఃఖమును కలిగింతురు.

శ్రీనమ్మాళ్వారు జ్ఞానదశలో నున్నపుడు తామను భావముతో మాట్లాడుదురు. ప్రేమదశలో ఉన్నపుడు నాయకీభావముతో మాట్లాడుదురు. ఈ విభిన్నదశలయందు వీరి మాటలలోలాగే స్వరూపంలో కూడ తేడా ఉంటుందా? తెలిసికొందాము. **'తేఱుమ్ కైకూప్పుమ్'** (తి.వా. 7-2-5) తెలివిలో నుండి చేతులు జోడించును అని, **'కలంగి కైత్తొళుమ్'** (తి.వా. 2-4-4) వ్యాకులములో ఉన్నా చేతులు జోడించును. అని చెప్పుటలో ఏ దశలోనున్నా అంజలి ఘటింపక మానరు. దాసోహము శేషత్వసూచకము గదా! **'తేఱియుమ్ తేఱాతు మాయోన్ తిరుత్తునళే ఇత్తిరువే'** (తి.వా. 4-4-7) తెలివి ఉన్నపుడు, తెలివిలో లేనపుడు లక్ష్మివలె నుండు ఈమె శ్రీకృష్ణుని యందేమగ్నమై ఉన్నది. అన్నట్లు ఆళ్వారు ఏదశలో ఉన్నా శేషత్వరూపమగు స్వరూపము మారి పోదని నిరూపించిరి. గాన భగవత్ పరతంత్రమై 'భగవత్ భోగమునై ఉండునట్టి ఆత్మ స్త్రీవలె మాట్లాడుట స్వరూపానురూపమే గదా! ఈ విషయమును ఒక చక్కని రూపకా లంకారముచే విశదం చేస్తున్నారు.

విద్య అను తల్లికి, ఆచార్యుడను తండ్రికి పుట్టినదే ఆత్మ వస్తువు. పాలవలె, అమృతమువలె నున్న భోగ్యమైన తిరుమంత్రమును రక్షకుడైన ఆచార్యుడు ఇచ్చి ఆత్మకు స్వరూపజ్ఞానమును కలుగజేయును. ఆ తరువాత, ఆత్మను పెంచి పెద్దజేసి విశ్వపతి, లోకభర్త అయిన సర్వేశ్వరునికిచ్చి వివాహము చేయును. ఎనిమిది దారములు (అక్షరములు) గలదై, మూడు పురులు (శబ్దములు) గల తిరుమంత్రరూపమగు మంగళసూత్రంతో పాణిగ్రహణము జరుగును. సర్వేశ్వరుడు అనుగ్రహించిన పిమ్మట చతుర్థీవిభక్త్యర్థమగు కైంకర్యములో ప్రవేశింపనర్హత కలుగును. అయితే నిత్యకైంకర్యము నకు ప్రతిబంధకములుగా నుండు వివాహానంతరం శేషహోమపర్యంతమగు నాల్గవ దినము వరకు అనగా శరీరముతోనుండు కాలమును, **'నణ్ణిలుమ్ నణ్ణ కిల్లేన్ నడవే యోరుడమ్బిలిట్టు'** (తి.వా. 5-1-5) మధ్యలో శరీరమొక్కటి ఉన్నందువల్ల సర్వేశ్వరుని

సమీపించినా, సమీపింపని వాడుగానున్నాను- అని సాయించినట్లు, అనుభవవిరోధియై ప్రతిబంధకమగు శరీరముతోనుండు నాల్గు దినములు **'నాళ్ కడలై కరిమిన్'** (తి.వా. 1-6-8) కాలమను సముద్రమును గడుపుడు (ఈదుడు) అని సాయించినట్లు శ్రియః పతి స్మరణతో గడిపివేసి, ఆ తరువాత పుట్టింటిని (లీలావిభూతిని) విడిచి, మునుపు ప్రేమించిన వస్తువులతో గూడ మరల తిరిగి చూడకుండ విడచిపెట్టి, పుట్టింటిని వదలి, అత్తగారింటికి పోవునట్లు, అర్చిరాది మార్గమున పోవునపుడు మార్గమధ్యమున నుండు వారు సత్కరింపగా, నాయకుని (సర్వేశ్వరుని) వెంటబోయి, భర్తృగృహమునకు పోవుకన్యక అత్తవారి వూరి సమీపమునకు పోయిన తోడనే స్నానము చేసినట్లు అమృత వాహిని యగు విరజానదిలో స్నానము చేయును. అపుడు భర్తబంధువులు వచ్చి అలంకరించునట్లు, దివ్యాప్సరసలు ముక్తజీవుని దివ్యాంజనము, దివ్యమాలికలు, దివ్యచూర్ణము, దివ్యవస్త్రములు, దివ్యాభరణములతో **'తం బ్రహ్మాలంకారేణాలంకుర్వన్తి'** అన్నట్లు భోక్త అగు సర్వేశ్వరునికి భోగ్యమగునట్లు ఆ భాగ్యజీవుని అలంకరింతురు. **'తొక్కుపల్లాండిశైత్తు క్కవరిశెయ్‌వరేళైయరే'** (తి.వా. 7-6-11) సమూహముగా జేరి, మంగళాశాసనముచేసి చామర కైంకర్యము జేయుదురు. ఇట్లు ఆరణతో గొని పోబడునట్టి పడుచుభర్తృగృహము చేరగానే, నిత్యయవ్వనవతులు మంగళదీపాదులతో ఎదురేగి స్వాగతించునట్లు దివ్యాప్సరసలు ముక్తజీవుని ఆహ్వానించి శ్రీవైకుంఠమున ప్రవేశపెట్టుదురు. సర్వేశ్వరుడు, వాని దాసులగు నిత్యసూరులు చేరియుండుగోష్ఠిలో **'అడియేన్ వాయ్‌మడత్తు ప్పరుకి క్కళిత్తేన్'** (తి.వా. 2-3-6) మిక్కిలి, దాహముతో పానము చేసి దాసుడయిన నేను సంతోషించితిని అని సాయించినట్లు మహానందముతో పరిపూర్ణమగ, **'సోశ్నుతే సర్వాన్ కామాన్ సహ, బ్రహ్మణా విపశ్చితా'** ముక్తపురుషుడు పరబ్రహ్మముతో గూడ సమస్తభోగములను అనుభవించును.





## ఐదవ అధ్యాయము

# శ్రీనమ్మాళ్వారుల వైలక్షణ్యము

ముక్తపురుషుడు పరబ్రహ్మముతో కూడ సమస్తసుఖములను ఎట్లు అనుభవించు ననగా, **'కోప్పుడైయ కోట్టుక్కాఌట్టిల్ మితిత్తారోహిత్తు'** ఉభయవిభూతుల ఐశ్వర్యము మనోహరముగ ప్రకాశించుదంతపుకాళ్ళ దివ్యపర్యంకమున పాదపీఠమున కాలుపెట్టి ఎక్కిభరతుని, అక్రూరుని, హనుమను ఆలింగనము చేసుకొన్న, కౌస్తుభమణిని ప్రకాశింపజేయుచున్న వక్షస్థలమునందు కౌస్తుభము వలెనే భోగ్యమైనదియై ఆలింగనము చేసుకొనే ఆ ఆత్మ స్త్రీవలెనే మాట్లాడుననుటలో ఆశ్చర్యమేమున్నది? స్త్రీత్వము ఆత్మవస్తువుకు స్వాభావికముగదా!

ఇట్లు స్త్రీతో స్వామ్యము మాత్రమే గాకుండ, స్త్రీలలో ఉత్తమురాలగు పిరాట్టి (మహాలక్ష్మి)తో గూడ పరిశుద్ధమగు ఆత్మస్వరూపమునకు సామ్యము గలదని నిరూపించుచున్నారు. **'నమక్కుమ్ పూవిన్‌మిశై నంగైక్కుమిన్బనై'** (తి.వా. 4-4-8) మనకును పద్మముతో ఉన్నట్టి మహాలక్ష్మికీ ఆనందము నిచ్చువాడు- అనగా ఈదినాన ఆశ్రితులమైన మనకూ, నిత్యసూరుల కంటెను విలక్షణమైనదై, రూపగుణముల చేతను, ఆత్మగుణముల చేతను పరిపూర్ణురాలైన పిరాట్టికిని ఆనందము కలుగజేయునపుడు, ముందుగ మనకు ఆనందమొసగి, ఆ తరువాతనే పిరాట్టికి ప్రీతి కలుగజేయునట! ఏమి ఆస్వామి ఔదార్యము!

**'కోలమలర్ పావై క్కన్బాకియ వెన్నన్బే'** (తి.వా. 10-10-6) అన్నట్లు నిరతిశయ భోగ్యురాలగు పిరాట్టికి ప్రియుడై, ఆమె ఆమోదించిన నాపట్ల ప్రీతిగలవాడు. ఆమెతో గల స్నేహము ఈచేతనుని వరకు పెంపొందుచున్నది. **'కడిమామలర్ పావై యొప్పాళ్'** (తి.వా. 3-7-9) అన్నట్లు పరిమళ పుష్పమునందు అవతరించుట వలన, నిరుపాధిక ముగ స్త్రీ అయినందువలన, ఆమెతో చేతనునికి గల సామ్యమునకు హేతువులుగా అనన్యార్హ శేషత్వము, అనన్యశరణత్వము అనన్యభోగ్యత్వము, సంయోగ సమయమున ధరించి ఉండుట, వియోగ సమయమున ధరింపజాలకుండుట, సర్వేశ్వరునిచే మాత్రము నిర్వహింపదగినట్లుండుట అను ఆరు విధముల సంబంధములున్నవి గదా! అట్లే, పిరాట్టికిని సామ్యషట్కమనదగు నిరూపకత్వము, అనురూపత్వము, అభిమతత్వము, శేషత్వసంబంధాధారభావము, పురుషకారత్వము, ప్రాప్యపూర్వకత్వము మున్నగు అసాధారణ స్వభావములున్నవి గదా! ఇట్లు ఆరు విధములుగ పరిశుద్ధమైనట్టి ఆత్మకు

పిరాట్టితో సామ్యముండుట వలన, పిరాట్టి వలెనే శఠకోపనాయకిగా మాట్లాడుట వీరికి తెచ్చిపెట్టుకొన్నది కాదని తెలియును. వీరికి పెరియపిరాట్టితో సామ్యమున్నట్లే, వీరికి గల భావవిశేషములనుబట్టి, భగవంతుని కిష్టులగు మిగతా ముప్పురు పిరాట్టులతో కూడ వీరికి సామ్యమున్నదని వారి దివ్యప్రబంధములోని **'ఉణ్ణాతు', 'కిడన్దు', 'ఓర్‌మాయైయినాల్'** మున్నగు పాశురములనుండి తెలియవచ్చును.

**'ఉణ్ణాతురంగాదు ఒలికడలై యూడరుత్తు పెణ్ణాకల్ యాప్పుణ్ణు తాముత్తు పేశెల్లామ్'** (నా.తి. 11-7) భుజింపదు, నిద్రింపదు, త్రివిక్రమావతార చేష్టలనను సంధించుకొనుచు స్త్రీత్వము వలన పరతంత్రగా నుండుటయే తాను పొందిన దశ- అని సాయించినట్లు అట్లే **'కిడన్దిరున్దు నిన్దళన్ద'** అనుచోట చెప్పినట్లు, సర్వజ్ఞుడై, అవాప్త సమస్త కాముడగు (అన్ని కోర్కెలు తీరిన వాడగు) సర్వేశ్వరుడు తనను అనేక సార్లు అనుభవించినను తృప్తి పడక పిచ్చెక్కునట్లు చేయునట్టి వైలక్షణ్యముచే వచ్చిన ఆధిక్యము కలదైన పెరియపిరాట్టి వలెను. అట్లే కిరీట ధారిణియగు భూదేవితోను, **'ఓర్ మాయైయినాల్'** (తి.వి.20) మున్నగు తావుల సాయించినట్లు, నిత్యసూరులు తిరువారాధన సమర్పించుటకై సన్నద్ధులై ఉండగా, వారికి తెలియకుండానే, నైచ్యాను సంధానమున తనకంటె మించిన వారులేరని భూమిపై గొల్లకులములో చోరాగ్రణిగా అవతరించి, తన క్షేమమును సైతం లక్ష్యపెట్టక మృత్యుభయంకరములగు సప్త వృషభముల వాడి అయిన కొమ్ములను ఒకటిగా బట్టి లొంగదీసి, నప్పిన్నై పిరాట్టిని పెండ్లియాడినట్లు, ఆళ్వారు నాయిక దివ్యానుభవములను పొందిఉన్నారు గదా! ఇదే విధముగా స్వామితో తన ఎడబాటు ఎంత దుఃఖకరమైనదో ఆల్వారు నాయిక ఎన్నో పాశురములలో వివరించిఉన్నారు. **'కాయుమ్ కడుఞ్జిలైయన్ కాకుత్తన్ వారానాల్'** (తి.వా. 5-5-3) దహింపజేయు క్రూరములైన బాణములుగల శ్రీరామచంద్రుడు రాలేదు. అయ్యో! క్రూరమైన పాపముగల నేను స్త్రీగా బుట్టియు మరణించువిధము తెలియకున్నానే! అని తీరని వ్యథ చెందుదురు.

పిరాట్టి మారులు స్వామికై వెదకుచుండగా, **'పాయ్‌కై', 'ముతుమణల్', 'ముల్లైయిన్ పన్దల్'** మున్నగు తావుల జెప్పియున్నట్లు సరస్సు, సైకత స్థలము, మల్లెల పందిరి, ముంగిలి మిద్దెమున్నగు చోట్ల వస్త్రములు తస్కరించి, ఆటలను చెడగొట్టి, క్రీడాపరికరములను దొంగిలించి, మేడలనెక్కి యథేచ్ఛగా తిరిగి, చిలిపిచేష్టలతో అల్లకల్లోలము చేసినను ప్రీతితో అనుభవించి ఆనందించెడు అయిదు లక్షలమంది గోపకాంతల మధుర భావనలు ఆళ్వారునాయకికి గలవని తిరువిరుత్తములోను,



తిరువాయ్‌మొళిలోను నిరూపించిరి గదా! అంతేనా! నరకాసురుని వధించిన పిమ్మట శ్రీకృష్ణునిచే స్వీకరింపబడిన పదహారువేల మంది భామల భావనా పరమైనట్లు బలము కూడ ఆళ్వారు నాయికా పరమైనట్లు **'కడల్ ఞాలమ్', 'మిన్నిడై', 'మల్లికై', 'వేయ్‌మరు', 'పేయ్‌ములై', 'మునిన్దు', 'మర్‌పోరు', 'ఏఱార్కణ్ణై మంగనూత్త', 'వాయుమ్', 'తీర్పారై'** అను తిరువాయ్ మొళులనుండి తెలియవచ్చునుగదా ! ఇట్లు ప్రధానదేవేరులతోను, గోపికలతోను, గోపాలుడు చేరదీసిన వేలాది స్త్రీలతోను వకుళాభరణనాయికకు వారిలో ఏదో ఒక అంశమున మాత్రమే సామ్యముండగా, శ్రీ సీతాపిరాట్టితో మాత్రము అన్ని అంశములలోను సామ్యముండుట విశేషము! **'విదితః స హి ధర్మజ్ఞః శరణాగతవత్సలః, తేన మైత్రీ భవతు తే యది జీవితు మిచ్ఛసి'** - శ్రీరాముడు ధర్మాత్ముడు శరణాగత వత్సలుడు అని పేరు పొందినవాడు, కావున, అతనిని శరణు వేడి, మైత్రి చేసికొనుము' అని చెఱవంటి అశోకవనములోనుండియు రావణునికి హితబోధ జేసిన సీతాదేవి వలె, నమ్మాళ్వారుకూడ విముఖులగుసంసారుల **'పుణైవన్ పిఱవిక్కడల్ నీన్దు వార్కే'** (తి.వా.2-8-1) సంసారసముద్రమును దాటువారికి స్వామి తెప్పయై ఉండును అని హితబోధ జేసిరి. అట్లే, సీతాదేవి **'న హి మే జీవితే నాథో నైవార్థే న చ భూషణైః, వసన్త్యా రాక్షసీ మధ్యే వినా రామం మహారథమ్'** - శ్రీరామచంద్రుని విడిచి రాక్షసుల మధ్య ఉన్నట్టి నాకు ఈ జీవనము వలన ప్రయోజనమేమి? ద్రవ్యము వలన ఉపయోగ మేమి? అని చెప్పినట్లు, ఆళ్వారును, **'మారాళన్ కవరాత మణిమామైకుఱైవిలమ్'** (4-8-1) బలిష్ఠుడైన స్వామి ఆశింపని మేలైన నా మేనికాంతిచే ఏమి ఉపయోగ మున్నది? అని వ్యథజెందిరి గదా! సీతా సాధ్వి విరహాతిశయంతో **'విషస్య దాతా న హి మేస్తి కశ్చిత్ శస్త్రస్య వా వేశ్మని రాక్షసస్య'** - నాకు రామచంద్రునితో వియోగము కలిగించిన ఆ రాక్షసునింటిలో ఇంత విషమునిచ్చువారు గానీ, వెంటనే చంపు ఒక కత్తినైనా ఇచ్చువారు గానీ లేరా? - అనునట్లు **'మాయుమ్ వకై నఱియేన్'** (తి.వా. 5-4-3) చనిపోవు మార్గము నెరుగను - అని వాపోవుదురుగదా!

ఆచార్యహృదయములోని ద్వితీయ ప్రకరణములో ఆళ్వారుల భక్తిస్వరూపమును అవగాహన చేసుకునే ప్రయత్నం చేస్తున్నాము. విరహాతిశయమును వ్యక్తీకరించుటలో భగవంతుని దేవేరులకు నమ్మాళ్వారులకు గల సామ్యమును పరిగ్రహిస్తున్నాము. **'అకలకిల్లే నిఱైయుమెన్ఱలర్ మేల్‌మంగేయుఱై మార్బా'** - పెరియపిరాట్టి (మహాలక్ష్మి) నిత్యవాసము చేయుచున్న వక్షఃస్థలము కలవాడా, నిన్ను ఎడబాసి ఉండజాలను అని సీతాదేవి పరముగ జెప్పినట్లు ఆళ్వారును **'అడియేనునపాతమ్ కలకిల్లేనిఱైయుమ్'** (తి.వా.6-10-8) దాసుడనైన నేను నీ శ్రీపాదములను క్షణకాలమైనను విడిచియుండ

జాలనని చెప్పి ఉన్నందున అన్ని అంశములందును వీరికి పెరియపిరాట్టితోనే సాదృశ్యము గలదని తెలియుచున్నది.

ఈ విధముగా, పిరాట్టి వలెనే సర్వేశ్వరుని విడిచి యుండజాలని వారు ఆళ్వారొక్కరేనా? ఇంకా వేఱెవరైన ఉన్నారా? అయ్యో! లేకేమి? **'న చ సీతా త్వయా హీనా న చాహమపి రాఘవ! ముహూర్తమపి జీవావో జలాన్మత్స్యా వివోద్ధృతౌ'**- శ్రీరామచంద్రా! నీటిని వదలి మీనములుండజాలనట్లు నిన్ను విడిచి నేను, సీతాదేవియు బ్రతికి యుండలేము' అని లక్ష్మణ స్వామి ఖండితముగా జెప్పెను గదా! అట్లే శ్రీభరతులవారు, శ్రీ శత్రుఘ్నులవారు, దశరథుడు, యశోద, ప్రహ్లాదుడు విభీషణుల వారు, ఆంజనేయులు, అర్జునుడు- వీరివలె ఆళ్వారును ఉన్నారు. అది ఎట్లనగా- **'భ్రాత, భర్తాచ బంధుశ్చ పితాచ మమ రాఘవ'** - తోబుట్టువు, భర్త, బంధువు, తండ్రి- సర్వవిధబంధువు శ్రీరాముడే అని లక్ష్మణస్వామి తలచినట్లు, ఆళ్వారులకూడ కన్నీరు కార్చుచు, చేతులు జోడించి- **'తిరువేండత్తెళిల్ కొళ్శోతియెన్దైక్కు, ఒళివిళ్ కాలమెల్లాముడనాయ్ మన్ని వళువిలావడిమై శెయ్యవేణ్డుమ్ నామ్'** (తి.వా. 3-3-1) వేంకటాద్రిలో వేంచేసి ఉన్న సుందరతేజోమయదివ్యమంగళ విగ్రహముగల నా తండ్రికి ఎడతెగకుండ కాలమంతా, సర్వదేశసర్వావస్థలయందును విడువక కైంకర్యమును చేయవలయును - అని నిష్కర్షగా సెలవిచ్చిరి. లక్ష్మణుని వైశిష్ట్యమేమనగా, రాముడే తనను నియమించి, ఆజ్ఞాపించి అన్ని కైంకర్యములను చేయించుకొనవలెనని ప్రార్థించుట. అట్లే ఆళ్వారులును **'ముకప్పే కూవి ప్పణికొళ్ళాయ్'** (తి.వా. 8-5-7) (నీ సన్నిధికిం గొనిపోయి కైంకర్యమును గొనువాడవు) అని స్వామిచే నియమింప చేసుకొని నిత్యకైంకర్యము చేయనాశపడిరి. అట్లే భరతాళ్వాను కూడ రాముని ఆజ్ఞయే తన ధర్మముగా అవలంబించి **'పాదుకే చాస్య రాజ్యాయ న్యాసం దత్వా పునః పునః'** అన్నట్లు శ్రీరామపాదుకలను శిరస్సున నుంచుకొని నందిగ్రామమునకు బయలు దేరెను. **'కొళ్ళెన్ఱు కిళర్న్దెళున్ద పెరు శెల్వమ్ నెరుప్పు'** (తి.వా. 4-9-4) అన్నట్లు పైపైనివృద్ధి బొందునట్టి మేరలేని ఐశ్వర్యమునుకూడ అగ్ని తుల్యముగా దలంచి త్యజించెను.

ఇక శ్రీశత్రుఘ్నుల వారి విషయమున ఒక వైలక్షణ్యమున్నది. **'గచ్ఛతా మాతులకులం భరతేన తవానఘః, శత్రుఘ్నో నిత్యశత్రుఘ్నో నీతః ప్రీతిపురస్కృతః'** అన్నట్లు భాగవత శేషత్వమే పరమపురుషార్థమని తలచి, శ్రీభరతులవారికి శేషభూతులై, వారికి గల పావనత్వభోగ్యత్వములను మిక్కిలి ప్రేమించిరి. **'పుంసాం దృష్టి చిత్తాప హారిణమ్'** - పురుషుల ఇంద్రియములను, మనస్సును ఆకర్షించునది, వారు



స్త్రీత్వమును గోరునట్లు మోహము కల్గించునది ఐన శ్రీరాముని దివ్యమంగళవిగ్రహము నందు మనసును పోనీయక, అది తనకు గల భాగవత నిష్ఠకు నిత్యశత్రువని తెలిసినవాడు. అయినను, శ్రీరాముని పై భరతునికి గల ప్రేమాతిశయమును గమనించి భాగవతోత్తముడగు తన అన్నగారికిష్టమైనది తనకు గూడ ఇష్టము కావలెనని తలంపుతో, శ్రీరాముని మనసారా సేవించుచుండిరికదా! అట్లే శ్రీనమ్మాళ్వారును **'కోదిలడియార్'** (తి.వా.8-10-9) అనన్య ప్రయోజనులగు భాగవతులు అని పాయించినట్లు స్వరూపమునకు ముఖ్యమైన భాగవత శేషత్వరసమనునది భాగవతులను విడిచి భగవంతుని ఆశ్రయింపనీయదు. సర్వేశ్వరునికి దాసులయిన వారు చిన్నవారైనను నాకు వారే పాలకులు. అట్టివారు ఇక్కడనే సంచరించుచుండగా వారిని విడిచి స్వామిపాదములనాశ్రయించుట పాపినైన నాకు తగునా? **'అవనడియార్క్కు ఉరుమో?'** (తి.వా.8-10-3) అని పాయించినారు. అందువలన, శ్రీనమ్మాళ్వారులు శ్రీరామ చంద్రుని తోబుట్టువులతో సమానులు అని నిరూపింపబడినది.

**'న తతర్ప సమాయాన్తం పశ్యమానో నరాధిపః'** అన్నట్లు శ్రీరామచంద్రుడు వేంచేయుచుండగా దశరథ చక్రవర్తి రెప్పవాల్చకుండ చూచుచు- ఆ అనుభవమునకు తృప్తిపడక, ఇంకా ఉన్మస్తక అనుభవమునకై ఆశపడినట్లు, శ్రీనమ్మాళ్వారులు కూడ **'ఎప్పొళుతుమ్ నాళ్ తింగళాణ్డు'** (తి.వా. 2-5-4) రోజుల కొలది, వారములకొలది, సంవత్సరములకొలది అనుభవించినను **'అప్పొళుతుక్కప్పొళుతెన్నారావముతమ్'**- అప్పటికప్పుడు నాకు తృప్తిలేని అమృతము వంటివాడు- అతృప్తామృతమ్ -అన్నారుగదా!

**'యమళార్జునయో ర్మధ్యే జగామ'** అన్నట్లు ఆమద్దిచెట్లమధ్యను పోయినాడే అని యశోదానందులు శ్రీకృష్ణునికై భయమును, దిగులును పొందినవారైనట్లుగా శ్రీనమ్మాళ్వారును అప్పుడెప్పుడో జరిగిపోయిన యమళార్జున భంజన సన్నివేశము ఇప్పుడు జరిగినట్లుగా తలపోసి భయపడుచున్నారు. అట్లే భగవంతునిపై మనసుంచి తన శరీరమును మరచిన ప్రహ్లాదుని అగ్ని, సర్పములు, విషము మున్నగునవి బాధింప కుండునట్లు **'సర్వభూతాత్మకే తాత జగన్నాథే జగన్మయే, పరమాత్మని గోవిందే మిత్రా మిత్ర కథా కుతః'**- సర్వభూతముల కంతరాత్మ, జగన్నాథుడు అయిన పరమాత్మ విషయమున శత్రుమిత్ర భేద మెట్లుండగలదు? అని అన్నియు భగవదాత్మకమే గనుక అన్నీ తమకనుకూలముగా భావించి, భారమంతయు భగవంతునిపై నుంచిరి. శ్రీప్రహ్లాదుని వలెనే ఆళ్వారును ఎఱ్ఱని అగ్నిని కౌగిలించుకొని అదే అచ్యుతుడని చెప్పును. **'అరియుం శెన్దీమై త్తళువి యచ్చుతనెన్నుమ్'** (తి.వా. 4-4-3) ఇది ఆళ్వారుల నిర్భర స్థితిని తెలుపును.

శ్రీ విభీషణులవారు, **'పరిత్యక్తా మయా లంకా మిత్రాణి చ ధనాని చ, భవద్గతం మే రాజ్యం చ జీవితాని సుఖానివై'** నేను లంకను వదలినాను, మిత్రులను, ఐశ్వర్యమును వదలినాను, నారాజ్యమును, జీవితమును, సుఖములు ఇక నీ అధీనములు' అన్నట్లు, నమ్మాళ్వారులును **'పాతమడైవతన్ పాశత్తాలే మత్తవన్ పాశంగళ్ ముత్తువిట్టు'** (తి.వా. 9-2-11) నీ శ్రీపాదములనుపొందవలెనని ఆశవలన తక్కిన క్రూరములైన సంగములను వాసనతో గూడ విడిచి అని సాయించిరి.

శ్రీఆంజనేయులవారు, **'స్నేహో మే పరమో రాజన్ త్వయి నిత్యం ప్రతిష్ఠితః, భక్తిశ్చ నియతా వీర భావో నాన్యత్ర గచ్ఛతి'** రామా! నీపట్ల నాకుగల స్నేహమును, భక్తియు ఎల్లకాలము ఉండగలవు. నాతలపు ఎన్నటికీ అన్యత్ర పోదు. అనినట్లు, ఆళ్వారులును **'కఱ్పారిరామ పిరానై యల్లాల్ మత్తుమ్ కఱ్పరో'** (తి.వా.7-5-1) ప్రియహితముల నభ్యసించువారు శ్రీరామచంద్రుని తప్ప వేరొకరిని అధ్యయనం చేయుదురా? అనీ, 'శ్రీరామచంద్రుని తప్ప వేరొక్కరక్షకునెరుగను. **'తయరతర్కు మకన్ఱన్నై యన్టి మత్తిలేన్'** (తి.వా. 3-6-8) అనీ సాయించారు. అర్జునుడు స్వామి విశ్వరూపమును జూచి వర్ణించి సంభ్రమాశ్చర్యములతో భయసంతోషములను పొందినట్లు, శఠకోపులును **'నీరాయ్ నిలనాయ్'** (తి.వా. 6-9-1) నీరై, భూమియై అని స్వామిని స్తుతించి పులకించినారు.

అయితే, శ్రీనమ్మాళ్వారులు ఇంతకుముందు పేర్కొనిన వారితో సమానులు కారు అని 'ఆచార్యహృదయము' గ్రంథకర్త శ్రీనాయనార్ ప్రతిపాదించుచున్నారు.

**'కుళలిల్'** అను పాశురమున జెప్పియున్నట్టి మనస్సు, **'అరుకవిల్'** (తి.వా. 1-9-3) అనుపాశురమున జెప్పియున్నట్టి రసమును గలవారగుటవలన శ్రీనమ్మాళ్వారు ఇంతకుముందు పేర్కొనిన వారితో సమానులుకారు. వారికంటె వైలక్షణ్యమును, ఆధిక్యమును గలవారు అని శ్రీనాయనార్‌వారు ప్రతిపాదించుచున్నారు. ఇంతకుముందు జెప్పిన పిరాట్టులును, నిత్యసూరులును, శ్రీఆంజనేయులు మున్నగువారు పరమాత్మతో ఒక్కొక్క విషయమున మాత్రమే రసమనుభవింతురు. అయితే వారందరి పట్ల చూపునట్టి ప్రీతిని ఆళ్వార్ ఒక్కరి విషయముననే స్వామి అనుభవింపజేయుచున్నారట! ఈ విధముగా జూచిన ఆళ్వారులు వారి కంటె విలక్షణులు, అధికులు గదా! ఇట్టి మనస్సు, ప్రీతి, రసము ఆళ్వారులు సర్వేశ్వరుడవతరించిన విధమున నవతరించి, అనేక కైంకర్యముల యందు ప్రీతిని కలవారై స్వామికి అనేక కైంకర్యములు జేయునట్టి అనంతగరుడ విష్వక్సేనాదులుగా తము తమను తలపోసిరి. అట్లే వివిధ దేవేరులుగా



తమను భావించుకొనిరి. ఇంకను, తేజోరాశిమధ్యప్రకాశించుచున్నట్టి స్వామి దివ్య మంగళ విగ్రహము ఆళ్వారుల పురుషభావనను తొలగించి, నాయకీ అవస్థను ప్రాప్తింపజేసినది. ద్రౌపది స్నానము చేయుచుండగా ఆమె అందాలను చూచిన స్త్రీలు మనస్సులో పురుషభావనను పొందిరట! కౌసల్య దశరథుని విషయమున దాసివలెను, సఖివలెను, భార్యవలెను, చెల్లివలెను, తల్లివలెను ప్రవర్తించుట ఆళ్వారుల స్త్రీప్రవర్తనకు దృష్టాంతములు, కానేరవు. అవస్థాంతరము పొంది ఉన్నప్పటికీ, ఆళ్వారుల నిజస్థితిలో ఉండు అభినివేశమునకు లోపముకలుగదు. వెల్లువ వచ్చిన నది అనేక ముఖములుగా ప్రవహించు చుండునప్పుడు తనకు ఒక్కకొరతా లేకుండ సముద్రమువైపుకే ప్రవహించి దానిలో ప్రవేశించునట్లు, మనస్సు, నీరై శరీరము శుష్కించి, ఆభరణమువదులై, శిథిలమై, పరవశమై, ద్రవీభూతులై ఒక్కచోటని లేక మనస్సు చలనమై, పరిపరి విధముల పోవుచు, పూర్తిగ కరిగిపోవునట్లు వృద్ధిపొందునట్టి శ్రీనమ్మాళ్వారుల భక్తి పాలసముద్రమున శయనించి ఉన్నట్టి శ్రియఃపతిని పలుముఖములుగా ప్రవేశించును. **'కడలిడమ్ గొండ కడల్ వణ్ణా'** (తి.వా. 7-2-1) సముద్రమున శయనించిఉన్న సముద్రము వంటి శరీరముగలవాడా అనగా ఒక సముద్రము వేరొక సముద్రములో నున్నట్లు పాలకడలిలో నిద్రించుచుండి శ్రమహరమైనట్టి శరీరముగల శ్రీమన్నారాయణుండను అపరిచ్ఛేద్యవస్తువును తన స్వాభావిక స్థితివల్లను, అవస్థాంతరము పొందుటచే గలిగిన భేదమువల్లను అనేకముఖములుగా పోయి ప్రవేశించెనట ! ఇచల శ్రీశఠకోపుల భక్తి వైభవము ప్రతిపాదింపబడుచున్నది.

శాస్త్రములందు జెప్పియున్నట్లు వీరి భక్తి సక్రమమై, శాంతమై, ఏక ముఖమై యుండక, క్రమము తప్పినదై శాంతము కానిదై, అనేకముఖములు కలిగి ఉండుటకు కారణమేమి? తెలిసికొందము. **'అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్యఏవ చ'** అన్నట్లు ఛేదన, దహన, క్లేదన, శోషణానర్హమైనదిగా జెప్పబడునట్టి ఆత్మవస్తువు పిరాట్టితో బ్రహ్మరుద్రాదులతో సమానముగా శరీరము సర్వేశ్వరుని స్వభావము స్మరణకు వచ్చి నా ఆత్మను బ్రద్దలు చేయుచున్నదనీ, నిప్పువద్దనుంచిన మైనము వలెనే కఱగి రూపుమాసిపోవునట్లు దగ్ధమగుచున్నదనీ, మంచి వస్తువు ఏదికనబడినను అది శ్రీకృష్ణునికే అనుకొనుట మృదుస్వభావముగల ఆత్మవస్తువును చిగురుటాకును వలె శుష్కింపజేసినదనీ ఇట్లు ఛేదనాద్యర్హమైనదనీ ఆళ్వారులే సాయించిరి.

**'ఎన్నెంజెన్నై నిన్నిడైయే నల్లే నెన్ఱు నీంగి'** (తి.వా. 8-2-10) నా మనస్సు నీ (స్వామి) సమీపమున నుండవలసిన దానను కానని నన్ను వదలి అన్నట్లు అచేతన

మగు మనస్సు చేతనుని వలె ప్రవర్తించి 'సర్వేశ్వరుడు విడనాడినట్టి నీకు నేను ఇంద్రియముగా నుండనని, నీతో సంబంధము లేదని తమను విడిచిపెట్టి పోగా, బాహ్యేంద్రియములు **'ముడియానే'** అను తిరువాయ్‌మొళిలో చెప్పినట్లు, చైతన్యము గల వాటివలె ప్రవర్తించుటచే ఒక ఇంద్రియము యొక్క వ్యాపారమును వేఱొక్క ఇంద్రియము ఆశపడునట్లు ఆతురపడగా, ఇట్లు శరీరము ఆత్మయొక్క చైతన్య ధర్మముల నారోపించుకొనగా, గాలిని, ఉప్పుమడిని కౌగలించుకొను అపరిచ్ఛేద్యమగు భక్తికి శాస్త్రోక్తక్రమం ఉంటుందా? అందువలన, **'నిధిధ్యాసితవ్యః'** అని శాస్త్రముచే విధింపబడినదై, చేతనునిచే సాధింపవలసినదై' క్రమంగా పరిపాకమును బొందునట్టి భక్తి వంటిది కాకుండా, దానికంటెను విలక్షణమైనదై పొరలిపోవునట్టి ఈ ఆళ్వారుల భక్తి శాస్త్రమర్యాదకు లోబడినట్టిది కాదని నిరూపింపబడినది.

గాన **'జ్ఞానత్తిల్ తన్ పేచ్చు'** అను చూర్ణిక మొదలుకొని ఇంతవరకు జ్ఞానదశయందు, ఇంకను తమయొక్క స్వభావముతోను, ప్రేమదశ యందు స్త్రీగా కూడ మాట్లాడుదురని, స్త్రీత్వము ఆత్మకు ఆగంతుకమైనది కానందున, అట్లు మాట్లాడుట వారికి స్వభావసిద్ధమనీ అది సామాన్యము గాకుండ, ఆఱు విధములుగ వీరు శ్రీదేవితో సమానులని, తక్కిన దేవేరులతోను సమానులని, ఇంకను భగవంతుని విడచి ఉండజాలని వారగు లక్ష్మణాదులతోను, భగవంతుని సామీప్యమున నుండు దశరథాదులతోను వారికి సామ్యముగలదని, వారికంటె కూడా వీరు విలక్షణులని, పిరాట్టులను అనంత గరుడాదులను తాముగానే భావించుకొందురనీ, ఈ భావనలకు హేతువై వీరియొక్క స్త్రీత్వభావనకును, అనేక కైంకర్యము లొనర్చుట యందభి నివేశమునకును, ద్రౌపదియొక్క, కౌసల్యాదేవి యొక్క వృత్తములను దృష్టాంతముగా గొనుట స్థూలమని ఈభావనకు మూలభూతమైన భక్తివిధములే అసమానములు గదా!





## ఆఱవ అధ్యాయము

# దివ్యప్రబంధములోని స్వాపదేశార్థములు

నమ్మాళ్వారులు నాయకివలెనే మాట్లాడునప్పుడు, సఖి, తల్లి, కూతురు అని మూడు విధములుగా మాట్లాడుటలో అభిప్రాయమును తెలిసికొందము. సంబంధ, ఉపాయ, ఫలవిషయములగు జ్ఞానము, అధ్యవసాయము, త్వర అను ప్రజ్ఞావస్థలను క్రమముగ సఖి, తల్లి, కుమార్తె అని పేర్కొందురు. సఖి అనగా - నాయకీ నాయకులను చేర్చునది అయినందున తిరుమంత్రమందలి మొదటి పదము చేతస్వామితో ఈ చేతనునికున్నట్టి అనన్యార్హశేషత్వ రూపమగు సంబంధమును గరించిన జ్ఞానమే స్వామితో ఈ ఆత్మచేరుటకు హేతువగుట వలన అట్టి సంబంధ జ్ఞానరూపమగు ప్రజ్ఞావస్థనే 'సఖి' అని చెప్పుచున్నారు.

ఇక **'తల్లి'** అనగా - కని పెంచిన కుమార్తె యవ్వనవంతురాలైన నాయకునిపై ప్రీత్యతిశయము వలన ఆతడుండుచోటును వెదకికొని పోవలెనని ప్రయాణమగు నప్పుడు, ఆతడే వచ్చువరకు ఎదురుచూడవలెనే గాని కుల మర్యాదకాదని వద్దనునది అయినందువల్ల సిద్ధోపాయము నాశ్రయించిన వారికి ప్రాప్యవస్తువు లభించుటలో ఆలస్యము లేనందున, శీఘ్రముగా ప్రాప్యవస్తువులభింపవలెననెడి 'త్వర' మున్నుగునవి కలుగుటకు మొదటి కారణమై, ఆ త్వరప్రియునికై బయలుదేరదీసినపుడు, ఇది ప్రపన్నకులమర్యాదకు తగదని, తన కుమార్తె యొక్క స్వాతంత్ర్యమును పోగొట్టునదై తిరుమంత్రమునందలి మధ్యమ (నమః) పదముచే ప్రతిపాదించబడినట్టి ఉపాయాధ్యవసాయ మనెడి ప్రజ్ఞావస్థయే 'తల్లి' అని పేర్కొనబడినది

**'కుమార్తె'** అనగా- యాదృచ్ఛికముగా నాయకుని కలుసుకొని, వాని వైలక్షణ్యమున ప్రీతిగలిగి, కులమర్యాదను కూడ గమనింపనాయకుని చెంతనుంటే గాని ప్రాణములను ధరింపజాలనని త్వరకలదిగాన- ప్రథమ, మధ్యమ పదములచే తెలుపబడినట్టి శేషియై శరణ్యుడైనట్టి సర్వేశ్వరుని యొక్క 'నారాయణ' అను చరమపదముచే తెలుపబడునట్టి స్వరూప, రూప, గుణ, విభూతులకు ఆలంబనమగు వైలక్షణ్యమును అనుసంధించు కొని, అట్టివానిని అనుభవించుటలో ఆలస్యమును ఓర్వజాలక, వాడే ఉపాయమను అధ్యవసాయమును అతిక్రమించి, ఆతని చెంతజేరి అనుభవించిననే తప్ప ప్రాణములను ధరించి యుండజాలనట్లు చేయునట్టి ప్రాప్యత్వర అనుప్రజ్ఞావస్థయే 'కుమార్తె'. ఈ మూడు విధములగు అవస్థలు వీరికి గలవని చెప్పుటకే కేవలం

జ్ఞానావస్థలని చెప్పకుండా అవి ప్రజ్ఞావస్థలనిరి. **'ప్రజ్ఞా త్రైకాలికీ మతా'** కాలత్రయ విషయమగు జ్ఞానము 'ప్రజ్ఞ' అనబడును. తిరుమంత్రములోని మూడు పదముల అర్థమును మనస్సున ఎల్లకాలము ఉండును కదా!

ఈ సఖి, తల్లి, కుమార్తెల అవస్థలు ఆళ్వారుల శ్రీసూక్తుల (తిరువాయ్ మొళులు)లో ఎలా సుబోధకమగునో, తెలిసికొందము. స్వామిని యాదృచ్ఛికముగా కలుసుకొనిన తరువాత వారితో ఎడబాటును సహింపలేక మూర్ఛిల్లిన కుమార్తెను జూచినతల్లి **'ప్రతిపన్న భాషిణీ'** అను ఒక సోది చెప్పే ఎరుకల సాని మాట పాటించి క్షుద్రదేవతారాధనలు చేయించబూనగా, కుమార్తె స్వభావము తెలిసి ఉన్న, ఆమె ప్రాణస్నేహితురాలు (సఖి) అనన్యార్హమగు ఆమెకు అన్యస్పర్శము కూడదని, క్షుద్రపూజలను తొలగింపజేయును. ఇది అనన్యార్హశేషత్వమునకు విరుద్ధమైనందున ఆమె స్వరూపమును నశింపజేయునని ప్రసిద్ధ **'తీర్వారై యామిని'** అను తిరువాయ్ మొళిలో దేవతాంతర కర్మానుష్ఠానమును నివర్తింపజేసినారు గదా !

శ్రీతులవిల్లి మంగలము అను దివ్యదేశమున వేంచేసి ఉన్నట్టి పెరుమాళ్ళ పై ఎక్కువ ప్రీతి గలిగిన తన కుమార్తెను నిరోధించుటకు ప్రయత్నించిన తల్లితో సఖి ఇట్లనును. 'ఓ యమ్మలారా! మీకుమార్తె విషయమున మీరింక ఆశపెట్టుకొనవద్దు. మీరేకదా? ఈమెను ఆ దివ్యదేశమునకు తీసుకొని పోయి స్వామిపై ప్రీతిని పెంపొందింప జేసినారు. ఇక ఆమెను స్వామినుండి మరలించుట మీ తరముకాదు. ఆమె తిరిగి వచ్చునను ఆశవదలుకొనుడు. సౌలభ్యసుందరమైన అర్చావతారము ఉపాయమగు నని అనుకొనబనిలేదు. శేషవస్తువునకు గల ప్రీతి శేషి అగు సర్వేశ్వరునికి సంతోషము గలుగజేయునే తప్ప, అది ఉపాయకోటిలో చేరదు. ప్రాప్తవిషయము యొక్క వైలక్షణ్యమును బట్టి వచ్చినది గాన దీనిని నివర్తింపజేయుట అసంభవము. దీనిని తాను నివర్తించెదనను స్వాతంత్ర్యము అత్యంతపారతంత్ర్య రూపమగు స్వరూపముతో విరోధించునది అగుటవలన త్యాజ్యము. ఇట్లు స్వసంబంధమును నివర్తింపజేసినట్టి 'తువళిల్ మామణి' అను తిరువాయ్మొళి విశిష్టమైనది.

కుమార్తెకు వివాహయోగ్యమైన వయస్సు వచ్చినదని బంధువులు రాజుల నందరిని స్వయంవరమునకు ఆహ్వానములను పంపగా, తిరుప్పురి ఊరను దివ్యదేశమున వేంచేసి ఉన్నట్టి శ్రీనాయనార్ అను పెరుమాళ్ళతో ఈమెకు సంబంధమున్నదని తెలిసిన ఆమె ప్రాణసఖి వెంటనే ఆమె స్వయంవర ఉద్యమమును నివర్తింప జేయవలెనని, ఆమె బంధువులకు ఆమె మనసులోని విషయమును



ఆవిష్కరించి, మనుష్యమాత్రులతో తన పెళ్ళి తలపెట్టిరన్న మాట విన్నంతనే ఆమె ఎట్లు దుఃఖించునో వివరించి బంధువులు పెళ్ళి ప్రయత్నములను నిలిపివేయించుట **'కరుమాణిక్కమలై'** అనుతిరువాయ్మొళి తెలియజేయును. ఈ విశిష్టపాశురమునందు ప్రాప్యవస్తువు విషయమున గల త్వర యొక్క పరిపాకమును, ఉపాయాధ్యవ సాయములో నుండి చూపించిన పిమ్మట అది భగవంతునికి తప్ప ఇతరులకు అర్హమైనది కాదనువిషయమును గుర్తెరుంగక అది విషయాంతరములకు అర్హమైనదే అని నిరూపింప ప్రయత్నింపగా, అపుడు సఖి (సంబంధజ్ఞానము) వచ్చి, ఆమెకు అన్యశేషత్వప్రసక్తి స్వరూపనాశకమని, శేషి అయిన వానికి ఈ విషయమున గల భోగ్యత వలనను, నిరుపాధిక శేషత్వమువలనను, ఈ ఆత్మవస్తువు స్వామికే శేషభూతమైనదని తెలుపును. గాన ప్రాణసఖి మాట్లాడినట్లుండు నట్టి ఈ మూడు తిరువాయ్ మొళులలోను అనన్యార్హశేషత్వము తెలియవచ్చును.

ఇంకను ఆళ్వారునాయకి వాడిపోయి, శుష్కించి, పిచ్చెక్కి ఆవేశము వచ్చినట్లు మాట్లాడి, అన్నింటిని వదలుకొని, దూరముగా నుండి నాయకుని సన్నిధిని ప్రాణము లను విడువవలయునని ప్రయత్నించుట సాధన మగునా? అని ఆమె తల్లి భయపడి మొఱపెట్టుచు, ప్రార్థించునట్టి ఏడు విశిష్ఠ తిరువాయ్మొళులందు తెలుపబడినట్టి అధ్యవసాయమును అవగాహించెదము. **'ఉణ్ణుమ్ శోరు'** (6-7-5) అను తిరువాయ్ మొళి యందు 'నాకు ఇప్పుడు సహాయముగా లేక విడిచి పోయినది అని బాధపడు తల్లి, **'కంగలుమ్ పకలుమ్'** అను తిరువాయ్మొళి (7-2-5) లో 'నిన్నుచేరి నీ శ్రీపాదములను పొందవలెనని పట్టుదల గల నాయకి, వాని చెంతచేరి వాని సన్నిధిలోనే ప్రాణములను విడువవలెనని తలంచుట ఉపాసకులకు పరభక్తిదశలో కలుగునట్టి గ్లాని సాధన దశయందే ఆరంభమగునా? అని తల్లి 'వాడిపోవుచున్నది, శుష్కించు చున్నది. అని మొరపెట్టి శేషశయ్యపై పవళించి యున్నట్టి నీలమేఘశ్యామునికి ఇది తగునా? అన్నట్లు భగవంతుని కృపతప్ప ఈమె చేయునవి ఏవీ హేతువులు కాజాలవు గదా! అయితే నా కుమార్తె ఇట్లా కష్టపడుచుండగా జూచి ఊరకుండుట మీ కృపకు, మీ రక్షకత్వమునకు తగునా? అని తల్లి ప్రార్థించుట ఉపాయాధ్యవసాయమును తెలియజేయును.

తొలుత **'ఆడియాడి'** అను (2-4-1) తిరువాయ్మొళిలో భాగవతుల గోష్ఠిలో చేరుట లభింపనందున కలిగిన దుఃఖమువలన పెకలించి వేసిన మొక్కవలెనే వాడిపోయి, **'పాలనాయ్ ఏళులకు'** అను (4-2-1) తిరువాయ్మొళిలో కృష్ణుని శ్రీపాదములలో

నుండు తులసిమాలికను బంగారు ఆభరణములుగల మృదువైన స్తనముల కాభరణముగా నుంచుకొనవలెనని ఇట్లు చేతి కందని వాటికై ఆశపడి కృశించిపోయి, **'మణ్ణైయిఉందుతుళావి'** అను తిరువాయ్‌మొళి (4-4-6)లో తీగవలె సుకుమారి అగు నా పుత్రిక కెక్కిన పిచ్చియిది అని, వాని వస్తువులను చూచి వాడే అనుకొని దగ్గరకు పోవునట్లు భ్రమించి, **'కడల్ ఞాల'** అను తిరువాయ్‌మొళి (5-6-1) శ్రియఃపతి ఆవేశించెనా అన్నట్లు ఆతురతవల్ల అనుకరించుచున్న సంగతి తెలియక స్వామి ఆవేశమా అనుకొనునట్లు వాడు మాట్లాడునట్లు మాట్లాడి **'మాలుక్కు వైయ'** అను తిరువాయ్‌మొళి (6-6-10)లో భగవంతుని పొందలేదను క్లేశము వలన లోకమర్యాద నతిక్రమించి అన్నింటిని వదలుకొని దూరముగా నుండి వాని సన్నిధిని ప్రాణములను విడనాడవలెనని ప్రయత్నించుట సాధనమగునా? అని తల్లి భయపడి మొఱపెట్టుచు, ప్రార్థించుట పై ఏడు తిరువాయ్‌మొళులు ఉపాయాధ్యవసాయ దశలో మాట్లాడిన మాటలని సిద్ధమగుచున్నది.

ఇక కుమార్తె అవస్థలో ఆళ్వార్లు సాయించిన పదిహేడు తిరువాయ్‌మొళులు ప్రాప్యత్వరను వర్ణించును. **'అంజిరై మడనారాయ్'** (1-4-1), **'వైకల్ పూమ్'** (6-1-1), **'పొన్నులకాళీరో'** (6-8-1) **'ఎంగానలకమ్'** (9-7-1) అనునాల్గు తిరువాయ్‌మొళులందు క్రమేణ భగవంతుని పొందుటకు ఒప్పుకొనక దూతను పంపుటను చూడగలము.

**'వాయున్దిరైయుకళుమ్'** (2-1-7) అనుతిరువాయ్‌మొళిలో సమస్త పదార్థములును భగవంతుని పొందక పోవుటచే దుఃఖపడుచున్నవని, అవికూడ తమ కష్టమును పంచుకొనుచున్నవని, దుఃఖించి, **'ఏరాళు మిరైయోనుమ్'** (4-8-1) అను తిరువాయ్‌మొళిలో వాడు ప్రేమించని తమ మేని మేలికాంతితో సహా అన్నింటిని ఉపేక్షించి, **'మాశఱుశోతి'** అను (5-3-10) తిరువాయ్‌మొళిలో దేశమంతా క్షోభిల్లునట్లు 'మడలెత్తుట' వంటి సాహసకృత్యములను జేసెదమని, 'ఊరెల్లామ్ తుంజి' (5-4-6) లో ప్రేమరూపమగు వ్యాధి రాత్రిరూపమగు యుగమున సంకేతములను బెట్టుకొనినదై ఒంటిగాజేరి బాధించుటచే బయటికి పోజాలక, **'ఎంగనైయో'** (5-9-1) లో తేజోరూపములగు తరంగాల మధ్య ప్రకాశించుచున్నట్టి అప్రాకృతదివ్యమంగళ విగ్రహము భక్తులకు, భక్తులుకానివారికి కూడ సమానంగా స్పష్టంగా మనస్సులో ప్రకాశించునని సాయించిరి.

**'మానేయ్ నోక్కి'** (5-9-1) లో తిరువల్లవాళ్ అను దివ్యదేశమున వేంచేసి యున్నట్టి శ్రియఃపతియొక్క శ్రీపాదములను జేరుకాలముకై ప్రార్థించి, ఇట్లు



ప్రార్థించుచున్నను, ఆలస్యముగా వచ్చిన స్వామిని చూచి, **'మిన్నిమడనార్'** (6-2-2) లో **'పోకు నంబీ!'** (ఓపూర్ణుడా ! వెళ్ళిపొమ్మ్మ !) అని ప్రణయరోషముతో కోపించుకొని, **'వెళ్ళైచ్చురిశంగు'** (7-3-4)లో, నా మనస్సూ వాడికడకే పోయినది, ఇక ఎవరిని సహాయంగా తీసుకొందును అని; **'ఏళైయరావి'** (7-7-8)లో వాడు బయటికి కనబడుటచే బాధక పదార్థములన్నీఒక్కటై బాధింపగా, **'నంగళ్ వరివళై'** (8-2-7) లో ఎంత కాలమైనను స్వామిని సేవించుట తప్పదు, సత్యము, మీతో మాకు సబంధము లేదు అనుచు హితము జెప్పునట్టి తల్లిని, చెలికత్తెను అతిక్రమించి, **'ఇన్నుయిర్ చ్చేవల్'** (9-5-10)లో సదృశపదార్థములను జూచి కష్టపడి ప్రాణములను విడనాడుటకై ప్రయత్నించి, **'మల్లికై కమళ్ తెన్దల్'** అను తిరువాయ్‌మొళిలో, సాయంత్రం శ్రీకృష్ణుడు పశువులతో కూడ రాకుండుట జూచి ఏమి ఆయెనో అని భయపడి, **'వేరు మరు తోళిణై'** లో ఉదయాన్నే శ్రీకృష్ణుడు పశువులను మేపుటకై పోవునట్లు అనుమానించి, వాని తిరుముఖమండలమును జూచి, నీవు పశువులను మేపుటకు పోయినచో మేము శిథిలముకావలసినదే గాన పోవద్దని ప్రార్థించుట- ఇట్లు ఈ పదిహేడు తిరువాయ్‌మొళులందును ప్రాప్యవస్తువు విషయమున త్వరగలిగినప్పుడు పలికిన పలుకులని స్పష్టమగును. (సఖి, తల్లి, నాయకి అవస్థావిశేషాలను, వివరణలను విపులముగా తెలియగోరువారు, ఈ రామానుజదాసుడి గ్రంథం 'వకుళాభరణనాయకి'ని చదువ ప్రార్థన).

ఇక వీటిలోని స్వాపదేశార్థములను తెలుసుకుందాము. తల్లి, సఖి అనునవి ఉపాయాధ్యవసాయము, సంబంధ జ్ఞానము అయితే వాటిని బహువచనములో ఎందుకు చెప్పారు ? అసలింతకూ ఈ బహువచనములను ఎక్కెడక్కెడ ప్రయోగించారో చూద్దాం. **'తోళిమార్ కళుమ్, అన్నైయరుమ్'** అనీ, **'అన్నైయరుమ్, తోళియారుమ్'**, **'తోళియార్ విశైయాడప్పోతు మినెన్న'**, **'అన్నైయర్ నాణ'**, **'ఊరేన్ శొల్లిలెన్ తోళిమార్'**, **'ఎంగనేయో అన్నై మీర్గాళ్'**, అని తిరువాయ్‌మొళిలోని అయిదు, ఆఱు పత్తులలో తల్లిని, ఆరు పత్తులలో తల్లిని, సఖిని ఏకవచనములో గాక బహువచనములో చెప్పినారు. దీనికి కారణమేమనగా, తిరుమంత్రమున జెప్పినట్లు ఈ ఆత్మతో స్వామికి గల రక్షకత్వ, శేషిత్వ, కారణత్వ శరీరత్వాది సంబంధములు అనేకములుండడంవలన, ఆయా సంబంధములను గురించి జ్ఞానమున భేదముండడం వలన, ఉపాయశ్రేష్ఠుడగు సర్వేశ్వరునికిగల వాత్సల్య, స్వామిత్వ, సౌశీల్య, సౌలభ్య, జ్ఞాన, శక్తి, కృపాదులను గురించిన అధ్యవసాయ రూపజ్ఞానమున భేదముండడం వలన కూడ. ఇచట మూలమునందుండు బుద్ధి శబ్దమునకు జ్ఞానము అని అర్థము. **'బుద్ధి ర్మనీషా ధిషణా**

**ధీః ప్రజ్ఞా శేముషీ మతిః'** అని నిఘంటువు నందు అది జ్ఞానవాచిగా చేకొన బడినదిగదా! గాన, సంబంధజ్ఞానమునకు, ఉపాయాధ్యవసాయమునకూ, ఆయా విషయములకు గల భేదమునుబట్టీ, వాటివాటి స్వరూపములకూ భేదముండడం వలన వాటిని తెలుపునట్టి శబ్దములను బహువచనమున పేర్కొనుట సముచితమే!

సరే, కుమార్తె అనగా ప్రాప్య వస్తువు విషయమగు త్వర అయినట్లయిన, కుమార్తెకున్నట్టి ఏడు అవస్థలను దీని విషయమున అన్వయించుకొనుట ఎట్లు? అను ప్రశ్న ఉదయించును. దీనికి సమాధానము ఇది. అనుభవయోగ్యమైన పదార్థమును మొట్టమొదట జూచినపుడు ఆశ అను అభిలాష, దాని స్మరణ అను చింతన, అనుస్మృతి, దానిననుభవించి తీరవలయుననెడి ఇచ్ఛ, అది రసాంతరమువలన మాఱి పోకుండ స్థిరముగా నుండురుచి, ఆ విషయములగు సంశ్లేషవిశ్లేషములు సుఖదుఃఖములుగ అనుభవమగు పరభక్తి. ఆ విషయమును విడనాడితే తమ ఉనికి (సత్త)నేపోగొట్టుకొనువారుగా నుండు పరమభక్తి- ఈ ఏడు అవస్థలను సంప్రదాయములో ఒక బాలిక అవస్థలైన **పేతై** (5-7 సం॥), **పేతుంబై** (8-11సం ॥), **మంగై** (12-4సం॥), **మడందై** (14-19సం॥), **అరివై** (20-26)సం॥), **తెరివై** (26-31సం॥), **పేరిళమ్ పెణ్** (32-40 సం॥లస్త్రీ), అను ఏడు అవస్థలను 'కుమార్తె' అనుప్రాప్య త్వరగా గుర్తించవలెను. ఇందువలన భక్తిరూపమగు ప్రాప్యత్వరయందు భక్తియొక్క ప్రథమ దశ మొదలుకొని చరమదశపర్యంతముండు అవస్థాభేదములకు గాను ఈ ఏడు పర్వములను గ్రహించవలెను.

ఇక, కుమార్తె దశయందు వర్ణింపబడిన అవయవ విశేషములను స్వాపదేశార్థములతో తెలుపుచున్నారు. **'తోకైమామయిలార్కళ్'** (తి.వా. 6-2-2) (నెమలి పింఛమువలెనే శ్లాఘ్యమైన తలవెంట్రుకలు గల స్త్రీలు) అను తావున స్త్రీలను నెమళ్ళతో పోల్చి చెప్పుట వారికి గల తలకట్టు ఆధిక్యమును బట్టి గదా! అట్లే ఈ ఉపమానము జ్ఞానవికాసమును తెలుపుచున్నది. **'పిరైయుడై వాణుతల్'** (2-9-9) -(చంద్రుని వలె మనోహరమైన ఫాలం) అని ముఖమును చంద్రునితో పోల్చి చెప్పుట దాని యొక్క ధావళ్యమును, ప్రకాశమును బట్టియే గదా! అందువలన స్వాతంత్ర్యము, అన్యశేషత్వములను దోషములతో సంబంధము లేకుండునట్టి పరిశుద్ధత మేలికాంతి తెలుపబడుచున్నది. **'విఱ్ఱురువక్కొడి'** (పెరియతిరు 6-6-6) (ధనుస్సు వలెనున్న కన్నులుగలదై, తీగెవలె నుండు నాకుమార్తె) అని కనుబొమ్మలను ధనుస్సుతో పోల్చి చెప్పుట అవి వంపుగానుండుట వలనగదా! అట్లే, ఇచట బాహ్యాంభ్యంతరేంద్రియనియమన రూపమగు శమ, దమములను తెలుపుచున్నవి. **'అమ్బున్న కణ్ణాల్'** (తి.వా. 6-8-6)



(బాణమువంటి దృష్టి కలది) అని దృష్టిని లక్ష్యవస్తువునందు పడునట్టి బాణమునుగా జెప్పినట్లు, శ్రియఃపతియందే నిలిచి యుండునట్టి జ్ఞానము సూచింపబడుచున్నది. **'ముత్తన్న వెణ్ ముఱువల్'** (నాచ్చియార్ తిరుమొళి-56) (ముత్యములవలెనే తెల్లనైన చిరునవ్వు) అని చిరునవ్వును ముత్యములతో పోల్చిచెప్పుట, **'ముత్ప్రీతిః ప్రమదోహర్షః'** అని నిఘంటువు ప్రకారము భగవద్విషయానుభవమున గలుగు ఆనందము వ్యక్తీకరించ బడుచున్నది.

**'పవళ్ వాయాళ్'** (పగడములవంటి అధరోష్ఠములు గలది) అని పెదవులను పగడములతో పోల్చి చెప్పుట, వాని ఎఱ్ఱని రంగునుబట్టి గాన ఇచట అనురాగతీవ్రత సూచింపబడుచున్నది. **'శెప్పన్న మెన్ములై'** (తిరుప్పావై 20 పా) బంగారు కలశములను బోలిన మేలైన మృదుస్తనములను - అని పరిపాకమును పొందిన స్తనములను బంగారముతో పోల్చి చెప్పుటచే సర్వేశ్వరుడు ప్రీతొగొనునట్లు పరిపాకము పొందిన భక్తి తెలుపబడినది. **'మిన్నడైయ నుణ్ మరుంగుల్'** అని నడుమును మెరుపుతో పోల్చిచెప్పుట సూక్ష్మతనుబట్టి గాన ముందుచెప్పిన జ్ఞానావస్థా భేదములకన్నిటికన్న ఆధారభూతమగు ఆత్మవస్తువుయొక్క అణుత్వము ద్యోతకమగుచున్నది. **'అన్నమన్ననడైయాళ్'** (తి.మొ. 3-7-6) హంసవలె నడచునది - అని హంసతో పోల్చి చెప్పుట నడకలో నుండు సౌందర్యము బట్టిగాన శేషి అగు స్వామియు భాగవతులును ఆనందించునట్లు స్వరూపానురూపముగ ప్రవర్తించుట తెలుపబడుచున్నది.

ఇట్లు నెమలి మున్నగు వాటితో పోల్చి వర్ణింపదగినట్టి అవయవములతో గూడి **'తెయ్వవురు'** దివ్యశరీరము అని అప్రాకృతముగ చెప్పబడునట్టి శరీరము జ్ఞాన, వికాస, శుద్ధ్యాదులకాశ్రయమై **'అకమేని'** లోపలి శరీరముఅన్నట్లుండు సర్వేశ్వరుని అంతరంగ శరీరమైన ఆత్మస్థితి తెలుపబడినది. ఇంతకు ముందు ప్రాప్యవస్తువునకై త్వరను 'కుమార్తె' అని చెప్పి, ఇపుడు అవయవ వర్ణనము ఆత్మస్వరూపమును తెలుపును అనుచున్నారే అనిన, మూడు అవస్థలును నమ్మాళ్వార్ ఒక్కరిలోనే ఉన్నందువలన అట్లు చెప్పిరని గ్రహించవలెను.

తల్లి, సఖి, నాయకి, వృత్తి విశేషణములను అందరికి తెలియునట్లు 49వ చూర్ణిక (ద్వితీయ ప్రకరణం)లో సాయించుచున్నారు. చెలికత్తెల పై తల్లి ఇట్లు నెపము పెట్టుచున్నది. 'మీరేగదా! నాకుమార్తెను తీసుకొని పోయి భగవద్విషయమున ప్రీతి గలదానినిగా జేసి, ఆమె మతిస్థిమితమును పోగొట్టినారు?' వెంటనే తల్లిపై చెలికత్తె ఇట్లు ప్రతినెపము పెట్టుచున్నది. "మీరే గదా! నా చెలిని తులవిల్లిమంగళమునకు

ముందుగా గొనిపోయి, అచటి అర్చామూర్తిని సేవింపజేసి, ఆమెను ఇట్లు చేయిజారి పోవునట్లుచేసినారు?'' ఇపుడు నాయిక తన చెలిపైన 'తల్లిపైన నెపము పెట్టుచున్నది. 'నాకు వనవిహారమునందాశ జూపి, స్వామి రాకకై పొంచిఉండి ఆయన వచ్చినంతనే, నేనాయనపై మరులుగొనునట్లుచేసినవారు మీరే చెలులారా! నేను భగవంతుని సేవించునట్లు జేసి, ఆయననుండి నేను మరలి రానట్లు జేసినది నీవేగదా! అమ్మా! అంతా మీరే జేసి ఇపుడు నాపై కోపగించుకోవడం న్యాయమేనా?'' అంటూ నాయిక తల్లిని, చెలిని ఇద్దరినీ విదిలించి వేయును. ఇపుడు సఖి, ఇట్లందుకొనును, "ఇంతకు ముందు ఎవ్వరికంట పడకుండ పెరిగిన నీవు స్వామి రాగానే అందరికంటె ముందే ఆయన ముందు నిలిచిన దానివి నీవే గదా! చెప్పు చెలీ!'' అని తల్లివైపు పోయి **'ఇవళై నీరిని యన్నైమీరు మక్కాళై యుల్లై విడుమినో'** (తి.వా. 6-5-1) ఈమెను పెరుమాళ్ళ నుండి మరలించడం మీవల్లకాదు. ఆమెపై ఆశను వదులుకొండి! అని సలహాయిచ్చును. ఇట్లు సఖి తల్లికి, కుమార్తెకు ఉభయులకును తోడ్పడును.

కాగా, నాయకి ఇట్లనుచున్నది. "స్వామి ఎడబాటుతో తపించిపోవుచున్న నన్ను ఓదార్చక 'అమ్మా! సఖీ! మీరు రాత్రంతా నిద్రపోవుచున్నారా? ఇదే నా మీ ప్రేమ!'' అని వారిపై కోపగించును. అపుడు వారు స్వామినుండి మనస్సు మరల్చుకొనుట మంచిదని చెప్పగా, 'అయితే, మీతో నాకు సంబంధము లేదు' అని చెప్పి, నాయిక స్వామిని 'అరవిందలోచనా!' అని పిలుచుటకు తడబడుచూ మధ్యలో నిలిపి, నిలిపి పిలుచుచూ, స్వామినేత్ర సౌందర్యమును తెలుపునట్టి ఆ తిరునామమును అనేకసార్లు పలవరించి కష్టపడుచున్నదే అని ఆమె ప్రణయతీవ్రతను సఖి కొనియాడుట, 'నాకుమార్తె దివ్యాభరణములు ధరించి తిరుక్కోవలూరికే (స్వామికై) నడిచిపోయినది' అని తల్లి పొంగి పోవుటయు ఇదంతా ఆళ్వార్ అవస్థా త్రయ పరిపాకము.

## స్వాపదేశార్థములు :

**'అకించిత్కరస్య శేషత్వానుపపత్తిః'** అన్నట్లు శేషత్వ వృత్తి (కైంకర్యము)తో సంబంధములేని యెడల 'శేషత్వము సిద్ధింపదు. శేషత్వ వృత్తి లక్ష్యముగా గల సంబంధ జ్ఞానము ప్రాప్య (కైంకర్య)రుచికి హేతువగును. విలక్షణ దివ్యమంగళ విగ్రహము కలిగి, ఉపేయముగా నుండు భగవంతుడు తానే తనను పొందుటకు ఉపాయముగా అంగీకరించును. ఉపాయాధ్యవసాయము ఉపేయ వైలక్ష్యమును బట్టి ఉండును. గాన అది ఉపేయవిషయమున ప్రీతికి హేతువగును. వీటిలో ఒక్కొక్క దానిని పరిశీలించిన,



అదే ప్రాప్యమునకై త్వరకు కారణమగును. గాన సంబంధజ్ఞానము, ఉపాయాధ్యవసాయము ప్రాప్యత్వరకు హేతువుగా నుండును. ఇదే ప్రథమదశ.

సంబంధజ్ఞానము శేషత్వ స్వరూపమైనప్పుడు, శేషి స్వయముగా వచ్చి అంగీకరించువరకును కాచి వేచి ఉండవలయునే తప్ప, తాను ప్రయత్నించుట స్వప్రయోజనమగును. స్వరూప విరుద్ధమగును. సిద్ధోపాయము నంగీకరించినవారికి మోక్షప్రాప్తికి ఆలస్యమగుటకు అవకాశము లేదు. కావున శీఘ్రముగా ప్రాప్యమును పొందవలెనని ప్రవర్తించునట్టి ప్రాప్యత్వరకు సంబంధజ్ఞానము, ఉపాయాధ్యావసాయము అనుకూలములగునని తెలియుచున్నది. ఇది మధ్యమదశ.

సంబంధజ్ఞానము, ఉపాయాధ్యవసాయము క్రమప్రాప్తియే చాలునని, త్వరను అడ్డుకొన్నపుడు ప్రాప్యత్వర ఈ రెంటిని అతిక్రమించి ముందుకు పోవును. అట్టి త్వర నింద్యముగా తోచినను, దానిని సంబంధజ్ఞానము, ఉపాయాధ్యవసాయము శ్లాఘ్యముగా నెంచుట చరమదశ.

ఇక, **'ఏతలర్మున్నావెన్ నినైన్దిరున్దాయ్'** మున్నగు తావుల తల్లిచే శత్రువులని, బంధువులని పిలువబడువారు సిద్ధసాధన నిష్ఠులకు ప్రతికూలురగు సాధ్యసాధన నిష్ఠులుగా, సిద్ధసాధన నిష్ఠ పూర్తి లేనివారుగ తెలియవలెను. కుమార్తె అనబడు ప్రాప్యత్వర దశయందు **'నమ్ముడై ఏతలర్ మున్బు నాడి'** (తి.వా. 7-2-1) మన శత్రువులైన తల్లుల ముందు నా అవస్థ చెప్పుటకు- అని అంతరంగ శత్రువులుగాను, **'యాముడై త్తుణై యెన్నుమ్ తోళిమార్'** (తి.వా. 9-9-5) మాకు సహాయకులగు చెలికత్తెలు- అని తనతో బాటు సుఖదుఃఖములననుభవించు బంధువులుగాను చెప్పినారు. సిద్ధిసాధన పరులనగా భగవంతుని యందే ప్రీతిగల వారుగా నుండి, భగవంతుడే ఉపాయమను నిశ్చయముకలవారు, ప్రాప్యత్వర పారతంత్ర్యమునకు అనుకూలించునది కాదని నిషేధించువారు. సాధ్యసాధన నిష్ఠులనగా తనవలెనే ఉపేయబుద్ధిలో నిలిచి, తన అభిప్రాయముతో ఏకీభవించువారు. ఇచట గమనింపవలసిన ముఖ్యవిషయము ఇది. ఆళ్వారులందరు ఏకాభిప్రాయము గలవారగుట ఇచట ఉట్టంకించబడిన స్వాపదేశములు ఆళ్వారుల ప్రబంధములన్నింటికీ పొసగును (వర్తించును).

**'నాలయాలారు మరిందొళిన్దార్'** - ఊరిలోని వారందరు తెలుసుకొని ఉన్నారు- అని, **'ఆయర్ పెరియాళ్ కాళ్'** (తి.వా. 6-6-4) ప్రక్క ఊరిలో నుండువారు అని చెప్పబడినవారు కర్మ, జ్ఞాన, భక్తి, ప్రపత్తులు అను ఉపాయచతుష్టయమునందు

స్థిరముగనుండువారని, అర్చావతారముపై అంతఃప్రీతిలేక, అంతర్యామియందు మనస్సును లగ్నము చేసి యుండువారని తెలియవలయును. ఇట్లు, ప్రపత్తి పరులను కూడ వేరువారుగా చెప్పవచ్చునా? తెలిసికొందము.

ప్రపత్తి పరులను కూడ వేఱయిన వారుగా చెప్పవచ్చునా ? అని ప్రశ్న. **'కీళై యుకత్తు త్తయిల్ కడైయ'** (పెరియతిరుమొళి. 6-2) ప్రక్క ఇంటిలో చల్ల చేయుట చూచి అని, **'మేలై యకత్తు నంగాయ్ నిన్టు కాణ్మిన్గళ్'** (తి.మొ. 10-8-2) పై భాగమునందు ఇంటి ఇల్లాలు వచ్చి చూచెను- అని, **'వడక్కిలకమ్ పుక్కిరిన్దు మిన్పోల్ మణ్ణిశై యాళొరు కన్నియై వేత్తురువమ్ శెయ్తు వెయ్త్తు'** ఉత్తరభాగంలో ప్రవేశించి మెరుపువలె సూక్ష్మమైన నడుముగల కన్నెపిల్లకు మారువేషము వేసి- అని చెప్పినట్లు క్రియ, దర్శనము, అనుభవము అనబడు కర్మయోగమును, భక్తియోగమును జ్ఞానయోగమును, సిద్ధసాధనులకు బయటి పార్శ్వమై, ఆ విషయమున 'స్వగత స్వీకారము' లోపలి పార్శ్వమై ఉండును. **'ఊరారికళిలుమ్'** (శిరితి) అని, **'ఊరవర్కవ్వై'** (తి.వా. 5-3-4) **'నాట్టారోడి యల్వొళన్దు'** (తి.వా. 10-6-2) అని, **'ఎంగళ్ కణ్ముకప్పే ఉలకర్ కళెల్లామ్'** (తి.వా. 9-2-7) అని, **'ఊరుం, నాడుం, ఉలకముమ్'** (తి.వా. 6-2-7) అని సాయించినప్పుడు ఊరి వారనగా ఆత్మప్రాప్తి కాములగు కేవలులని అర్థము వచ్చును. **'నాట్టార్'** (లోకులు) అనగా ఇహలోక ఐశ్వర్య కాములని, **'ఉలకర్'** (లోకాంతర పరులు) అనగా స్వర్గాది పరలోక ఐశ్వర్యమును గోరు స్వతంత్రులని తెలియవలెను.

కేవలులను ఒక ఊరి వారినిగా చెప్పదగునా? అని ధర్మసందేహము. అపరిచ్ఛిన్న ములగు రూపగుణవిభూతులతో గూడి ఉన్నట్టి పరబ్రహ్మమును అనుభవించుట వంటిదిగాక, అణువగు ఆత్మను అనుభవించుట గాన **'ఇరకలిరుప్పు'** (తి.వా. 4-1-10) స్వల్పమైన కేవలం ఆత్మానుభవము అన్నట్లు, సంకోచరూపమగు మోక్షముగూడ జరామరణప్రసక్తి లేక అనుభవించు నపుడు, ప్రకృతి మండలసంబంధము లేనపుడు అది పరమాకాశమున ఒక ప్రత్యేకప్రదేశమేగదా ! అందువలన కేవలురను ఒక ఊరి వారుగా చెప్పవచ్చును.

ఇక, **'శిఱు శిళకు'** అని, **'శీరార్ శుళకు'** అని చెప్పుట త్యాజ్యోపాదేయ వివేకమునకు సాధన భూతమగు ప్రమాణమగును. ఎట్లనగా, **'శిఱుశుళకు మణలుమ్ కొణ్డు'** (నాచ్చియార్ తిరుమొళి-2-8) చిన్నజల్లెడను, ఇసుకను గొని వచ్చి అనగా, ముతక ఇసుకను, సన్న ఇసుకను వేరుపరచు **'శిఱు శుళకు'** చిన్న జల్లెడ - దేహాత్మవివేకమునకు సాధన భూతమగు ప్రమాణముగా తెలియవలెను. **'శీరార్ శుళకు'** (నిండుజల్లెడ) అనగా నాయికకు కలిగిన వ్యామోహము దేవతాంతరము కాదనీ, అది సర్వేశ్వరుడే కలుగజేసినదని విచక్షణ చేయుటకు అనగా ఆత్మపరమాత్మ వివేకమునకు సాధనమైన ప్రమాణము అని రూఢి అగును. మొదటిది త్యాజ్యము (విడువ దగినది) రెండవది ఉపాదేయము (స్వీకరించదగినది) ఇదే ఉభయవివేకమని తెలియవలెను.



ఇక ఆళ్వారుల దివ్యప్రబంధములలో చెప్పబడు సాయంకాలము, రాత్రి, ఉదయము, పగలు- ఇవి ఏమి తెలుపునో, తెలిసికొందము. **'శెల్ కతిర్మాలై'** (తి.వా. 9-9-1) సాయంకాలము అనగా సంధ్యారాగముతో కూడి ఉండి వస్తువులు విశదముగా తెలియరాకున్నందువలన అది వస్తువుల విషయమున అన్యథా జ్ఞానమును కలుగజేయునట్టి రాజసజ్ఞానము అని, **'శెల్ కిన్ఱ కంగుల్'** (అర్ధరాత్రి) అనగా వస్తువులు ఏ ఒక్కటీ తెలియరాకుండ, పోనీ ఏదైన ఒక్కటి తెలియవచ్చినా విరుద్ధస్వరూపముగా తెలియుచీకటి రాత్రిఅగుట వలన, ఇది విపరీతజ్ఞానమును కలుగజేయు తామస జ్ఞానము అని, **'కాలై యెళున్దిరిన్దు'** ప్రాతఃకాలము బ్రాహ్మముహూర్తం అయినందున సత్త్వగుణము ఆవిర్భవించి చీకటి పోయి వెలుగు వెలువడుచు పదార్థములను బాగుగా తెలియపరచు సాత్త్వికజ్ఞానము అని, **'పకల్ కండేన్'** (పగలు) పదార్థములను స్పష్టముగ ప్రకాశింపజేయు శ్రీమన్నారాయణుని బాగుగా సాక్షాత్కారింపజేయు శుద్ధసత్త్వజ్ఞానమని తెలియవలెను. ఇందువలన, అన్యథా జ్ఞానము, విపరీతజ్ఞానము, యథాజ్ఞానము, దాని ఫలితమైన సాక్షాత్కారజ్ఞానము చెప్పబడినవి.

**'నీణిలా ముత్తత్తు నిన్ఱివళ్ నోక్కినాళ్'** (తి.మొ. 8-2-2) లో **"నిలాముత్తమ్"** మేడ అను ప్రాసాదము **'ప్రజ్ఞాప్రాసాద మారుహ్య'** (ప్రజ్ఞ అనెడి మేడపై నెక్కి) అని, **'అశోచ్యశోచ్యకాన్ జనాన్, భూమిస్థానివ శైలస్థో అజ్ఞానాన్ ప్రాజ్ఞః పశ్యతి'** అన్నట్లు ఉన్నతస్థానము నుండి అన్నింటిని తెలిసికొనతగినదై, అచటనుండి తెలిసికొనిన పిమ్మట, 'కాణుమో కణ్ణపురమెన్ను కాట్టినాల్' (తి.మొ. 5-5-2) తిరుక్కణ్ణపురము కానవచ్చు చున్నదా? అని చూపించెను అనుటచే భాగవత ప్రతిపత్తియే పరమప్రాప్యమని అందరికి తెలియజేయునట్టి చరమావధియైన పురుషార్థజ్ఞానముగా గ్రహించవలెను.

**'కైవళయమ్, మేకలైయుమ్ కాణేన్'** (తి.మొ. 8-3-2) ఇత్యాది తావుల **'కలై'** అని, **'వళై'** అని చెప్పబడినవి భగవదనుభవ విరోధులగు అహంకారమమకారములే! కావుననే, తిరుమంత్రములో **'నమః'** అనుమధ్యపదముచేత, ఈ రెండింటిని నిషేధించి **'నారాయణాయ'** అను తృతీయపదమున భగవదనుభవము చెప్పబడినది.

**'కళల్ వళై పూరిప్ప యామ్‌కండు కైతొళక్కూడుంగొలో'** (తి.వా. 5-9-9) మునుపు జారిపోయి వున్న కంకణములు చేతులలో బిగిసి పోయివుండగా మనము (స్వామిని) సేవించి దండము సమర్పించుటకు సాధ్యమగునా? అన్నచోట ఆ ముంజేయి కంకణములు విడువదగిన అహంకారమమకారములే!

**'శూడకమే, తోళ్వళైయే తోడే శెవిప్పూవే పాడకమే ఎన్ననైయ పల్‌కలనుమ్ యామణివోమ్'** (తి.పా. 27) చేతికి గాజులు, భుజములకు దండెకడియములు, కర్ణపుష్పములు, అందియలు, ఇట్టి అనేక ఆభరణములు మేముధరించెదము- అని సాయించినట్లు, **'కృష్ణాంఘ్రి తులసీ మౌళిః పట్టమ్ కృష్ణాభినందనమ్, కుండలే కృష్ణచరిత్ర శ్రవణం కంకణాంజలిః'** అన్నట్లు మొదట ఈ ఆత్మను అంగీకరించిన ఆచార్యులు సాయించిన నామరూపములు, భగవత్ వందనాదులు, అటుపిమ్మట ఆచార్యానుభవమును తెలియపరచినవాడు గలుగజేసిన శేషత్వ జ్ఞానాదులనబడు ఆత్మాలంకారములు అనితెలియవలెను.

ఇక లీలోపకరణములుగా దివ్యప్రబంధములలో ఉట్టంకించ బడినవాటికి స్వాపదేశార్థములను తెలుపుచున్నారు. **పన్దు** = బంతి, **కళల్** = గచ్చకాయ, **పావై** = చిత్తరువు, **కుళమణన్** = బొమ్మ. **యాళ్** = వీణ, **తిన్దల్** = చల్లగాలి, **మతియమ్** = చంద్రుడు, **అడిశిల్** = అన్నం, **శాన్దమ్** = చందనము, **పూణ్** = ఆభరణం, **శిత్తల్** = బొమ్మరిండ్లు, **తూతై** = ఆటబొమ్మ. మున్నగునవి ఏవనగా- సత్వరజస్తమోగుణములతో విచిత్రమైన కర్మ అనెడు దారముతో కట్టి సర్వేశ్వరుడు తన విలాసార్థము జీవునికి ప్రేరణ ఇవ్వగా, క్రిందపడి పైకిలేచియు, చక్రము తిరుగునట్లు పలుమార్లు క్రిందు మీదలగుచు స్వామి విడిపింపగా విడుచునవియై, అల్పరసమ్ములై, తన సంబంధముతో జూచునపుడు త్యాజ్యములై, భగవత్ సంబంధముతో జూచునపుడు ఉపాదేయములై, వాని సంబంధములేకుండ చూచినప్పుడు ప్రతికూలములై వానితో జేర్చి చూచునప్పుడు అనుకూలములై **"పొంగైమ్బులనుమ్ పొరి యైందుమ్"** అనుపాశురమున జెప్పబడిన భోగ్య, భోగోపకరణ, భోగస్థానముల సమూహమని తెలియవలెను. ఇంతటితో 'ఆచార్య హృదయము' ద్వితీయప్రకరణ స్వాపదేశార్థములు పూర్తయినవి.





# ఏడవ అధ్యాయము
# అంతరార్థముల రత్నాల గనులు

'ఆచార్యహృదయము' తృతీయ ప్రకరణము ప్రారంభమగు చున్నది. భగవంతుని వద్దకు దూతలుగా పంపబడు పక్షులనగా భగవద్విషయమునకు ఘటకులగు మహానుభావులను పక్షులుగా ప్రతిపత్తి చేయుదురని తెలియవలెను. **'అంజిరైయ మడవారాయ్'** (తి.వా. 1-4-1) సుందరమైన రెక్కలతో దర్శనీయమైన, ఓ నారపక్షీ! అని, **'ఉభాభ్యాం ఏవ పక్షాభ్యా మాకాశే పక్షిణాం గతిః, తథైవ జ్ఞాన కర్మభ్యాం ప్రాప్యతే పురుషోత్తమః'** - తమ రెక్కలతో పక్షులు ఆకసమును పొందునట్లు ఈ జీవుడు కూడ జ్ఞానానుష్ఠానముల మూలముగ సర్వేశ్వరుని శీఘ్రముగా పొందగలడు.

ఆళ్వారులు **'గురు, సబ్రహ్మచారి పుత్రశిష్యస్థానే పేశుమ్'** గురువుల, సహాధ్యాయుల, పుత్రుల, శిష్యుల స్థానములలో నుండి మాట్లాడుదురు. **'ఇతు శొల్లి అరుళాళి వర్తివణ్డే'** (తి.వా. 1-4-6) గుండ్రని చారలుగల ఓ తుమ్మెదా! దయా సముద్రుడగు గరుత్మంతునితో ఆళ్వారులుండు వీధిని ఒక్కరోజైనను సర్వేశ్వరుని వేంచేపు చేయమని చెప్పుమా! అని, **'ఉడన్ మేయుం మడవన్నం గాళ్'** (తి.వా. 6-1-5) - గుంపుగా చేరి మేయుచున్న విధేయులైన హంసలారా! అని, **'అడియేనుక్కుం పోత్తుమినే'** (తి.వా. 6-1-5) నాకోసం కూడ మంచి మాటలుపలికి స్తోత్రం చెయ్యండి! అని, 'ఎన్‌ముల్లైగళ్ మేల్ తుమ్బి గాళ్!' (తి.వా. 6-8-5) నా ముల్లపుష్పముల మీద సంచరించుచున్న తుమ్మెదలారా! అని, **"శెంగాలమడైనారాయ్ క్కుడకూర్తర్కెన్ తూతాయ్ నుమరోడే నుంగాళ్ తక్కలమే కేళీర్‌కళ్"** (తి.వా. 9-7-1) ఎర్రని పాదములుగల భవ్యమైన ఓ సారపక్షీ! కుంభనృత్యము చేసినవాడైన మనస్వామికి నా దూతయై వెళ్ళి నీ బంధువులతో కూడ వచ్చిమీ పాదములను నా శిరస్సు మీద ఉంచుడీ! అని అనేక పాశురములచే ఆచార్య, సహాధ్యాయ స్థానములలో నుండి ఆళ్వార్లు మాట్లాడుదురు.

**'నీ యలైయే శిఱుపూవాయ్'** (తి.వా. 1-4-8) - ఓ చిన్న చిలుకా! నీవేకదా! నాకష్టములను స్వామికి చెప్పగలవు- అని **'యాన్ వళర్త కిళికాళ్'** (తి.వా. 1-4-5) నేను పెంచినట్టి శుకములారా! అని కొన్ని పాశురములలో పుత్రుల, శిష్యుల స్థానము లలో నుండి మాట్లాడుదురు. వీరిలో హంసలని పిలువబడిన వారెవరు? **'హంసో**

**యథా క్షారమివాంబుమిశ్రమ్**' హంస నీటిని, పాలను వేరుచేయునట్లు వారు సారా సారవివేకోన్ముఖులు. **'న బధ్నాతి రతిం హంసః, కదాచిత్కర్ద మాంభసి'** అన్నట్లు హంస బురద నీటిలో సంచరించినట్లే, వీరు సంసారమను పంకిలములో దిగబడరు.

**'అన్నమ్ పెయ్‌వళై యాళ్ తమ్ పిన్ శెన్టు'** (తి.వా. 6-5-5) హంస స్త్రీలను అనుకరించుచు నడచును అన్నట్లు హంస వలెనే నడక సౌందర్యముగల పిరాట్టి యొక్క అనన్యార్హశేషత్వాదులును, పురుషకార భావమనెడి నడకను వీరు అనుక రింతురు. ఎట్లైతే హంస నీటిపైకి వచ్చిన తామరాకును గొడుగుగా, పైరు వెన్నులను చామరముగా, శంఖధ్వనిని జయఘోషగా తుమ్మెదల ఝుంకారమును పాటగా మానస సరోవరమునందలి పద్మమును ఆసనముగా కలిగి యుండునో, అట్లే పద్మపత్రముల వలెనే శ్యామల వర్ణశరీరమును సంసారదుఃఖ రూపమగు ఎండతగలకుండ, తమకు స్థిరమైన ఆశ్రయముగా గలవారై, **'అహమన్నమ్'** అని చెప్పునట్లు పరిపూర్ణ జ్ఞానులైనట్టివారు కైంకర్యముల సమర్పింపగా, పరిశుద్ధ స్వభావులు స్తుతింపగా, సారగ్రాహులు సామగానము చేయగా, **'గురు పాదాంబుజం ధ్యాయేత్'** అన్నట్లు ఆచార్యుని పాదపద్మములను సర్వదా మనస్సున ధ్యానించుచుండు శిష్యులకు జ్ఞానోపదేశకుడగు ఆచార్యులు వారి హృదయకమలముల వసించుదురు. వారే తాపత్రయాదులకు లోబడకుండ, విఘ్నములు కలుగకుండ, ఆనందము వృద్ధిపొందునట్లు, భార్యా పుత్రాదులతో గూడి ఉండి భగవద్గుణానుభవము జేయువారును సంసారబంధ మెంతమాత్రములేని వారై **'పరమహంస'** లనిపించుకొను నట్టి శెల్వనంబి, పెరియాళ్వారులు, శ్రీమన్నాథమునులు, శ్రీయామునాచార్యుల వారలు. వారినే **'హంసల'**ని ఇట పేర్కొనినారు.

ఇక 'తుమ్మెద'లెవరో 'కందిరీగ'లెవరో తెలుపుచున్నారు. స్వరూపానురూపములు కానివాటిని భోగ్యములుగా భ్రమింపక, ఆశ్రితుల హృదయకమలములందు ఊరినట్టి భగవద్విషయరూపమగు తేనెయే ధారకముగా గలవారై పరిశుద్ధమును భోగ్యమును అగు వాక్కుని గొని, **'ఎఱుక్కాళల్ మేలొళి మామలరూతిరో'** (తి.వా. 6-8-7)- ఓ తుమ్మెదలారా! పరుగున వచ్చి నా కొప్పుమీద నుండు పుష్పములలోని మకరందమును వ్యాపింపచేయుడు అని వకుళాభరణ నాయకి సాయించినట్లు, వీణాగానము వలెనే తుమ్మెదలు **'తెన్న తెన్న'** అని గానము చేయుట ఆళ్వార్లు భగవత్ భాగవతభోగ్యతలను వాగ్రూపమున అనుభవించుటయే! తుమ్మెదలు కురుంజి, ఇందళము, కామరము, కందారము అను రాగములను సంతోషముగా పాడుట వంటిదే గదా! అట్టి వారే



జీవులను సర్వేశ్వరునితో జేర్చునట్టి కౌశలముగల శ్రీనారదులవారు, శ్రీతిరుప్పాణి ఆళ్వారులు, తిరువాయ్‌మొళియందు గల మాధుర్యమునే తమకు భోగ్యముగా అనుభవించు తంబిరాన్ మార్ వంటివారు.

ఇక, చిలుకలు కోయిలలు. మున్నగు పక్షులు ఎవరో తెలుపుచున్నారు. **'తామరై తడంగళ్ విళికళినకవరైప్పడు ప్పాన్'** (తి.వా. 6-2-9)- తామర పుష్పములవలె విశాలనేత్రముల చూపులనెడి వలలో చిక్కించుకొనుటకై అనగా స్త్రీలక్రీగంటి చూపులవలలో చిక్కుపడక, సర్వేశ్వరుని కటాక్షమునకు పాత్రులై నాయకి చేతిపై ఎక్కించుకొని పెరుగు, నెయ్యి, పాలు మున్నగు ధారక, పోషక, భోగ్య పదార్థములను అనుభవింపజేసి, తిరునామములను నేర్పి, అనుసంధించునట్లు జేసి ఆవిధంగా తిరునామసంకీర్తనంతో కాలక్షేపముచేయువారి అభిమానమును పొందినవారైన శ్రీమధురకవి ఆళ్వారులు, శ్రీతొండరడిప్పొడి ఆళ్వారులు ఇంకను, శ్రీరామానుజా చార్యులవారిచే అంగీకరింపబడినట్టి పూర్వాచార్యులవంటి వారిని అటువంటి గుణసామ్యమునుబట్టి చిలుక, కోకిల నెమలి అని పేర్కొనుదురు. శ్రీరామానుజుల వారికి అంతరంగ శిష్యులుగా ప్రసిద్ధిపొందిన వారైన శ్రీకూరత్తాళ్వానులు, ముదలియాండాన్ ఎంబారులు, అరుళాళప్పెరుమాళ్ ఎంబెరుమానారు వంటివారిని కూడ చిలుక, కోకిల, నెమలిగా చెప్పవచ్చును.

**'ఆశరు తూవి వెళ్ళైక్కురుకే'** (తి.వా. 6-8-8) దోషము లేని రెక్కలు గల తెల్లని కొంగా! అని సాయించినట్లు బాహ్యాభ్యంతర పరిశుద్ధి గలవారై సంసార సముద్రమునందుండు తాపత్రయ తరంగములచే బాధపడనివారై, తమ ఉపదేశముల వలన ఉజ్జీవింపగోరు ఆశ్రితులకు సర్వార్థములనొసగి, గొప్ప పదవినిసైతము అక్కర లేదనుచు భగవద్విషయమున ఎక్కువ పిచ్చిపట్టిన వారగు శ్రీకులశేఖరాళ్వారులు, ఇంకను మనపూర్వాచార్యుల వంటివారిని క్రౌంచము, నారపక్షి, కొంగ, కురుకపక్షులుగా నెంచవలెను.

ఈ ప్రకరణమున 'మేఘము' అని పిలువదగిన వారెవరు? తెలుపుచున్నారు. భగవదనుభవమునకై ఉద్యుక్తులైన కాలమంతయు కల్యాణగుణసాగరములో ప్రవేశించి, హృదయమును నింపుకొని, శరీరవర్ణమున సర్వేశ్వరునితో సమానులై, ప్రాణి సంరక్షణమునకు పావనము జేయువారై, అంతటా సంచరించుదురు. **'జ్ఞానహ్రదే ధ్యానజలే రాగద్వేషమలావహే, యః స్నాతి మానసే తీర్థే స యాతి పరమాం గతిమ్'** మానసతీర్థము (సరోవరము) నందుండు జ్ఞానమనెడి మడుగులో రాగద్వేషరూపమగు

మలములను పోగొట్టునట్టి ధ్యానరూపమగు జలమునందు స్నానము జేయువారు పరమపదమును పొందుదురు అన్నట్లు జ్ఞానమనెడి మడుగును నిండించి, గుణరత్నములను వర్షించి, ఇంకను ఉపకరింపక పోతిమే అని లజ్జపడి, శరీరము పాలిపోవునట్లు చేసుకొని, పరులకు గలుగు సమృద్ధినే తమకు ఫలముగా దలంచు ముదలాళ్వారులు, తిరుమళిశై ఆళ్వారులు, తిరుమంగై ఆళ్వారులు, శ్రీరామానుజుల వంటి ఉదారులు సదాచార్యులు మేఘములగుదురు.

ఫలము లభించుటకు హేతుభూతురాలు ఆళ్వార్ నాయకి గాన, ప్రాప్యత్వర తమకు ఉన్నట్లు స్వామికి తెలియవచ్చుటకు అనేక పర్యాయములు దూతలను పంపుదురు. **'అంజిరైయ మడనారాయ్'** (తి.వా. 1-4-7) లో **'ఎమ్బిళైయే నినైన్దరుళి'** నా తప్పునేతలంచి- అనుచోట స్వామి తన సౌలభ్యముచే నాయిక స్థితిని గమనింపక ఆమెను కలిసినాడు. అయితే చలించు ఆమె మనస్సులోని దోషములను గని, ఆమెకు దూరమైనాడు. మరి ఇది ఆయన అపరాధ సహత్వగుణమునకు హానిగదా! **'కడలాళి నీర్‌తోత్తి'** (తి.వా. 1-4-10) సముద్రమును సృజించి దానిపై నిదురించుచున్నవాడు, యుద్ధోన్ముఖమైన చక్రమును చేతిలో గల వాడు అయిన స్వామిని చూచినట్లయితే ఈనా బాధను ఆతనికి తెలుపుమా! అన్నట్లు **'విచిత్రాదేహ సంపత్తిః ఈశ్వరాయ నివేదితుమ్'** ఈ చేతనుల కైంకర్యమును స్వీకరించుటకే గదా వాని క్షీరసాగర శయనము అని అడుగుడని వ్యూహ విషయమున దూత్యమును పంపుట మొదటి దూత్యము. ఇది సర్వేశ్వరుని క్షమాగుణమును అనుసంధించు కొనుటకేనని తెలియవలెను.

ఆర్తరక్షణము తప్ప వేఱొక దానియందు వ్యామోహము కలవాడు కానందున, **'మాఱిల్ పోరరక్కన్‌మతిళ్'** (తి.వా. 6-1-10) - ఒప్పు లేని యుద్ధము చేయు రావణాసురుని కోటను నశింపజేసినవాడు - అన్నట్లు అట్టి అద్వితీయ వీరుడగు శ్రీరామచంద్రుని రక్ష్యవర్గములో సీతాపిరాట్టితో బాటుతానూ ఒకతెనున్నానని స్వామికి తెలుపుడని విభవమును గురించి దూత్యమును పంపుట రెండవదూత్యము.

ఆశ్రితులయెడ ఐకరస్యము గలవాడుకాన, దానిని జ్ఞాపకముచేసిరండని చెప్పుచు, **'వానవర్‌కోనై క్కణ్డు'** (తి.వా. 6-8-4) నిత్యసూరులకు స్వామి ఐనట్టి శ్రియఃపతిని సేవించి, మేము మీ దయకు పాత్రమైన విధము ఇదేనా? అని అడుగుడు అని ఇట్లు పరత్వము విషయమునను, అతీంద్రియమగుటచే పరత్వముతో సమానమైనట్టి అంతర్యామి విషయమునను దూతలను పంపుటచే సృజించిన వాటిరక్షణను మరపించునట్టి సారస్యమును పరిశీలించి మూడవ పర్యాయము పంపినట్టి దూత్యమునకు పరతత్త్వద్వయము విషయము.



నీ దివ్యమంగళ విగ్రహ సౌందర్యమును చూడకపోతే ప్రాణములను నిలుపుకొని ఉండగలమా? అని ఆ సౌందర్యమును జ్ఞాపకము చేసిన రాకుండమానడు. **'శెక్కమలత్తలర్‌పోలుమ్ కణ్‌కైకాల్ శెజ్గనివాయక్కమలత్తిలై పోలుమ్ తిరుమేని'** (తి.వా. 9-7-3) ఎర్రతామరపుష్పముల వలెనున్న నేత్రములు, శ్రీహస్తములు శ్రీపాదములు, ఎర్రని పండువలె నున్న అధరము, తామరాకు బోలిన దివ్యమంగళ విగ్రహము గలిగిన శ్రియఃపతికి మేము తగినట్టి వారము కామా ! అడుగుడు ! అని తిరుమూళిక్కళమను దివ్యదేశమున వేంచేసి ఉన్న అర్చావతారమూర్తిని గురించి దూతలను పంపుటచే నాల్గవ సారి దూత్యమునకు అర్చావతారము విషయమైనది.

ఇట్లు అనేక తావులకు దూతలను పంపితే, ప్రాప్యవస్తువగు శ్రీమన్నారాయణుడు ఒక్కడే అను నిశ్చయము చెడిపోదా ? అని అడిగితే, పరత్వాదులకు స్థలభేదము తప్ప వస్తుభేదము లేదు- అను విషయమును దృష్టాంతపూర్వకముగా వివరించుచున్నారు. ఒక దేశపురాజు ఎన్ని పాత్రలు ధరించునో తెలియునుకదా! పగలు కచ్చేరి (రాజసభ) అధ్యక్షుడుగా, రాత్రి ప్రజల కష్టనష్టములను తెలుసుకొనుటకు మాఱు వేషములో గూఢచారిగా, అడవులలో వేటకాడుగా, ఉద్యానవనములలో ప్రేమ యాత్రికునిగా, ఉన్నత న్యాయాధీశునిగా, ప్రజల పాలిటి దైవముగా వ్యవహరించును. అట్లే, శ్రియఃపతిని పరత్వాదులయిదింటిలోను చూడవచ్చు. సౌలభ్య, పరత్వ, ప్రణయిత్వములనబడు ఆధిపత్యములను ఆయన కలిగి యుండును. ఈ విషయము ఆయన **'పారిళన్దపేర'** **'విణ్‌మీర'** అను పాశురములో తెలియనగును.

**'తమరుకన్ద'** అను పాశురములో, **'ఆడియోముక్కే'** అనుపాశురములోను సాయించినట్లు, అవతారమెత్తిన కాలమునందు, ఆ తరువాతికాలమువారును ఆశ్రయించుట కనుకూలమగు అర్చావతారమునందు, పరత్వాదులలో అనుభవింపదగినట్టి గుణములన్ని పూర్ణముగా తెలియవచ్చును. ఈ గుణపూర్తియే ఆళ్వారులు అర్చామూర్తిపై ఎక్కువప్రీతిజూపుటకు గారణము.

## ఎనిమిదవ అధ్యాయము

# దివ్యదేశములలో స్వామిగుణములు

అర్చావతారమునందు అన్నియును సంపూర్ణముగా ఉన్నట్లయిన, అన్ని దివ్యదేశములందును సమానముగా అన్నిగుణములు ప్రకాశించునా? అంటే పరత్వాదులలో, సామాన్యముగ నుండునవియును, ఉండనివియును ఐన గుణములలో ఒక్కొక్కటి ఒక్కొక్క దివ్యదేశమున వేంచేసి ఉన్నట్టి పెరుమాళ్ళ యందు ప్రధానముగా ప్రకాశించును. ఈ విషయమును ఆళ్వారులు తమ ప్రబంధములలో పేర్కొనినట్టి దివ్యదేశములలో చూపించుచున్నారు. ముందుగ, అన్ని దివ్యదేశములలోను ప్రధానమైనదైన శ్రీరంగములో వేంచేసి యున్నట్టి పెరుమాళ్ళయందు ప్రకాశించు గుణములను తెలుపుచున్నారు.

**'పన్పెరువానక ముయ్య పమరరుయ్య మణ్ణుయ్య మణ్ణులకిల్ మనిశరుయ్య'** (పెరు.తి.1-10) నైమిత్తిక ప్రళయమున నశింపనిది అయిన బ్రహ్మలోకమునకు పైగా నుండు లోకములు ఉజ్జీవించుటకుగాను, దేవతలు ఉజ్జీవించుటకుగాను, భూలోకము, మనుష్యులు ఉజ్జీవించుటకుగాను అని సాయించినట్లు, **'తిరువాళ్ నినితాక, తిరుక్కణ్కళ్ వళర్కిన్ఱ తిరువరంగమ్'** (పె.తి. 4-9-10) శ్రియఃపతి భోగ్యముగా శయనించియుండు శ్రీరంగమునందు వ్యూహమునగల సౌహార్దగుణము మిక్కుటముగా ప్రకాశించుననిరి.

ఇక తిరుమలయందు ప్రకాశించు గుణమేది? **'కణ్ణావానెన్నుమ్ మణ్ణోర్ విణ్ణోర్కు'** సర్వజ్ఞుడగు సర్వేశ్వరుడే బద్ధులకు, నిత్యులకు రక్షకము- అని, **'తణ్ణవరువి వేంగడమే వానోర్కుమ్ మణ్ణోర్కుమ్ వైప్పు'** శ్రీవేంకటాచలమే నిత్యముక్తులకును, బద్ధులకును రక్షకము- అని సాయించినట్లు ఉభయవిభూతులలో నుండువారికి గాను చేర్చిపెట్టబడిననిధి వలెనే ప్రాప్యమైనట్టి తిరుమల యందు **'పోకిన్ఱ కాలంగళ్ పోకు కాలంగళ్ పోయకాలంగళ్ తాయ్ తన్దైయుం ఇరాకిన్ఱాయ్'**- భూత, భవిష్యత్, వర్తమాన కాలములన్నింటిలోను తల్లి దండ్రివిగా ఉన్నావు అనీ, **'కణ్ణాయేళులకుక్కుయిరాయ వెన్కార్వణ్ణనే'** (పెరియతిరు 1-6-10) సర్వజ్ఞుడవై ఏడులోకములను పాలించునట్టి నా నీలమేఘశ్యాముడా! అని సర్వదా సర్వాత్మలకు సర్వవిధబంధువై, అన్నింటికీ ఆత్మవై యున్నట్టి, అంతర్యామియొక్క గుణముగా నుండునదై, **'ఎన్గణ్ పాశమ్ వైత్త'** (తి.వా. 3-334) నన్ను ప్రేమించిఉన్న అనీ, **'నికరిల్ పుకళాయ్'** నిరుపమానమైనట్టి శ్లాఘ్యత కలవాడు అని, ఇట్లు మిక్కిలి తక్కువ స్థితిలో నున్న నన్ను కలుసుకొనినాడని చెప్పబడినట్టి వాత్సల్యము మిక్కిలి ప్రకాశించుచున్న తేజోమయమైన విగ్రహము గలవాడు



**'పరఞ్జుడర్శోతి'** (తి.వా. 3-3-4) అని శరీరము నందే మనస్సునాకర్షించునట్లు ఉజ్వలముగా నుండునట! 'నాతో కలిసికొను నిరుపమాన వాత్సల్యము' అనుటచే **'ఒళివిళ్ కాలమెల్లామ్'** అనీ **'ఉలకముణ్డ పెరువాయా'** అనీ ఈ రెండు పాశురముల అర్థమును చేర్చి చెప్పినారని తెలియవలెను. తిరువేంగడముడైయాన్‌లో వాత్సల్యగుణమే ప్రధానముగా ప్రకాశించును.

**'ఒళివిళ్‌కాలమెల్లమ్'** అను తిరువాయ్‌మొళికి పైన దివ్యదేశ విషయముగ సాయించినది **'ఒన్ఱుమ్ తేవుమ్'** అను తిరువాయ్‌మొళి కాన ఆళ్వారుతిరునగరిలో ప్రకాశించునట్టి గుణమును తెలుపుచున్నారు. జీవేశ్వరుల ఉభయముల యొక్క ప్రాధాన్యమును తెలుపునట్టి **'ఓం'** కారమువలె ఆళ్వార్ తిరునగరి అలరారుచున్నది.

**'ఓమిత్యాత్మానం యుంజీత'** (ఓం అని ఆత్మను ధ్యానించుము) అని, **'ఓంకారో భగవాన్ విష్ణుః'** - ఓం కారము భగవంతుడగు విష్ణువు అని చెప్పినట్లు శబ్దార్థముల ప్రాధాన్యమును బట్టి జీవేశ్వరులనిద్దరినీ తెలుపునట్టిదై, ఇద్దరి ప్రాధాన్యమును తెలుపునది అగు ప్రణవము వలెనే నమ్మాళ్వారుల యొక్క పరిపూర్ణుడై వేంచేసి ఉండు పెరుమాళ్ళ యొక్క ఆజ్ఞ పొందికతో జరుగుచుండుట వలన ఆళ్వార్ తిరునగరి దివ్యదేశము ఉభయతారకమై ఒప్పుచున్నది.

పరమపదమున సంసారుల కష్టముల తలచుకొని మనస్సున కష్టపడుచుండుట వలెగాక, వారికి సమీపముగా వచ్చి తిరునగరిలో వసించుచు, **'ఎత్తేవు మెవ్వులకంగుళ్ మత్తుమ్ తన్పాల్ మరువిల్'** (తి.వా. 4-10-10) సకల దేవతలను, సమస్తలోకములను, ఇంకను చరాచరముల నన్నింటిని దోషరహితమగు తన దివ్యమంగళ విగ్రహముతో సమానముగా తనకు శరీరముగా గలవాడు, తన స్వభావమున మార్పు లేకుండ ఉండువాడు తన ఐశ్వర్యముతో సర్వులకు సులభుడైయున్న పరాత్పరుడైన ఆనారాయణుడు అని సాయించినారు. గాన ఆళ్వార్ తిరునగరిలో పరత్వలక్షణమగు ఈశ్వరత్వము సమృద్ధముగా ప్రకాశించుచుండును.

దివ్యదేశాలలో, **'ఎత్తేవుమ్'** కు పైన తిరువాయ్‌మొళి **'ఎంగనేయో'** కావడం వల్ల తిరుక్కురుంగుడిలో వేంచేసి ఉండు పెరుమాళ్ళ యందు ప్రకాశించు గుణమును తెలుపుచున్నారు. పాశురములో **'తిరుక్కుఱుంగుడి'** అని చెప్పకుండ, 'వైష్ణవ వామన క్షేత్రము' అనుటలో విశేషాభిప్రాయమున్నది. వామనావతారమున తన శరీరమును పెద్దదిగా జేయుటకు గాను (త్రివిక్రముడగుటకు) యాచకుండైనట్లు, యాచకుండై శ్రీభాష్యకారుల వద్ద వేదాంతార్థములను గ్రహించి, శిష్యుడై మేము కూడ

శ్రీరామానుజుల వారిని ఆశ్రయించినామని చెప్పినందున శ్రీవైష్ణవ నంబి అని పేరుపొంది, వామనావతారాంశముగా పురాణములలో చెప్పబడిన సర్వేశ్వరుడు వేంచేసి ఉన్నట్టి దివ్యదేశమని అభిప్రాయము. లేదా **'అరియక్కృత్తవల్లార్ వైట్టణవర్'** (తి.వా. 5-5-7) అనగా ఈ తిరువాయ్ మొళిని సంతచెప్పుకొని, అర్థమును తెలిసికొనినట్టి వారు వైష్ణవులు అవుతారని చెప్పి ఉన్నందున వైష్ణవులు వసించునదై వామన క్షేత్రమైనట్టి దివ్యదేశమనియు చెప్పవచ్చును.

ఇచ్చట, వామనావతార ప్రసక్తి వచ్చుటకు ప్రయోజనమేమనగా విభవలావణ్యము పరిపూర్ణముగా నుండుట కనుకూలంగా విభవావతారముతో సంబంధము అనుసంధించు కొనుట, **'కురుంగుడి'** అనగా **కురియవన్** = పొట్టివాని, గుడి = దివ్య దేశము అను అర్థమును తెలియజేయుట- ఈ రెండు ప్రయోజనములు సిద్ధించును గదా! **'నీలమేనియుమ్ నాన్గుతోళుమెన్నెంజమ్ నిఱైన్దవనే'** (తి.వా. 5-5-6) శ్యామ (నీల) వర్ణము గల విగ్రహమును,నాల్గు భుజములును నామనస్సునందు నిండి ఉన్నవి అని పాయించిరిగదా! **'రూపవాన్ సుభగః శ్రీమాన్'** అని, **'రూప సంహనం లక్ష్మీమ్'** అనీ విభవమునందు ప్రకాశించు సముదాయశోభ (లావణ్యము) తిరుక్కురుంగుడి యందు సంపూర్ణముగా నుండును.

ఇట్లు పరత్వాదులందు సాధారణముగా నుండు ఒక్కొక్క గుణమును, ప్రధానముగా ప్రకాశించునట్టి దివ్యదేశములను చెప్పిన తరువాత, తక్కిన గుణములలో ప్రధానముగా ప్రకాశించునట్టి దివ్యదేశములను 'వానమామల మొదలు **'తిరుప్పేర్'** వరకు తిరువాయ్‌మొళుల వరుస ప్రకారము తెలుపుచున్నారు. స్వామి లావణ్యము పట్ల రుచి కలిగి, పరవశులై అనన్య సాధనులగువారికి **'ఆఱెనక్కునిన్పాదమే శరణాకత్తన్దొళిన్దాయ్'** (తి.వా. 7-10-6) అని నీ పాదములనే రక్షకముగా నొసంగునట్టి ఔదార్యగుణము వానమామలై యందు వేంచేసిఉన్నట్టి పెరుమాళ్ళలో అభివృద్ధిగా నుండును.

**'కళైవాయ్ తున్బమ్ కళైయాతొళివాయ్ కళైకణ్ మత్తిలేన్'** ఓ భగవంతుడా! నా దుఃఖమును పోగొట్టినా సరే, పోగొట్టకపోయినా సరే, వేరొక రక్షకుడులేడు అను నిశ్చయము గలవారిని, **'నీరాయలైన్దు కరైయ వురుక్కుక్కిన్ఱ'** (తి.వా. 5-8-1) -నీరై కరిగి ఉన్నచోట నుండక తిరిగి మిక్కిలి శిథిలమగునట్లు చేయునట! అంతేకాదు. తనపై ఆశనుపెంచి మాధుర్యమును ప్రవహించుట **'కుడమూక్కు'** అని పిలువబడు కుంభకోణమునందున్న పెరుమాళ్ళ వైభవమట! ఆ మాధుర్యమును ఎంత అనుభవించినను, తృప్తి తీరక, తరిగిపోక వృద్ధి పొందుచునే ఉండునట!



సర్వేశ్వరుడే రక్షకుడని నిశ్చయముతో నుండునట్లు చేయునట్టి **'పెరుమానతు తొల్లరుళే'** (తి.వా. 5-6-8) సర్వేశ్వరుని స్వాభావికమైనట్టి కృప సుందరనగరమైన తిరువల్లవాళను దివ్యదేశమునందు నిత్యముగానుండును. **'రామస్య వ్యవసాయజ్ఞా'** రామునియొక్క అధ్యవసాయమునెరిగినది అని చెప్పబడునట్టి పిరాట్టి వలెనే, **'ఏరుశేవక నార్క్కెన్నైయుముళళెన్మిన్గళే'**- వర్ధిల్లు శౌర్యముగల వాడగు సర్వేశ్వరునికి నేను ఒక్కతెను కూడ రక్ష్యకోటిలో ఉన్నానని తెలుపుడు అన్న వారిని రక్షించు విషయమున **'న త్యజేయమ్'** (విడనాడను) అని, **'ఏతద్వ్రతం మమ'** (ఇది నా దీక్ష) అన్నట్లు అనుకూలుర చేతనూ చలింపజేయరానిది అగు సర్వేశ్వరుని స్థైర్యగుణము పంపానది ఉత్తరతీరములోనుండు తిరువణ్ వండూరను దివ్యదేశమునందు స్థిరముగానుండును.

నాయిక త్వరపడుటకు తగినట్లు, స్వామి శీఘ్రముగా వచ్చి సేవసాయింపక, ఆలస్యముగా వచ్చినందున **'పోకు నమ్బీ!'** ఓ పూర్ణుడా! వెళ్ళిపో! అని ప్రణయరోషము వలన గలిగిన విరోధమును, **'అళిత్తాయున్దిరువడియాల్'** (తి.వా. 6-2-6)- నీ శ్రీపాదములతో ఇసుక ఇండ్లను చెడగొట్టితివి అన్నట్లు చెడగొట్టినవాటిని బాగుచేయగల అఘటిత ఘటనాసామర్థ్యమును, దారిద్ర్యము, సంపద, స్వర్గము, నరకము, ఇట్లు ఒకదానితో నొకటి పొసగని వాటిని చేర్చుట అను విరుద్ధ విభూతి యోగమును ప్రకాశింపజేయునదై **'తిరువిణ్ణకర్ నన్నకరే'** అనగా మంచి నగరమని పిలువబడిన తిరువణ్ణకరమను దివ్యదేశమున అనేక శాఖలుగా విస్తరించి ఉండునట!

పురుషకారము మూలముగ తనను పొందినట్టి వారికీ, అట్లు పొందించునట్టి పురుషకారులకు, ఓ అమ్మలారా! ఈమెను మరలించుదము అను' ఆశ ఇకమీద మీకు లేదు విడువండి- అని వేరుచేయునదగు **'తేవపిరానైయే తందై తాయ్'** (తి.వా. 6-5-11) దేవదేవుడైన శ్రియఃపతియే తల్లితండ్రి అని తలచి అన్నట్లు స్వామి బాంధవ్యము శ్రీతులైవిల్లిమంగలం అను దివ్యదేశమున రెట్టింపుగా నుండును.

**'ఏలక్కుళలి యిళన్దతు శంగే'** (తి.వా. 6-6-1) ఏలకుల వలె పరిమళించునట్టి కొప్పుగల ఈమె కంకణమును పోగొట్టుకొనినది అని ఆరంభించి, **'కర్పుడైయాట్టి యిళన్దతు కట్టే'** (తి.వా. 6-6-10) బుద్ధిమంతురాలైన ఈమె లోకమర్యాదను పోగొట్టు కొనినది అను వరకు ప్రాప్యవస్తువు లభింపనందున కలిగిన ఆర్తి, పారవశ్యతలవలన ప్రాప్యప్రాపకాభాసమ్ములన్నీ తమంత తామే విడచిపోయినందున, వాటిని పోగొట్టు కొనినట్టివారు **'ఉణ్ణుమ్ శోరు, పరుకునీర్, తిణ్ణుమ్ వెత్తిలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్'** (తి.వా.6-7-1) తిను అన్నము, త్రాగు నీరు, వేసికొను తాంబూలము అన్నియు మనస్వామియైన శ్రీకృష్ణుడే- అన్నట్లు ధారక, పోషక, భోగ్యవస్తువులన్నీ తానుగానను

భవింప బడువాడును, **'వైత్త మానిధి'** అనగా చేర్చబడిన గొప్ప నిధిగా ఉన్నట్టి తిరుక్కోళూరు పెరుమాళ్ళలో ఆపత్సఖత్వము అనుగుణము సమృద్ధముగా నుండును.

**'తెన్‌తిరుప్పేరైయిల్ శేర్వన్ శ్లేన్'** (తి.వా. 7-3-8) సుందరమైనట్టి తిరుప్పేరను దివ్యదేశమును పోయి చేరెదను అని తన వారి హితవుమాటలను వినక స్వామిని చేరిన నాయకి మనస్సు అచటనే నిలిచిపోయి తిరిగి రానట్లు, ఆస్వామి సౌందర్యము ఆ దివ్యదేశమున భగవద్విషయమునుఅనుభవించుచు సామవేదము గానము చేయువారి వేదఘోషలోనే తెలియునట! ఆ పవిత్ర ధ్వనియే స్వామి సౌందర్యమును ప్రకాశింపజేయుసాధనమట!

ఒక్కొక్కదివ్యదేశములో ప్రకాశించు స్వామి కల్యాణగుణములను వరుసగా వర్ణించుచూ, ఇప్పటివరకు శ్రీరంగము, తిరుమల, ఆళ్వార్‌తిరునగరి, తిరుక్కుఱుం గుడి, వానమామలై, కుంభకోణం, తిరువల్లవాళ్, తిరువణ్ణకర్, తులైవిల్లిమంగళం, తిరుక్కోళూరు, దివ్యదేశ వైభవములను అనుభవించినాము. ఇప్పుడు, తిరువారన్‌విళై అను దివ్యదేశమున ప్రకాశించు శ్రియఃపతి కల్యాణగుణమును తెలుపుచున్నారు.

**'శిన్దై మత్తొన్తిన్ తిఱత్తతల్లాత్తన్నై'** (తి.వా. 7-10-10) - స్వామిని ఆశ్రయించిన నామనస్సు వేరొక పదార్థమునందు దృష్టి పెట్టుట లేదు అన్నట్లు పరమపదము పట్లకూడ విముఖులను జేయునట్టి ఆనందాతిశయము విశాలమైన తిరువారన్ విళై అను దివ్య దేశమునందు స్పష్టముగా తెలియవచ్చును.

**'పల్‌వళైయార్ మున్ పరిశళిన్దేన్'** (తి.వా. 8-3-4) అనేకరకముల కంకణములు గల స్త్రీల ముందు నా స్వభావము (లజ్జాదులను) పోగొట్టుకుంటిని అన్నట్లు **'మాయ క్కూత్తన్'**- ఆశ్చర్యకరమైన సుందర గమనము కల తిరుక్కుళందైలో వేంచేసిఉన్న స్వామి దివ్య, ఆశ్చర్య చేష్టితములు అచటి మేడలు, ధ్వజములు ప్రకాశించునట్లు చేయునట!

**'పణియా వమరర్'** (తి.వా. 8-3-6) దేవతాంతరముల నాశ్రయింపక స్వామిపైనే అధికప్రీతి గలిగి పరిచర్యలు చేయు నిత్యసూరులున్న పరమపదమునందున్నవాడు సంసారమందున్న జీవుల కష్టములు తొలగించుటకు తనమాహాత్మ్యము తెలియని ఈలోకమున నవతరించి దాసుల శ్రమను పోగొట్టు స్వామి సౌకుమార్యముయొక్క ప్రకాశమును నమ్మాళ్వారుల తల్లిగారగు ఉడైయ నంగమీర్ అమ్మగారి పుట్టిల్లయిన తిరుప్పరి శారమను దివ్యదేశమునందు చూడవచ్చును.

**'సంస్పృశన్నాసనం శౌరేః విదురస్స మహామతిః'** -దూరదర్శి అయిన విదురుడు అనుమానముచే శ్రీకృష్ణుడు కూర్చొనిన ఆసనమును తడివి చూచెను- అన్నట్లు



భగవంతుని సౌకుమార్యమునకు ఎచ్చట ఏమి ఆపద కలుగునేమో అని భయపడు మహానుభావులు, **'ఏంగళ్‌శెల్ శార్వు'** (తి.వా. 8-4-1) మాకుపోయి పొందతగినట్టి ఉపాయము అని తమకు నిర్భయస్థానమగు ఆశ్రయముగా తలచుటచే భయము వీడి త్రినేత్రుడైన రుద్రునికి అంతర్యామియు, చతుర్ముఖ బ్రహ్మకు అంతరాత్మయగు శ్రియఃపతిని పొందిరి. అట్టి ఆనందమునందించు స్వామి శౌర్య,వీర్య, పరాక్రమములు తిరుచ్చిత్తార్ దివ్యదేశమునందు విస్తారముగా ప్రకాశించును.

**'సాధ్యహృదిస్థనాయుమ్'** - తాను అపేక్షించి సాధించినదైన నమ్మాళ్వారుల హృదయవాసము లభించినది ఈ దివ్యదేశమున ఉన్నందువలన కదా అనుకొని, సాధనమైన ఆ తిరుక్కడిత్తాన మను దివ్యదేశమును స్వామి తన దాయభాగముగా ఎంచి, పట్టుకొని వసించు కృతజ్ఞతారూపమగు పరిమళము (కృతజ్ఞతా గంధము) అచట పరివ్యాప్తమగుచున్నది.

**'అప్పన్ తిరువరుళ్ మూళ్‌కినళ్'** (తి.వా. 8-9-5) స్వామియైన శ్రియఃపతియొక్క అనుగ్రహమందు ఈమె మునిగినది అన్నట్లు **'తిరుప్పులియూర్ నిన్గమాయ ప్పిరాన్ తిరువరుళామవళ్ నేర్‌పట్టతు'** (తి.వా. 8-9-10) తిరుప్పులి యూరులో వేంచేసియున్నట్టి ఆశ్చర్యభూతుడైన సర్వేశ్వరుని యొక్క కృపను ఈమె పొందినది. అని సాయించినట్లు తన అనుగ్రహమున మునిగినవారిని అనన్యార్హులనుగా జేయునట్టి నాయకలక్షణము తిరుప్పులియూరునందు సంపూర్ణముగా నుండును.

మిక్కిలి ఆకలితో నున్న వాడు అన్నము ఉడుకుటకు ముందుగానే దాని దగ్గరకు వచ్చి కూర్చొని, పడుకుని, నిల్చొని ఉండునట్లు భోగ్యులగు ఆళ్వారులకు పరమభక్తి పరిపక్వమగు వరకును వారికిగల త్వర **'తెళిన్దవెన్‌శిన్దై'** అను పాశురమున ముందుగా జెప్పబడిన 'పుళింగుడి క్కిడన్దు, వరకుణమంగై ఇరున్దు, వైకున్ద త్తుళ్ నిన్ఱు' తిరుప్పుళింగుడిలో పడుకొని ఉండి, తిరువరకుణమంగైలో కూర్చుని ఉండి, శ్రీవైకుంఠమను దివ్యదేశమున నిలువబడి ఉండి పెరుమాళ్ళలో ప్రకాశించును.

భోగ్యభూతులగు నమ్మాళ్వారులతో కలసి మెలసి ఉండునప్పుడు 'ఆట్కొళ్ వానొత్తెన్ను యిరుణ్డ మాయన్' (తి.వా. 9-6-7) నన్ను దాసునిగా జేసి కొనునట్టివాని వలెనే నాలోకి వచ్చి నా ఆత్మను అనుభవించిన వంచకుడైన శ్రీకృష్ణుడు అన్నట్లు, **'అరుయిర్ పట్టతెన్ తుయిర్ పట్టదు'** (తి.వా.9-5-9) - నా ఆత్మ పడుచున్నట్టి బాధను ఏ ఆత్మ పడుచున్నది? అనియు సాయించునట్లు సర్వేశ్వరుడే ఈ చేతనుడై శేషశేషి భావము మారిపోవునట్లు చేయు స్వభావము (సౌశీల్యము) తిరుక్కాట్కరై అను దివ్యదేశమునందు ప్రకాశించును.

**'స కృత్త్వదాకారవిలోకనాశయా తృణీకృతానుత్తమభుక్తి ముక్తిభిః మహాత్మభి ర్మామవలోక్య తాం నయ క్షణేపి తే యద్విరహోతిదుస్సహః'** అని శ్రీఆళవందారులు సాయించినట్లు తన దివ్యమంగళ విగ్రహమును సేవింపవలయుననెడి ఆశచే భోగమోక్షములను తృణీకరించిన మహాత్ములను వదిలి ఉండజాలని మార్దవము ఆశ్రితుల సంపత్తుగా శ్రియఃపతి వేంచేసి ఉండునట్టి తిరుమాళిక్కుళమ్ అనుదివ్యదేశ మందంతయు నిండిఉండును.

స్వామి తనను ఎడబాసి ఉండుట వలన కలిగిన దుఃఖసాగరమును దాటించు **'విష్ణుపోతం వినానాన్యత్ కించిదస్తి పరాయణమ్'** ఒక నావవంటి శ్రియఃపతి కృపయే తిరునావాయ్ అను దివ్యదేశమున ప్రతిఫలించును. స్వామి కృపాస్వభావము ఆ దివ్యదేశము పేరులోనే - **'తిరునావాయ్'** (శ్రేష్ఠమైన నావ) తెలియుచున్నది.

**'శరణమాకుమ్ తన తాళడైన్దార్ కెల్లాం మరణమానాల్ వైకున్దమ్ కొడుక్కుం పిరాన్'** (తి.వా. 9-10-5) శరణాగతులకు దేహావసానకాలమున శ్రీవైకుంఠమును అనుగ్రహించు ఉపకారకుడు, **'ఉత్పలావతకీ దివ్యే విమానే పుష్కరేక్షణమ్, శౌరిరాజ మహం వందే సదా సర్వాంగసుందరం'** అనగా తిరుక్కణ్ణపురమను దివ్యదేశములో ఉత్పలావతకమను పేరుగల విమానమునందు వేంచేసి ఉన్న సుందర శౌరి రాజ పెరుమాళ్ళలో అందరికీ తెలియునట్లు మోక్షప్రదత్వము ఔదార్యము ప్రకాశించు చుండును. ఇచట ఉత్పలావతకమ్ అనగా ఉత్-పల- అవతకం- పలమనగా మాంసము, ఉత్పలులనగా దేహపోషణ విషయములో ఉపేక్షించు ముముక్షువులు- శుష్కించిన మాంసము గల వారిని స్వామితో చేర్చునదే ఆ ఉత్పలావతక విమానం. కావున ఇచ్చట మోక్షప్రదత్వం సిద్ధము. ప్రసిద్ధమూ!

'అవనడినిళల్త్తడమ్' (తి.వా. 10-1-2) సర్వేశ్వరుని పాదచ్ఛాయ అనెడి తటాకము, **'మరకతమణిత్తడమ్'** -మరకత మణులతో సుందరమైన తటాకము అని వర్ణింపబడినట్టి శ్రియఃపతియొక్క సకల సాంసారిక తాపహరమగు శైత్యము, దేవతలకు అమృతమునందించు సమయమున అసురులను మోహింపజేసినట్టి ప్రదేశమగుట వలన మోహన క్షేత్రము అని పేరుపొందినట్టి తిరుమోగూరు దివ్యదేశమున సంపూర్ణముగ నెలకొని ఉండునట!

**'అమరర్ కోవర్ ....'** (తి.వా. 10-2-6) నిత్యసూరులకు స్వామియైన విష్వక్సేనులు శ్రియఃపతిని ఆరాధించునపుడు, నిత్యసూరులు ఆ తిరువారాధనలో అంతరంగ కైంకర్యములు చేయుదురు అన్నట్లు **'పడముడై అరవిల్ పళ్ళిపయిన్డవన్ పాతంగాణ నడమినో వమర్కళుళ్ళీర్'** (తి.వా. 10-2-8) ఓ బంధువులారా ! ఫణములుగల ఆదిశేషుని మీద ఆదరముతో పవ్వళించిన ఆశ్రియఃపతి శ్రీపాదములను సేవించండి- అని ఆళ్వారులు చేసిన ఉపదేశమువిని నిత్యసూరులు, బ్రాహ్మణులు, సంసారులు అను పక్షపాతములేక సమబుద్ధితో సర్వులు అర్చించుటకు అనుకూలముగా తిరుముఖమండలమును, నాభికమలమును, శ్రీపాదములను మూడు ద్వారములగుండ సేవింపజేయుస్వామి సామ్యగుణము తిరువనందపురమున శయనించి ఉన్నట్టి పెరుమాళ్ళయందు స్పష్టముగా తెలియవచ్చును. శ్రీఅనంత పద్మనాభ స్వామి ఇచట వేంచేసి ఉండుట వలన ఇది తిరువనంత పురము అని ప్రసిద్ధమైనది.

ఇకపై, ఆశ్రిత పారతంత్ర్యము అనుగుణము అధికముగా ఏ దివ్యదేశమున ప్రకాశించునో తెలుపుచున్నారు.

మన నియమనము ప్రకారమే కృపచేయుచున్నాడు అని, **'విణ్ణులకుమ్ తిరువానాయ్ విరైకిన్డాన్ వితివకైయే'** (తి.వా. 10-6-3) ఇప్పుడు పరమపదమును మన నియమన ప్రకారంగా నిచ్చుటకై త్వరపడుచున్నాడు అని స్వామి ఆశ్రిత పారతంత్ర్యము రక్ష్యవర్గము అనుసంపద కొరత లేకుండ ఉన్నట్టి తిరువాట్టారనుదివ్య దేశమునందు గట్టు పొర్లి ప్రవహించునట !

ముముక్షువులకు త్యాజ్యమైన - చరమదేహముపై వ్యామోహము అజ్ఞాననివర్తక మగు **'తిరుమాళిరుంజోలై మలై'** అనుదివ్యదేశమున పుట్టును. దీనినే దక్షిణ తిరుమల అందురు.

తిరుప్పేర్ అను దివ్యదేశమున ఆదిశేషునిపై పవళించి ఉన్న స్వామి ఈ చేతనుని అంగీకరించుటకు అవకాశము ఎప్పుడు వచ్చునా? అని నిరీక్షించి ఉండును. ఈ విధంగా ఒక్కొక్క దివ్యదేశమునందు ఒక్కొక్క గుణము ప్రధానముగా ప్రకాశించు నని ఆళ్వారులు తమ దివ్యప్రబంధములలో తెలియజేసిరి.

అయితే, ఈ దివ్యదేశములందు నమ్మాళ్వారుకు ప్రీతి కలిగినదెప్పుడు? ఏ వయసులో వీరు తిరువాయ్మొళి ప్రబంధమును రచించిరి? దీనికి భోక్తృనియమున్నదా? దీని భోగ్యత ఎట్టిది? తెలుపుచున్నారు. వీరికి ఈ అర్చావతారముల విషయమున ప్రావణ్యము వయస్సు వచ్చుటకు ముందుగానే కలిగినది. పదునారు కళలతో పూర్ణమగు చంద్రమండలమువలెనే పదునారు సంవత్సరములు నిండగానే, దేవతలకు భోగ్యమగుటచే, భోక్తృనియమముగల చంద్రమండలమందుండు అమృతమువంటిది గాక, **'ఎన్నావిలిన్ కవి'** (తి.వా.3-9-1) నా నాలుకపై ఉన్నట్టి మధురమైన కవిత్వము అని, **'పాలేయ్, తమిళరిశై కారర్ పత్తర్ పరవుమాయిరమ్'** భోగ్యమైనదిగా ద్రావిడభాషా

పండితులు, గాయకులు, భక్తులు గౌరవించువేయి పాశురములు అని, **'కేట్టారార్ వానవర్కళ్'** వారువిని సంతృప్తి నందుదురని, **'తెన్నావెన్నుమెన్నమ్మాన్'**- తిరుమాలిరుం జోలై మలైలో వేంచేసి ఉన్నట్టి నా స్వామి ఆ తిరువాయ్‌మొళులను గానము చేయును అని ఆళ్వారులు పాడిరి.

తానని ఇతరులని, వీరు నిత్యసూరులని, వీరు సంసారులని, పాలకులని పాలితులని - ఏ భేదమూ లేకుండా, శ్రియఃపతితో కూడ నిత్యవిభూతి, లీలావిభూతి-రెంటినీ అనుభవించుటకు యోగ్యమైనదై **'పాలోడముతన్నవాయిరమ్'** పాలతో కలసిన అమృతమువలెనున్న వేయి అని, **'అముదమెన్ మొళి - అమృతమువంటి తిరువాయ్ మొళి'** అని సాయించినట్లు వాచ్య, వాచక సంబంధమువలన పాలు, అమృతము కలిసిఉన్నట్లు మిక్కిలి భోగ్యమైనదై, సేవించినవారికి జనన, మరణరూపమగు సంసార సంబంధముగలుగకుండ నిత్యత్వము ప్రసాదించునదైనందున అమృతముతో తుల్యమైన దానికంటెను విశేషముగ మార్దవము, మాధుర్యము కలిగినట్టి శబ్ద రూపామృతము ఈ ఆళ్వారుల వాక్కులో ప్రవహించినది.

ఇట్లు వారు శ్రియఃపతి విషయమున కవిత్వము చెప్పవలెను- అని సంకల్పించుకొని ఈ ప్రబంధమును సాయించిరా? ఈ దివ్యప్రబంధము అవతరించిన క్రమమేమి? తెలుపుచున్నారు. గోవులు త్రాగిన నీళ్ళు పాలై, పాలు నెయ్యై, నెయ్యి అమృతమై, దానితో పూర్ణమైన ఒక చెరువు గట్టు తెగి పొర్లిపోవునట్లు **'మయర్వర మతినల మరుళినన్'** (తి.వా. 1-1-1) ఇంచుకైనా ప్రమాదము నొందని భక్తిరూపాపన్న జ్ఞానమును కృపజేసిన వాడవు అని సాయించినట్లు, కర్మజ్ఞానమూలకమగు భక్తికి బదులుగా భగవంతుని అనుగ్రహముండినదై, దాని మూలముగ పరభక్తి మొదలైనవి కలిగినందున, మొదట జ్ఞానము పరభక్తి రూపమై, ఆ పరభక్తి పరజ్ఞానమై, పరజ్ఞానము పరమభక్తియై అట్టి పూర్ణమైనట్టి జ్ఞానామృత సాగరము ఒక చోట ఇముడలేక త్రోసుకొని, పెదిమలను చెలియలికట్టను దాటి, శబ్దములు మనముకూడ ఈ భగవద్విషయమున వినియోగపడవలయుననుకొని, 'నన్ను ప్రయోగింపుము, నన్ను ప్రయోగింపుమని పైపై బడుటచే ఒకదానినొకటి ముందుకు త్రోయుచు కవిత్వరూపమున ప్రవహించెను. అది ఆ వేగమున అన్తాదిగా (ఒక పాశురముయొక్క అంతిమశబ్దము తరువాత పాశురము యొక్క ఆది శబ్దముగా కలిగినది 'అంతాది' కవిత్వ ప్రక్రియ) రూపొంది, అన్తాది ఆయిరం (వేయి) అని ప్రసిద్ధమైనది.





## తొమ్మిదవ అధ్యాయము

# తిరువాయ్‌మొళి - భగవద్గీత

భగవంతుని సాక్షాత్కారమును పొందినట్టి శ్రీనమ్మాళ్వారులు సంసారులుజ్జీవించుటకై ఉపదేశించిన తిరువాయ్‌మొళి ప్రబంధములోగల అర్థములకు గల సామ్యమునుబట్టి, ఇది భగవంతుడు స్వయముగా ఉపదేశించిన శ్రీభగవద్గీతతో సమానమైనదిగా నిరూపించుచున్నారు. **'ఎల్లాప్పొరుళ్ కట్కుమ్ విత్తాయ్ ముతలిల్చ్చితై మనంజెయ్ ఞానత్తు పెరుమై'** (తి.వా. 1-5-2) అన్ని వస్తువులకును స్వస్వరూపము నందు వికారములేనట్లు కారణభూతుడవై మనస్సున పుట్టినట్టి సంకల్పరూప జ్ఞానముగల నీ మహిమ అని సాయించినట్లు సర్వకారణమై అపరిచ్ఛేద్యమైనట్టి సంకల్ప రూపజ్ఞానము గలవాడై, ప్రతివస్తువు లోపల వ్యాపించి, తాను అనంతమై, ఉజ్వలమై జ్ఞానానంద లక్షణమగు స్వరూపమును కలిగినవాడు పరమాత్మ. ఇట్టి పరమాత్మను ఆళ్వారు తన మనస్సునందు సాక్షాత్కరించుకొని, విశదముగా అనుభవించినారు.

ప్రళయార్ణవములో మునిగిపోయిన భూమిని వరాహావతారమెత్తి ఉద్ధరించిన జ్ఞానశక్తులను, స్వామిత్వమును గలవాడై చరమోపాయమును ఉపదేశించిన శ్రియః పతి తప్ప వేఱొకరు ఉజ్జీవనోపాయము కాజాలరు అని ప్రథమప్రబంధమున సాయించిరి. అట్టి సర్వేశ్వరుడు వసించు కురుకాపురి దివ్యదేశమును మీమనస్సున ధ్యానించుడు అని ఆళ్వారులు ఉపదేశించిరి. అట్లే, ధర్మసంస్థాపనార్థము అవతరించిన శ్రీకృష్ణుడు **'అస్థాన స్నేహకారుణ్య ధర్మాధర్మధియాకులమ్ పార్థం ప్రపన్న ముద్దిశ్య శాస్త్రావతరణం కృతమ్'** అన్నట్లు సమయముకాని సమయమున బంధువుల పట్ల గలిగినట్టి స్నేహకారుణ్యముల వలనను, తన దర్మము విషయమున అధర్మమను తలపుగలిగి నందువలనను వ్యాకులపడి యుద్ధమారంభించుటకు వెనుకడుగు వేసిన అర్జునునికి తెలివి కలుగజేసి, సకలార్థములను వివరించునట్టి భగవద్గీతను ఉపదేశించెను.

మొదట దేహాత్మాభిమానము వలన కలిగిన బంధుప్రీతిని, యుద్ధభీతిని పోగొట్టుటకు, **'న త్వేవాహం, దేహినోస్మిన్, అన్తవంత ఇమే దేహా', 'న జాయతే మ్రియతే', 'వాసాం సి జీర్ణాని'** అను శ్లోకములను చెప్పి, ఆత్మపుట్టుక లేనిది, అట్లే మరణము లేనిది, నిత్యమైనది, శరీరమువలె నశింపనిది మనము చినిగిపోయిన వస్త్రములను పనికిరావని విడిచిపెట్టి క్రొత్త వస్త్రములను ధరించు విధమున, ఈ జీవుడు కూడ

శిథిలమైన శరీరమును విడిచిపెట్టి క్రొత్త శరీరమును గొనుచున్నాడు - అని తత్త్వమును వివరించెను.

**'భూమిరాపోనలోవాయుః'** అంటూ భూమి, నీరు, తేజస్సు, గాలి, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము -ఈ ఎనిమిది తత్త్వములు గలది శరీరమని, తాను ఈ చేతనాచేతన పదార్థములను శరీరముగా గలవాడై, **'సర్వస్య చాహం హృది సన్నివిష్టో'** అంటూ, 'ఓ అర్జునా! నేను అందరి హృదయమున ఉండువాడను. నా వలననే జ్ఞానము కలుగుట, జ్ఞానము లేకపోవుట, ఇవన్నీ జరుగుచున్నవి అని చెప్పి **'ఈశ్వర స్సర్వ భూతానామ్'** అను శ్లోకంలో సర్వేశ్వరుడు అందరి హృదయాలలో ఉన్నాడు. సర్వభూతములను తన శక్తిచే యంత్రములోనుండు బొమ్మలవలె త్రిప్పుచున్నాడు. అని చెప్పుట తాను సమస్త జనుల అంతరంగాలలో ఉంటూ సమస్తములగు ప్రవృత్తి, నివృత్తులను గలుగజేయునియంత అని తెలియవలెను.

అయితే, **'తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్త స్యయోగినః'** ఓ అర్జునా! యోగియైనట్టి వానికి నేను మిక్కిలి సులభుడను అని **'పరిత్రాణాయ సాధూనామ్'**- భక్తుల కొఱకు అవతరించితిని అని చెప్పుటలో ఆయన సౌలభ్యము తెలియుచున్నది. నిరంకుశుడే కాని సులభుడట! ఇంకను, 'సమోహం, సర్వభూతేషు..' నేను అందరికీ సమానుడను, నాకు ఇష్టుడు కాని అయిష్టుడు కాని లేడు అని, **'అహంకార విమూఢాత్మా....'** అహంకారముచే మూఢుడైన ఈ జీవాత్మ తానే కర్తననుకొనుచున్నాడు. ఇంద్రియములకంటె మనస్సును యోగాభ్యాసమువలన, వైరాగ్యము వలన వశపరచుకొనవలయును. **'సర్వద్వారాణి సంయమ్య, మనోహృది నిరుధ్య చ'** అన్ని ద్వారములను నియమించి మనస్సును హృదయమునందు స్థిరముగా నుంచవలెను.

**'చతుర్విధా భజన్తే మాం.....'** ఆర్తుడని, జిజ్ఞాసువని, అర్థార్థి అని, జ్ఞాని అని, ఇట్లు నాల్గు విధములగు పుణ్యాత్ములు నన్ను ఆశ్రయించుచున్నారు అని సుకృతవంతుల స్వభావములను, వారిలో తారతమ్యములను విశదముగా భగవానుడు వివరించినాడు.

భగవద్గీతతో తిరువాయ్‌మొళికి గల సామ్యమును శ్రీపిళ్ళైలోకాచార్యులవారి తిరుత్తమ్ములు శ్రీవాదికేసరి అళకియమణవాళ ప్పెరుమాళ్ నాయనార్ తమ 'ఆచార్యహృదయము' తృతీయ ప్రకరణములో ఇంకను వివరించుచున్నారు. విశద వాక్యాఖామణులు శ్రీమణవాళ మహామునులచే అనుగ్రహించబడిన వ్యాఖ్యానముతో ఈ దివ్యప్రబంధమును మనం యథాశక్తి అధ్యయనం చేస్తున్నాము.



**'ద్వౌ భూతసర్గౌ లోకేస్మిన్....'** దేవసృష్టి అని, అసురసృష్టి అని రెండు విధములగు సృష్టులు కలవనీ, వానిలో దైవసృష్టి మోక్షమునకు ఉపయోగపడునని, అసురసృష్టి సంసార సంబంధమును కలుగజేయునని దేవాసుర విభాగయోగమున, ఆదిత్యులలో విష్ణువును, జ్యోతిస్సులలో సూర్యుడను ఇత్యాదిగా అంతములేని తన ఉన్నత రూపమును విభూతియోగమున, **'పశ్యామి దేవాం స్తవ దేవ దేహే.....'** అని నీ దేహమునందు భూతములన్నింటినీ జూచుచున్నాను. నాభి కమలమునందున్న బ్రహ్మను, రుద్రుని, ఋషులను, సర్వమునూ చూచుచున్నాను అని విశ్వరూప సందర్శనమున, **'మన్మనా భవ మద్భక్తో...'** ఓ అర్జునా! నన్ను ధ్యానించి, నాయందు భక్తికలిగిన వాడివై, నన్ను ఆరాదించుచు, నమస్కరించుచుంటివేని తుదకు నన్ను పొందగలవు' అని అంగ సహితమగు భక్తినీ భగవద్గీతలో వలె తిరువాయ్‌మొళిలో కూడ ప్రశస్తముగా పేర్కొన్నారు.

అట్లే, **'దైవీ హ్యేషాగుణమయీ, మమ మాయా దురత్యయా....'** నా మాయ అతిక్రమించుటకు శక్యముకానిది. ఎవరు నన్ను శరణు జొచ్చుచున్నారో, వారే నా మాయను అతిక్రమించగలరు అనీ, **'తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత'** అన్ని విధముల, త్రికరణశుద్ధిగ, నన్నే శరణుపొందుము అని అంగముగాను, **'సర్వధర్మాన్ పరిత్యజ్య'** అని స్వతంత్రముగాను, రెండు విధములుగాను ప్రపత్తిని శ్రీకృష్ణభగవానుడుపదేశించెను. అట్లే ఈ విషయములనన్నింటిని శ్రీనమ్మాళ్వారులు తిరువాయ్‌మొళిలో ఎట్లు ప్రబోధించిరో వరుసగా తెలుపుచున్నారు.

**'అడియేనుళ్ళాన్'** దాసుడుగా ఉన్నాను అనుచోట శబ్దముచేతను, అర్థముచేతను జీవాత్మ పరమాత్మలకు గల భేదమును, **'శెన్రు శెన్రు పరంపరమాయ్'** (తి.వా.8-8-5) పరమ్పరగా పోయి పోయి అన్నమయ, ప్రాణమయ కోశములను క్రమముగా పరిశీలించి, దానిపై వెళ్ళి- అన్నపుడు ఆత్మ దేహము కంటెను విలక్షణమైనదని చెప్పి ప్రకృత్యాత్మ వివేకమనెడి తత్త్వవివేకమును తెలిపిరి.

**'మిన్నిన్నిలైయిల మన్నుయిరాక్కైకళ్'** (తి.వా. 1-2-2) ఆత్మ, మనకిష్టములైన శరీరములూ మెరుపుకంటె ఎక్కువ స్థిరములైనవి కావు సుమా! అని, **'ఉళ్ళతు మిల్లతుమ్'** (తి.వా. 1-2-3) అనిత్యమైన అచేతనమువలెను, నిత్యమైన ఆత్మవలెను, అని సాయించి చిత్తు అచిత్తు అను తత్త్వముల యొక్క నిత్యత్వ, అసత్యత్వములను తెలిపిన వారయిరి. **'ఉడల్ మిశైయుయిరె నక్కరన్దెఙ్గుమ్ పరన్దు'** (తి.వా.1-1-7) శరీరమందు జీవుని వలె మరిగినవాడై అన్నింటిలోను వ్యాపించి ఉన్నవాడు- అని,

**'కరన్ద శిలిడన్దొరు మిడన్దికళ్ పొరుడొరు కరన్దెఙ్గుమ్ పరన్దు'** (తి.వా.1-1-10) అతిసూక్ష్మమైన అల్పశరీరములన్నింటిలోను, ఆ శరీరమునందలి వస్తువులన్నిటిలోను వ్యాపించి ఉండువాడు అనీ సాయించినట్లు అట్టి చేతనాచేతన పదార్థములు శరీరముగా గలవాడై, వాటి ప్రవృత్తి నివృత్తులను తన స్వాధీనములో నుంచుకొని ఉన్న సర్వేశ్వరుని నియంతృత్వమును తెలిపిరి.

**'పత్తుడై అడివర్కెళియవన్'** (తి.వా. 3-1-3) భక్తిగల దాసులు సులభముగా పొందువాడు అని, **'పలపిఱప్పాయొళివరు మియల్వినన్'** (తి.వా. 1-3-2) అనేక అవతారములనెత్తినా సౌలభ్యస్వభావముగలవాడు అని సాయించినట్లు ఇంచుకైనను ప్రీతిగలవారు ఆశ్రయించుటకు అవతారమును బట్టి ఉండునట్టి సర్వేశ్వరుని సౌలభ్యమును, **'ముత్తవుమ్ నిన్దనన్'** (తి.వా. 1-2-6) సర్వులకు సమానుడుగా నున్నాడు అనగా ఆతనిని ఆశ్రయించుట సర్వజన సాధారణమని చెప్పినారు.

**'నీర్ - నుమతెన్నివైవేర్ ముతల్ మాయత్తు'** (తి.వా. 1-2-3) మీరు, మీది అనెడి అహంకారమమకారములను వేరుతో గూడ ఛేదించి వేయుడు అని, **'విణ్ణులార్ పెరుమార్కడిమై శెయ్‌వారైయుమ్ శెఱుమైమ్బులన్'** నిత్యసూరి నిర్వాహకుడు శ్రియః పతి కైంకర్యము చేయువారినిన్ని చెడుపునట్టి పంచేంద్రియములని, 'మనత్తైవలిత్తు' మనస్సును వశపరచుకొనుట దుర్లభమని, **'ఉళ్ళమురై శెయిలుళ్ళయిమ్మూన్రైయు మ్ముళ్ళికెడుత్తు'** (తి.వా. 1-2-8) మనస్సు, వాక్కు, శరీరము- వీటికి గల విషయాంతర ప్రావణ్యమును పోగొట్టి అనగా ఇంద్రియములను నియమించి స్థిత ప్రజ్ఞులు కావాలని ఉద్బోధించారు.

**'పెరునాడు కాణ విమ్మైయిలే పిచ్చైతామ్ గొళ్వర్'** (తి.వా. 4-1-1) జనులందరు చూచునట్లు ఈ లోకమున బిచ్చమెత్తుకొందురు అని ఆర్తుడైన భ్రష్టైశ్వర్యకాముని, 'ఇరుక్కలిరుప్పెన్నుమ్' (తి.వా. 4-1-8) స్వల్పమైన ఆత్మానుభవరూపమగు కైవల్యము అని జిజ్ఞాసువగుకేవలునీ, **'గుణంగొళ్ నిఱైపుకళ్ మున్నర్'** (తి.వా. 4-1-8) గుణవంతులై పూర్ణమైన కీర్తిగల రాజులు అని అర్థార్థి అగు పూర్ణైశ్వర్యకామునీ, 'తిరునారణన్తాళ్ కాలమ్బెర చ్చిన్దిత్తుయ్‌మిన్' (తి.వా. 4-1-1) శ్రియఃపతి యొక్క శ్రీ పాదమునలు వెంటనే ధ్యానించి ఉజ్జీవింపుడు- అని జ్ఞానియైన భగవచ్చరణార్థిని పేర్కొనిరి.

**'నణ్ణావశురర్, నల్లవమరర్'** -క్రూరులైన రాక్షసులు, మంచివారైన దేవతలు అని గీతలోని దేవాసుర విభాగమును, **'మాయావామనన్'** మున్నగు పాశురములందు విభూతి యోగమును, **'నీరాయ్, నిలనాయ్, తీయాయ్, కాలాయ్, నెడువానాయ్ శీరార్,**



**శుడర్ కళిరణ్డాయ్ చ్చివనాయయనానాయ్'** (తి.వా. 6-9-1)-జలరూపుడై, భూమియై, అగ్నియై, గాలియై, విశాలమైనట్టి ఆకాశమై, ప్రకాశముతో పూర్ణుడై తేజోరూపులైన సూర్యచంద్రులిద్దరికిని అంతరాత్మయై, రుద్రునికి, బ్రహ్మకు అంతరాత్మయై ఉన్నట్టి ఓ శ్రియఃపతీ ! అని విశ్వరూపసందర్శనమును వర్ణించిరి.

**'వణైక్కుడత్తవ నెఱివళి నిన్ఱు'** (తి.వా. 1-3-5) నమ్రత గల భక్తి మార్గమున నిలిచి, బాహ్యవిషయములనెడి దుష్టశాఖలను ఖండించి, శ్రియఃపతి ఉపదేశించిన జ్ఞానమును గొని వాసనలు తొలగునట్లు, వేదము నందు పవిత్రములైన పురుషసూక్తాది ఋక్కులను అనుసంధించుచు, భగవత్కైంకర్యము చేయుచు అని సాయించి అంగోపాంగసహిత భక్తిని నమ్మాళ్వారు ఉపదేశించినారు.

ఇంకను, **'మత్తొన్ఱిల్లై'** అని, **'శరణమాకుమ్'** అని ప్రపత్తిని భక్తికి అంగముగాను, స్వతంత్రముగాను-ఇట్లు రెండు విధములగు ప్రపత్తిని ఉపదేశించినందున అర్థసామ్యమును బట్టి తిరువాయ్‌మొళి **'మాయనన్ఱో తియవాక్కు'** - సర్వజ్ఞుడగు సర్వేశ్వరుడు చెప్పినది అని కొనియాడబడినట్టి భగవద్గీతతో సమానముగా జెప్పబడుచున్నది.

ఆచార్యహృదయగ్రంథమూలములో, **'ప్రపత్తి ద్వైవిద్యాధికళాలే'** అనుచోట, **'ఆది'** శబ్దమువలన, **'జన్మకర్మచ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః', త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి, మామేతి సోర్జున'** ఇట్లు నా జన్మను, అమానుషచేష్టితములను వాస్తవముగా నెరిగినట్టి వాడు ఈ దేహమును విడిచినపిమ్మట పునర్జన్మను పొందక, నన్నే పొందుచున్నాడు. అని భగవానుడు చెప్పినట్లు, **'ఇవై పత్తుమ్ వల్లార్ అమరరోడు యర్విచ్చెన్ఱు అఱువర్ తమ్ పిరవి యంజిరై'** (తి.వా. 1-3-11) ఈ పది పాశురములను అభ్యసించువారు నిత్యసూరులతో ఉన్నతమైనట్టి మోక్షమును పొంది తమ సంసారరూపమగు క్రూరబంధమును విడిపించుకొందురు అని ఆళ్వారులు అవతారరహస్యవైభవమును ఉగ్గడించిరి.

**'పత్రం, పుష్పం, ఫలం, తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి, తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః-** ఎవరైన శ్రీతులసీ దళములను గానీ, ఫలములను గానీ గొనివచ్చి భక్తితో నాకు సమర్పించితే వాటిని నేను ప్రీతితో స్వీకరించెదను. అని భగవానుడు చెప్పినట్లు **'పిరివకై యిన్ఱి నన్నీతూయ్ పురివతువుమ్ పుకైపూవే'** (తి.వా. 1-6-1) శ్రియఃపతిని ఎడబాయక ఉండి పరిశుద్ధమైనట్టి జలమును సమర్పించిన తరువాత, ధూపము, పుష్పములను ప్రీతితో సమర్పింపుడు- అని

ఆళ్వారులు సాయించినట్లు స్వారాధనను, ఇతర కైంకర్యములను జెప్పి దేహాత్మాభిమానులైన జీవులను, క్రమముగ ప్రపన్నులనుగాను, భాగవత కైంకర్యపరులను గాను చేయుట, సాధ్యోపాయములను విస్తరించుచు, సిద్ధోపాయవైభవము బాగుగా తెలియునట్లు జేయుటలో భగవద్గీతతో తిరువాయ్‌మొళికి క్రమసామ్యము కలదని నిరూపించినారు.

ఇకపై భగవద్గీత కంటె తిరువాయ్‌మొళికి గల ఆధిక్యమును తెలుపబోవుచున్నారు.

## భగవద్గీతపై తిరువాయ్‌మొళి ఆధిక్యము :

**'తత్త్వం జిజ్ఞాసమానానాం హేతుభి స్సర్వతోముఖైః, తత్త్వమేకో మహాయోగీ హరిర్నారాయణపరః'** అన్నట్లు తత్త్వభూతుడగు సర్వేశ్వరుడు తానే స్వయముగ ఉపదేశించినది భగవద్గీత **'తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా' ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః'** తత్త్వమును సాక్షాత్కరించిన జ్ఞానులకు సాష్టాంగదండము సమర్పించి వారిని సేవించితివేని వారు నీకు జ్ఞానమునుపదేశింతురు అని జ్ఞానోపదేశమునకు ఆప్తతములుగా భగవానుడే పేర్కొనినట్టి తత్త్వద్రష్టలలో నొకరగు శ్రీనమ్మాళ్వారుల శ్రీసూక్తి దీపావళి మన తిరువాయ్‌మొళి. **'అహం కృత్స్నజగతః ప్రభవః ప్రళయస్తథా, మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ'** ఓ అర్జునా! నేను ఈ సమస్త ప్రపంచము యొక్క సృష్టిస్థితి లయలకు కారణభూతుడను. నాకంటె వేఱుగా ఉండునది ఏదీ లేదు అని, **'మామేకం శరణం వ్రజ'** నన్నే శరణుజొచ్చుము అని మున్నగు తావుల తన వైభవమును తానే చెప్పుకొనుట తనను తాను స్తుతించుకొనినట్లు తోచుచుండుట వలన ఈ గీతాశాస్త్రము కొంతమందికి నమ్మదగినదిగా ఉండదు.

కాగా, శుద్ధసత్త్వజ్ఞానులగు నమ్మాళ్వారులు **'మణ్ణువిణ్ణు మెల్లా ముడనుణ్ణ నన్గణ్ణన్ కణ్ణల్ల తిల్లైయోర్ కండే'** (తి.వా. 2-2-1) భూమిని, ఆకాశమును అన్నింటిని ఏకకాలమందే ఆరగించిన మన శ్రీకృష్ణుండు రక్షకుండుగాక, వేఱొక రక్షకుడు లేడు, ఇది యథార్థము అని, **'తిణ్ణమానుమ్ముడైమై యుండే యవనడి శేర్త్తుయ్‌మినో'** (తి.వా. 9-1-10) మీకు ద్రవ్యమున్న యెడల వాని శ్రీపాదములందు సమర్పించి ఉజ్జీవించుడు అని ఇట్లు భగవంతుని కరుణను పొందిన మధ్యస్థునిగా, ఒక తత్త్వదర్శిగా వాని వైభవమును ఉపదేశించినందున తిరువాయ్‌మొళి ప్రబంధము సర్వులకు నమ్మదగినదిగా నుండుననెడి ఆధిక్యము కలిగి ఉన్నది.



ఇక ఈ ప్రబంధమును శాయించుటలో గల ఆధిక్యమును తెలుపుచున్నారు. రాజ్యమును కోరువారై ఆదరించి, **'న కాంక్షే విజయం కృష్ణ'** అని అస్త్రాలు దిగవిడిచిన అర్జునుని, **'కరిష్యే వచనం తవ'** - నీమాటప్రకారం చేసెదను అనిపించి, యుద్ధములో ప్రవేశపెట్టి నూఱు మంది దుర్యోధనాదులను నశింపజేయుటకై భగవద్గీత ఉపదేశింపబడినది. ఇక తిరువాయ్‌మొళి అందుమా, **'తోత్తోమ్ మడనెంజమ్ ఎమ్బెరుమాన్ నారణఱ్కు'** (2-1-7) స్వామియైన నారాయణునికి స్వాధీనమందున్న మనస్సును కోల్పోతిమి - అని ప్రాప్తశేషియగు వానివిషయమున అందరు మనస్సు లగ్నమైమాట్లాడు విధంగా **'ముడిప్పాన్ శొన్న వాయిరమ్'** (8-7-11) సంసారబంధమును పోగొట్టుటకై సాయించినట్టి వేయిపాశురములు భగవద్విషయమున ప్రీతికలుగునట్లుచేసి శరీరేంద్రియ సంబంధమును నశింపజేయుటకు ఉపదేశింపబడినవి. కాన గీతమోక్ష శాస్త్రమైనను అది వేఱొక కార్యమునకై ఉద్దేశింపబడినది అను ఒక కొరత దానికి గలదు. తిరువాయ్‌మొళికో, మోక్షమునకే ప్రవర్తించినది అను ఒక అతిశయము కలదు.

ఉపక్రమోపసంహారముల మూలముగ ఈ రెండింటికి వచ్చినవైభవమును తెలుపుచున్నారు. **'శిష్య స్తేహం శాధి మాం త్వం ప్రపన్నమ్'** నీకు శిష్యుడనై నిన్ను శరణు జొచ్చితిని. నన్ను మంచిమార్గమున ప్రవర్తింపజేయుమా అన్న అర్జునుని ఆర్తిని గని ప్రీతితో నారంభించిరి. **'నూన మశ్రద్ధ ధానోஉసి దుర్మేధాశ్చాసి పాండవ! అబుధ్యాయన్న జానీషా తన్మే సుమహదప్రియం'** ఓ అర్జునా ! నిజముగా నీకు శ్రద్ధలేదు. చెడ్డబుద్ధి గలవాడవు. జ్ఞానము లేనందున నీకు తెలియకుండుట నాకిష్టము లేదు - అని గీత అయిష్టముతో ముగింపబడినది.

భగవంతుని విషయములో విముఖులైన వారిని గురించి ఉపదేశించినదై నందున తిరువాయ్‌మొళి ఆరంభములో 'పాపము ఎంత పెరిగిపోయినది, అని మనస్సున నొచ్చుకొనుచు ప్రారంభించిరి. ఆ ఉపదేశములు మనస్సున నాటి అందరు దిద్దుబాటు కాగా ఆవిధంగా దిద్దుబాటు అయినట్టివారిని జూచి, **'పొలిగ, పొలిగ'** అని మంగళాశాసనము చేసి ముగింపబడినది. గీతలోని ఉపదేశము మోక్షపర్యంతము అర్జునునకు సిద్ధింపకపోగా, తిరువాయ్‌మొళిలో మోక్షపర్యంతము ప్రయోజనము సిద్ధించును.

ఇక, ప్రతిపాదింపబడిన విషయమునుబట్టి కూడ తిరువాయ్‌మొళి అతిశయమును తెలుపుచున్నారు. భగవద్గీత యందు **'మామేకం శరణం వ్రజ'** అని సిద్ధిధర్మమును (ప్రపత్తిని) విధించి యుండగా, తిరువాయ్‌మొళియందు

**'తిరునారణన్తాళ్ కాలమ్బెరచ్చిన్గిత్తుయ్మినో'** శ్రియఃపతి శ్రీపాదములనెల్లప్పుడు ధ్యానించుడు అని విధియును, **'అడిక్కీళ్ అమర్న్దు పుకున్దేన్'** (6-10-10) శ్రీపాదముల క్రింద అమరియుండి ప్రవేశించితిని అని అనుష్ఠానమును తెలియజేసిరి. గాన విధిని మాత్రము తెలుపు భగవద్గీత కంటె, విధిని, అనుష్ఠానమును రెంటిని తెలియజేయు తిరువాయ్మొళికే ఎక్కువ అతిశయము కలదని తెలియును గదా!

కాగా, భగవద్గీతకు తిరువాయ్మొళి మరొక అతిశయము చేకూర్చినదట! ఎట్లో తెలుపుచున్నారు. **'అమ్ పకవన్ వణక్కుదైత్తవ నెరివళినిన్ఱు'** భగవంతుడు స్వయముగ ఉపదేశించినది అని - **పణ్డే పరమన్ పణిత్త పణివకైయే, కండేన్ కమలమలర్ పాదమ్'** భగవంతుడు తెలిపియున్నట్టి ప్రాప్యమును చూచినాను- అది వాని పాదపద్మములే. అని మున్నగు తావులందు ఆళ్వారులు భగవద్గీతను ప్రమాణముగా గొనుటచే దానికొక అతిశయముకలిగెను.

ప్రమేయభూతుడగు శ్రియఃపతితో గూడ ప్రమాణమును ప్రమాతను చేర్చివారి అందరి ఉపదేశమును సంగ్రహముగ తెలిపినది భగవద్గీత కాగా, నమ్మాళ్వారులు తమ ప్రబంధములో సమస్త విషయములను ఉపదేశించినారు. **'అవిద్యః, ప్రాకృతః, ప్రోక్తః'** అన్నట్లు తత్త్వమునుగురించిగాని, హితమును గురించి గాని 'పురుషార్థమును గురించిగాని జ్ఞానములేని సంసారులకు మాత్రమే భగవద్గీత ఉపదేశింపబడినదికాగా తిరువాయ్మొళి భగవంతుడే మోక్షోపాయమనెడి నిష్ఠగల జ్ఞానులకు, భగవంతుని స్వరూప, రూప, విభూతులను సాక్షాత్కరించి ఉపేయపరులై, అట్టి ఉపేయమును అనుభవించుటయే యాత్రగాగలిగిఉండు జ్ఞానులకు, సర్వజ్ఞుడగు సర్వేశ్వరునకు గావలసిన వాటినీ ఉపదేశించి వారిని దిద్దుబాటుచేసినారు. ఇదే ఉపదేశకులుగా, అనుష్ఠానపరులుగా ఆళ్వారుల అతిశయము.

అయితే అందరికీ తెలియని వాటిని వీరు తెలుపవలెనా అనిన, ఎవరికి తెలుపవలసిన అర్థములను వారికి తెలుపుచున్నారు. మొదట భగవంతుని విషయమగు జ్ఞానములేనివారికి ఉజ్జీవనోపాయమును, పరమపదమును పొందుటకు యోగ్యతకల వారికి ప్రాప్యవైలక్షణ్యమును, ఆశ్రయింపవలసినది, ఆశ్రయింపకూడనిది తెలియని వారికి సౌశీల్యగుణరూపమగు ఆధారమును, కడతేర్చునట్టివారికి ఇరువది నాలుగు తత్త్వములను తెలుపవలెను. అనగా వీరు జ్ఞానహీనులైనట్టి వారిని భగవంతుని మోక్షపాయముగా గొనునట్లు చేయుదురు. ఉపాయమునందుమంచి అధ్యవసాయము గలవారికి ప్రాప్యమున (కైంకర్యమున) మంచిరుచికలవారుగా చేయుదురు.



ప్రాప్యమునందు ప్రవేశించినవారికి మంచి ఆధారమును (సౌశీల్యగుణము) చూపుదురు. తన విషయమునగల ప్రీతివలన ముందుకు పోవుటకు మనస్సురాక పోవుటచే త్యాజ్యమగు దేహమందుండునట్టి దోషమును జూడనివానికి (సర్వేశ్వరునికి) 'మంగవొట్టున్మామాయాయై, శరీరమును నశింపజేయుమా! అని ప్రకృతియందుగల దోషములను చూపించిరి.

ఉపాయ, ఉపేయములు చేజిక్కినవారికి తెలుపవలసినది కొంచమేగాన ఈ ఉభయులను విడిచిపెట్టి, కర్మానుష్ఠానపరులై ఉపాయోపేయములు ఇట్టివి అని తెలియక కలవరపడు సంసారులకు **'వీడుమిన్ ముత్తవుమ్'** అన్నీ పూర్తిగా విడిచిపెట్టుడు- అను తిరువాయ్మొళి మొదలుకొని, **'శునైనన్ మలరిట్టు నినైమిన్ వెడియానే'** పరిశీలింపుడు అను వరకును త్యాజ్య, ఉపాదేయములను అనేక విధములుగ ఉపదేశించిరి.

జీవులవిషయమటుంచి, సర్వేశ్వరుడుకూడ ప్రేమపరవశుడై ఉపాయ ఉపేయములు ఇట్టివి అని ఎరుగక మనస్సు వ్యాకులపడి తమ అయోగ్యతను తలచుకొని వీరు మనలను విడనాడినట్లయిన ఏమిచేయగలమని అనుమానపడి, అల్లాడునప్పుడు **'ఉన్నైనాన్ పిడిత్తేన్కొల్'** (తి.వా. 2-6-1) -నిన్ను నేను దృఢముగా ఆశ్రయించితిని, అంగీకరింపుమా! అని **'ఉన్నైనాన్ అడైన్దేన్ విడువేనో'** - నిన్ను ఆశ్రయించిన పిమ్మట విడుచుదునా? అని, **'మాశుచః'** (దుఃఖపడకుము) అని భగవానుడు చెప్పినట్లు **'తోకై మామయిలార్కళ్ శెవియోశై వైత్తళ అకళ్పోకవిట్టు కుళలూతు'** (తి.వా. 6-2-2) నెమలిపింఛము వలె శ్లాఘ్యమైనట్టి కేశపాశములు గల స్త్రీలు వేణునాదమును విని లేచి వచ్చునట్లు, నీవు వెళ్ళివారి సమీపమందుండి గోవులను దూరముగా పోనిచ్చి వేణువును ఊదుము - అని చెప్పుచు ఉపాయోపేయముల దెలియజేసి, కృత్యాకరణములను బోధించుటవలన మొదట పేర్కొనినట్టి అజ్ఞానులకును, తుదిని పేర్కొనినట్టి సర్వజ్ఞుడగు సర్వేశ్వరునికి పదే పదే హితాహితములను ఉపదేశించుచుందురని మనము తెలిసికొనవలెను. ఈ చూర్ణికను మఱొక విధముగా కూడ అర్థము చేసికొనవచ్చును.

ఉజ్జీవనము గురించి ఉపదేశించునపుడు **'వీడుమిన్ ముత్తవుమ్'** అను తిరువాయ్మొళి భక్తిరూపమగు ఉపాయమునుచెప్పి, **'కణ్ణన్ కళలిణై'** అనునది ప్రపన్నులు ప్రవర్తింపవలసినట్టి విధమును చెప్పి, ఉపాయ ఉపేయవిషయమున సంశయమును పోగొట్టుటయే ప్రధానముగా గొనిరి. కాగా ఈశ్వర విషయమగు

ఉపదేశముకూడ అట్టి సంశయమును పోగొట్టుటకే అని గ్రహించుటకు **'పిడిత్తేన్' 'విడువేనో'** అనుపాశరములు రెండును శ్రియఃపతి తనకుఉపేయభూతులగు ఈ ఆళ్వారులతో కలిసిమెలిసి ఉండుటచే ఒక అపురూపఫలమును పొందినట్టివాడై, ఆళ్వారులు తమకట్టి యోగ్యత లేదనుకొని వెనుదీసినట్లయితే ఏమిచేయగలమని అనుమాన పడుటచే కలిగిన కష్టమును తొలగించుటకు చెప్పినవిగావచ్చును.

ఆళ్వారులు ప్రకాశరూపమగు జ్ఞానమే స్వరూపముగా గల శ్రియఃపతికి ప్రీతివలన నుపదేశింతురు. కృపారూపమగు జ్ఞానమువలన సంసారులకు భగవద్భక్తిని కలుగజేయుదురు. **'ఉయర్ మాయ్‌తమ్ కణ్డాత్తేన్'** సంసారులు ఆశించినవి పొందక శిథిలురగుట జూచి సహింపజాలనని చెప్పిఉన్నందున, **'అశురర్‌కళ్ తలైప్పెయ్యిల్'** ఎవన్ కొల్ ఆంగెన్ను ఆళుమ్ మెన్నారుయిర్- రాక్షసులు వచ్చినీపై బడితే ఏమి ఆపత్తుకలుగునో అని నా ఆత్మ తత్తర పడుచున్నదని చెప్పినందున, పరుడగు పరమాత్మను జూచి సహింపజాలకుండుట ఈ రెండును వీరిట్లు ఉపదేశించుటకు హేతువుగా జెప్పబడిన జ్ఞానమును ప్రేమరెంటిలోను అంతర్భూతములని తెలియ వలెను. అవి పరదుఃఖ అసహిష్ణుత్వమును విడిచి ఉండజాలవని కూడ నిరూపింప బడినదిగదా!

**'ఎన్నతున్నతావియుమ్'** అను తిరువాయ్‌మొళిలో, నేను నీ దివ్యాత్మ స్వరూపమును కాపాడితిని అని చెప్పు సందర్భములో 'అఱివారుయిరానాయ్' అనగా జ్ఞానులను ఆత్మగాగలిగిఉన్నాడని, **'జ్ఞానీత్వాత్మైవ మేమతమ్'** జ్ఞానిఅయినవాడే నాకు ఇష్టుడు అని సాయించినందున వీరు శ్రియఃపతి కష్టపడుచుండగా చూచి సహింపజాలరు. సరే, ఆళ్వారులు జీవేశ్వరులిద్దరిక అనేక పర్యాయములు హితాహితముల నుపదేశించుచున్నను, శిష్యునికి ఉండవలసిన యోగ్యత ఏదీలేని శ్రియఃపతి ఉపదేశమునకు తగినవాడేనా? అనుశంక కలుగవచ్చును.

**శ్రియఃపతి శిష్యత్వము :**

సచ్ఛిష్యుడైనవాడు ఆచార్యుని వారు ప్రేమించి ఉన్నట్టి ప్రదేశమున నివసింపజేసి, వారి ఇష్టప్రకారము ప్రవర్తించువాడై, వారి దివ్యమంగళ విగ్రహమున భేదబుద్ధి ఏదీ లేనట్టి ప్రీతి గలవాడై, అన్ని విధముల వారిని ప్రేమించి, వారి విషయమున తప్ప తక్కిన వాటి విషయమున ప్రీతిలేనివాడై ఉండవలెను. దరిద్రుడు ధనమును పొందినట్లు, ఆకలిగొన్నవాడు అన్నమును పొందినట్లు, దప్పికగొన్నవాడు జలమును లభించినట్లు అధికప్రీతితో ఆచార్యుని సేవించవలెను.



**'శరీర మర్థం ప్రాణం చ సద్గురుభ్యో నివేదయేత్'** అన్నట్లు తనను, తనకున్నట్టి వాటినన్నింటిని ఆచార్యునికి సమర్పించి, **'కృత్స్నాంవా పృథివీం దద్యాత్ న తత్తుల్యం కథంచన'** - భూమినంతా ఇచ్చినను ఆచార్యుడు చేయునట్టి ఉపకారమునకు సరికాదు. కావున, ఆచార్యుడు తన దేహపోషణకు కావలసిన వాటి భారమునంతా తనపై నుంచినను, తాను దానినంతా భరించుచు, రేయింబగళ్ళు వారిని వదలి ఉండక, ఒకవేళ వారు కోపగించుకొని పొమ్మన్నను పోకుండ, వారికి అయిష్టములయినప్పుడు తనకిష్టమైనవాటినీ విడిచిపెట్టి, ఆచార్యుడు విధించిన ప్రకారము నడచుకొనునట్టివాడే సచ్ఛిష్యుడు.

మరి, శ్రియఃపతి శిష్యత్వమెట్టిదో చూచెదము గాక! 'ఇరుత్తుమ్ వియన్దెన్నై త్తన్ పొన్నళికీళ్' (తి.వా. 8-7-1) - నన్ను తన అందమైన శ్రీపాదముల క్రింద సంతోషముతో నుంచును అన్నట్లు వీరికిష్టమైన తావుననే వీరినుంచి, 'ఎన్నెణ్ణానానాన్' (తి.వా. 1-8-7) నా యిష్టప్రకారము అయినాడు అని వీరి ఇష్టప్రకారము ప్రవర్తించువాడై, **'పాయ్ కలవాతెన్మెయ్ కలన్దాన్'** (తి.వా. 1-8-5) నిజముగా నా శరీరముతో కలిసి యుండెను అన్నట్లు వారిశరీరములో నున్నప్పుడు ఏ తారతమ్యము లెంచకుండ, **'ఆన్దామత్తన్బుశెయ్‌దు'** (తి.వా. 2-5-1) నిత్యసూరులను ప్రేమించినట్లు ప్రేమించి, **'ఇరున్దాన్ కణ్డుకొణ్డు'** (తి.వా. 8-7-2) కటాక్షించుచు నాలో ఉన్నాడు అని ఆళ్వారులు సాయించిరి.

అంతే గాదు. **'ఎన్నై ముత్తవుమ్ తానుణ్డాన్'** (తి.వా. 9-6-8) నన్ను సంపూర్ణముగా అనుభవించినాడు అని, **'పరిజన పరిబర్హాభూషణాన్యాయుధాని ప్రవరగుణగుణాశ్చ జ్ఞానశక్త్యాదయస్తే, పరమపదమధాణ్డా న్యాత్మదేహ స్తథాత్మా వరద! సకలమే తత్సంశ్రితార్థం చకర్థ'** - ఓ వరద! నీ పరిజనమును, వస్త్రభూషణాదులను, నీ సౌశీల్యాది కల్యాణగుణములను, జ్ఞానశక్త్యాదులను, పరమపదమును, అండ బ్రహ్మాండాది లోకములను నీ ఆశ్రితుల అధీనముచేసినావు అని, **'ఎనక్కే తన్నై తన్ద కఱ్పకమ్'** తనను నాకొసగినట్టి కల్పవృక్షమువంటి వాడు అని సాయించినట్లు తన విభూతిని తనను వీరికొసంగిరి కదా!

ఆళ్వారులకంత చేసినా, తాను కొరతగలవాడై, తన యొక్క తనతో సంబంధించినవాటి వారియొక్క భారమును **'నమః'** అని ఒకమాటతో వీరు సమర్పింపగా, **'వేంగడత్తుఱైవార్క్కునకువెన్నలాంకడమై యతు శుమన్దార్‌కట్కు'** (తి.వా.

3-3-6) వేంకటాద్రిపై వేంచేసిఉన్నట్టి శ్రియఃపతికి శేషభూతుడను, మరెవ్వరికీ శేషభూతుడనుకాను- అను అర్థము నిచ్చు **'నమః'** అనుశబ్దమును ఉచ్చరించినవారికి అని చెప్పదగినట్లు **'భూయిష్ఠాం తే నమ ఉక్తిమ్'** అన్నట్లు, 'నమః' అనునది తనకు ఘనమైనదిగా తోచినందువలన ఆ భారమంతా సహించిరికదా !

**'అల్లుమ్ పకలు మిడై వీడిన్ఱి నల్కి యెన్నై విడాతే'** (తి.వా.1-10-8) రేయింబగళ్ళు నన్ను ప్రేమించి నన్ను దాసునిగా నమ్మి, నన్ను విడువకుండ ఉండును. **'పోకు నమ్బీ'**- ఓ పూర్ణుడా! వెళ్ళిపో అని కోపగించుకొని పొమ్మన్నను, **'అకల్ వానుమల్లనివి'** (తి.వా. 2-6-7) లోపల ప్రవేశించిన పిమ్మట విడిచిపోవునటువంటివాడు కాడు. **'అన్బిన్ పోకేల్'** (తి.వా. 10-3-8) పశువులను మేపుటకై వెళ్ళవలదు అని వీరు పోవద్దని చెప్పగా **'తివత్తిలుమ్ పశునిరై మేయపుగత్తి'** (తి.వా. 10-3-10) పరమపదము కంటె పశువులను మేపుటనే ఎక్కువగా ప్రేమించితిని - అనుచూ తనకు ఇష్టమైన వాటిని విడిచిపెట్టి **'అరుళ్ తరువానమైకిన్ఱా నతు నమతు వితివకైయే'** (తి.వా.10-9-1) సర్వేశ్వరుడు తన కృపజూపుటకై సిద్ధపడుచున్నాడు, అది మన నియమనము ప్రకారమే చేయుచున్నాడు అన్నట్లు వీరు నియమించిన ప్రకారము ప్రవర్తించువాడగు సర్వేశ్వరుడే, ఆళ్వారులు సాయించు ఉపదేశములకు సత్ప్రాప్తమైన వాడని, సచ్ఛిష్యుడని నిరూపించినారు.

**'నణ్ణాతార్ మఱువలిప్ప'** (తి.వా. 4-9-1) **'మెయ్యిల్ వాళ్క్కై'** (పెరు. తి.3-1) **'ఊనేఱు శెల్వత్తు'** (పెరు.తి. 4-1) **'ఆశవాయ్ చ్చెన్న శిన్దై'** లలో సాయించిన ప్రకారము భగవద్విముఖులైనట్టివారు లోకయాత్ర విషయమున, శరీరము విషయమునను కర్మనుబట్టివచ్చు వారగు దేహబంధువుల విషయమున కానవచ్చునట్టి దోషములగని వైరాగ్యముతో ఆస్తిక్య, అమానిత్వాది ఆత్మగుణములను పరిపూర్ణముగా కలిగియుండిన వారై ప్రణిపాత, అభివాదన, పరిప్రశ్నసేవాపరులగు వారిని మనస్సులో నుంచుకొని, అనధికారులకు (యోగ్యతలేనివారిక) తెలుపకుండ అనుసంధించుకోవలసినది అని నియమించి ఉపదేశించవలసిన అర్థమును, అనధికారులకు ఉపదేశించుట సమంజసమేనా అని ప్రశ్న. **'నుమ్మిన్'**, **'విరోతమ్'** **'ఈనచ్చొల్'** **'ఎవ్వుయిర్క్కుమ్'** **'అఱియ'** అని సాయించినట్లు శాస్త్రవిధిని ఉల్లంఘించి అనధికారులకు ఉపదేశించుటకు కారణములు మూడు :- 1. అయ్యో భూలోకమున నుండువారు సంసారబంధములో పడిఉన్నారే అనుకొనుట. 2. వారి కష్టముల జూచి సహింపజాలకుండుట, 3. నిరవధిక కృప.పై మూడు లక్షణములును సర్వలోక జనని అగు పిరాట్టికిని, ప్రహ్లాదునికిని,



శ్రీవిభీషణుల వారికిని, నమ్మాళ్వారులకును, వీరి తిరువడి (శ్రీపాదము) సంబంధము వలన ఉజ్జీవించినవారగు శ్రీరామానుజుల వారికినీ గలవు.

ఇట్లు విముఖులగు సంసారులను గుఱించి ఆళ్వారులు అనుగ్రహించిన ఉపదేశము సఫలమైనదా? అని అడిగిన వారి ఉపదేశము సఫలమై అందరు దిద్దుబాటయిరి అని సాయించినారు. ఇకపై నమ్మాళ్వారుల దివ్యప్రబంధములు నాలుగూ తిరుమంత్ర, ద్వయమంత్ర, చరమశ్లోకార్థ రహస్యములను తెలుపునని విశదీకరించబోవు చున్నారు.



## పదవ అధ్యాయము

# ఆళ్వారుల ప్రబంధాలు - రహస్యత్రయైక్యము

నమ్మాళ్వారులు మనకు ఉపదేశించుటలో నిమగ్నులయినపుడు, వారి భగవదను భవమునకు భంగము కలుగదా అని సందేహం కలుగవచ్చును. **'మెయ్‌నిన్ఱు కేట్టరుళా అడియేన్'** (తిరువ-1) దాసుని విన్నపమును కృపతో వినుమా! అని ఆరంభించి **'మంగవొట్టున్మామాయై'** (తి.వా. 10-7-10) (నీ ఆశ్చర్యకరములైన ప్రకృతిప్రాకృతము లను నశింపజేయుమా! అనుదాక మధ్యలో నుండు నాల్గు ప్రబంధములును, వీరు భగవదనుభవములో నుండగనే అనుగ్రహించిన పరోపదేశములని తెలియవలెను. కావుననే, వీరు భగవద్గుణానుభవమును జేయుచునే, పరులకు ఉపదేశించుచుందురనీ, అట్లే పరులకు ఉపదేశించుచునే భగవద్గుణానుభవము చేయుచుందురని మన పెద్దలు సాయింతురు. దీనినిబట్టి ఆళ్వారులు అన్యాపదేశముగా పరులకుపదేశించు నప్పుడు వారి భగవద్గుణానుభవమునకు ఎట్టి విఘ్నముకలుగ నేరదని తెలిసినది గదా!

ఇక, నమ్మాళువారల దివ్యప్రబంధములు నాలుగున్నూ, తిరుమంత్ర, చరమ శ్లోక, ద్వయములను రహస్యములతో నిబంధింపబడియున్నవని ఉపపత్తులతో నిరూపించుచున్నారు. సకల శాస్త్ర సారమగు అర్థపంచకమును సంశయవిపర్యయములు లేకుండ ప్రతిపాదించుచు, **'సర్వమష్టాక్షరాన్తస్థమ్'** అన్నట్లు సకల శాస్త్ర సంగ్రహమగు తిరుమంత్రమును, సిద్ధోపాయాంగీకారమును సాంగముగా ప్రతిపాదించునట్టి చరమశ్లోకమును, ఉపాయమును, ఉపేయమును, అంగీకారమును, ప్రార్థనను సక్రమముగా ప్రతిపాదించుచు, కాలక్షేపమునకు, భగవద్గుణానుభవమునకు ప్రపన్నులచే సర్వదా అనుసంధింపబడు ద్వయమంత్రము (మంత్రరత్నమ్) - ఈ మూడు రహస్యములును ఆళువారల దివ్యప్రబంధములలో పరిమళించుచుండును.

అదిఎట్లనగా ......... :

**'ఉయిరళిప్పాన్'** అనుటచే ప్రణవములోని ప్రథమాక్షరముయొక్క ధాత్వర్థమగు భగవద్రక్షకత్వము తెలుపబడుచున్నది.

**'అడియేన్'** అనుటచే భగవంతునిచే రక్షింపబడునదై, ఆయనకు అనన్యార్హశేషమై, ప్రకృతికంటె విలక్షణమైనదై, జ్ఞానానందస్వరూపమైన ఆత్మస్వరూపము, **'అడియేనడి యావియడైక్కలమ్'** అని చేయు ఆత్మసమర్పణము విన్నవించబడు చున్నది. **'తిరుమాల్ తిరుప్పేర్‌వల్లారడిక్కణ్ణి శూడియ మాఱన్'** శ్రియఃపతి తిరునామమును సంకీర్తనము



జేయు శ్రీవైష్ణవులయొక్క చరణములనెడి పుష్పమాలికలను, తలపైధరించిన ఆళ్వారులనినపుడు తదీయ శేషత్వము (భాగవతశేషత్వము) తెలియుచున్నది.

**'పొయ్‌నిన్ఱ జ్ఞానముమ్ పొల్లావొళుక్కు మళుక్కుడమ్బుమ్'** (తిరువ-1) అసత్యావాచ్యమైన అచేతనమందు ఆత్మ అనెడి జ్ఞానమును, సాంసారిక దుష్కర్మ ప్రవృత్తియును, మురికి శరీరమును అని, **'ఏతానురాక్కైయిల్ పుక్కజ్గాప్పుణ్డు మాప్పవిళ్‌న్దుమ్'** - ఏదో ఒక శరీరమునందు ప్రవేశించి సంతోషముగా ప్రారబ్ధకర్మ ననుభవించి అని సాయించి అవిద్యను, అవిద్యాకార్యములను, విరోధిని, విరోధి నివృత్తిని సూచించిరి. **'తామరై యున్ది తని ప్పెరునాయక'** నాభికమలమున (బ్రహ్మను) కలవాడవై, అద్వితీయుడవై సర్వాధికుడవైన ఓ స్వామీ! అని ఆరంభించి, **'ఎమ్బెరు మామాయన్'** నా గొప్ప స్వామీ! అని ముగించుటచే, **'నారాయణ'** పదముచే ఉభయ విభూతి యుక్తమైన ప్రాప్యవస్తువును తెలిపిరి. **'తనిమాత్తెయ్ వత్తడియవర్క్కినామాళాకవే యుశైయుంగొల్'** (తిరువా-3) అద్వితీయుడు, పరదేవత అయినట్టి వానికి, దాసులైన శ్రీవైష్ణవులకు ఇక మనము దాసులగుట ఎప్పుడో? అని, **'ఊళితోరూళి యోవాడు వాళియ వెన్ఱు యాన్తొళవిశైయుం కొళ్'** (తిరువా-4) శ్రియఃపతియొక్క శ్రీపాదములను ప్రతికల్పమునందు ఎడతెగకుండ మంగళాశాసనము చేయగలమా? అని ఇట్లు ప్రాప్యమును, ఫలమును రెండింటిని చెప్పు. తిరువాశిరియము, తిరువిరుత్తమ్ ఈ రెండు ప్రబంధములు. తిరుమంత్ర ప్రతిపాదకములై ఉన్నవి.

ఇక **'నెఱి కాట్టి నీక్కుతియో'** అనుచు ఉపాయాంతరముల జూపించి నిన్నువిడిచి పోవునట్లు చేయవలెననియా? అనగా **'సర్వధర్మాన్ పరిత్యజ్య'** లో చెప్పినట్లు ఉపాయాంతరములు త్యజింపవలసినవిగదా! **'వేణ్‌కొట్టేరేళుడనే కొన్ఱానైయే మనత్తు క్కొండు'** (పెరి.తి. 48) క్రూరములైన కొమ్ములుగల వృషభములను ఏడింటిని సంహరించిన శ్రీకృష్ణునే హృదయమునందు ఉపాయముగా అంగీకరించి అని సాయించి, **'మా మేకం శరణం వ్రజ'** అను మానసాధ్యవసాయరూపమగు ఉపాయస్వీకారమును తెలిపిరి.

**'అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి'** అని తెలియజేయుటకు **'వానో మరి కడలో'** (పె.తి. 54) అని ఆరంభించి, **'వన్దుయరై మరున్ద కండిలమాల్'** క్రూర పాపమును మనవద్దచూడకయున్నాము అని విరోధులు తాము పోయినట్టి తావు తెలియకుండునట్లు, తమంతనే పోయినవి అని చెప్పిరి కాగా, నీవును చేయవలసినది లేదు, నేనూ చేయవలసినది లేదు అన్నట్లు, **'మోక్షయిష్యామి'** అను క్రియాపదమున

నుండు **'ణిచ్'** ప్రత్యయార్థమును, **'అడర్‌పొన్‌ముడియానై'** (పె.తి. 70) శత్రువులను బాధించునట్టి కిరీటము గలవాడు అని ఆరంభించి **'యాదాకిల్ యాతే యుని'** పాపం నశించినను, పెరిగినను ఏమి? అని అంతిమంగా **'మా శుచః'** అనుటలో నిర్భరత్వాను సంధాన ప్రాముఖ్యతను తెలిపిరి. ఇట్లీ రెండు ప్రబంధములు తిరుమంత్ర, చరమశ్లోకార్థ ప్రతిపాదకములై ఉన్నవి.

ఇంకను, **'దీర్ఘశరణాగతి'** అని ప్రసిద్ధిగాంచిన తిరువాయ్‌మొళి పది పత్తు లోను శ్రియఃపతిత్వము మొదలు కైంకర్యవిరోధినివృత్తివరకు ద్వయార్థము ప్రతిపాదింప బడినదని తమ 'సారసంగ్రహము' అను గ్రంథమునందు శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించియున్నారు. శ్రియఃపతికి సమస్తనిధియై, ఆచార్యులకు ఆపద్ధనమై రెండు అర్థములను ప్రతిపాదించుటచే ద్వయమని పిలువబడునట్టి వాక్యద్వయము పది అర్థములను ప్రసాదించుచున్నది. అవి ఏవనగా- శ్రియఃపతిత్వము, నారాయణత్వము, నారాయణుని చరణారవిందద్వయము, ఆ ద్వయమే మోక్షోపాయము, వానికై చేతనుని ప్రార్థన, వానితో నిత్యసంబంధము, శ్రియఃపతి నిరతిశయ భోగ్యత, సర్వస్వామిత్వము, నిత్యకైంకర్యము, కైంకర్యవిరోధి నివృత్తి అను నీ పది అర్థములు. తిరువాయ్‌మొళిలోని పది పత్తులలోను ఈ పది అర్థములు ప్రతిపాదించబడినవి అని ఆనందించుచు మన పూర్వాచార్యులు వాటిని చేర్చి అనుసంధించుకొందురు.

తిరువాయ్‌మొళి పది పత్తులలోను మంత్రరత్నమునకు గల పది అర్థములు ఎట్లు వివరింపబడినవో ఇక ఉదాహరణ పూర్వకముగా తెలిసికొందాము.

తిరువాయ్‌మొళి మొదటి పత్తులో, **'మలర్ మకళ్ విరుమ్బునమరుమ్బెఱలడి కళ్'** **(1-3-1)** లక్ష్మీదేవిచే ప్రేమింపబడువాడును, లభించుటకు దుర్లభమగునట్టివాడైన మనస్వామి అని, **'మలరాళ్ మైన్దనై'** కమలమునందుండు లక్ష్మీదేవికి నాథుడు అని, 'తిరుమకళార్ తనక్కేళ్వన్, లక్ష్మీదేవికి భర్త అయినట్టివాడని, **'తిరువిన్‌మణాళన్'** శ్రియః పతి అని, ఇంకను కొన్ని తావుల శ్రియఃపతిత్వము పేర్కొనబడినది.

రెండవ పత్తునందు, **'ఎమ్బెరుమాన్ నారణత్కే'** - నాకు స్వామి ఐనట్టి నారాయణునికి అని, **'ఎమ్బిరానెమ్మాన్ నారాయణనాలే'** నాకు ఉపకారకుడు, స్వామియు నైన నారాయణునిచే అని, ఇంకను కొన్నిచోట్ల నారాయణత్వము ఉదహరింపబడినది.

మూడవ పత్తునందు **'వాణ్‌మలరామడిత్తాళై'** అప్పుడే వికసించిన పుష్పముల వలె నున్న శ్రీపాదములు అని, **'అంగతిరడియన్'**- సుందరమైన కాంతిగల



శ్రీపాదములు గలవాడని, **'మూవులగుమ్ తొళుదేత్తుమ్ శీరడియాన్'** ముల్లోకములు దండము సమర్పించి స్తోత్రము పాడునట్టి శ్రీపాదములు గలవాడనీ ఇంకను కొన్ని తావుల నారాయణుని యొక్క సర్వలోక శరణ్యభూత చరణారవిందద్వయము వర్ణింపబడినది.

నాల్గవ పత్తులో, **'ఇంగైనగర్ అమ్బెరియుమ్ తవర్'** లంకానగరమందు బాణవర్షము కురిపించినవాని అని, **'వల్‌వినైతీర్కుమ్ కణ్ణనై'** - తీవ్రపాపమును తొలగించునట్టి శ్రీకృష్ణుని అని, **'తొల్‌వినైతేర'** ఆగామి పాపములు పోవునట్లు చేయువాడని, **'వెయ్యనోయ్‌కళ్ ముళువతుమ్ వియన్ ఞాలత్తువీయ'** విశాలమైన భూమిపైనుండుక్లేశములన్నీ నశించునట్లు అని, **'మేవి నిన్రు తొళువార్ వినైపోక మేవుమ్'** స్థిరముగా నుండి దండము సమర్పించువారి పాపములు పోవునట్లు అని, **'పిరన్దుమ్ శెత్తుమ్ పెతైమై తీర్‌న్దొళున్దేన్'** జన్మమరణములతో అల్లరిపెట్టునట్టి అజ్ఞానమును పోగొట్టుకొంటిని అని, **'నోయే మూప్పిఱప్పిణియే ఎన్రివై యొళియ'** మనోవ్యాధి, వార్ధక్యము, జన్మము, మరణము, శరీరవ్యాధులను నశింపజేసి, దాసునితోడ్కొని పొమ్ము అని **'వేట్కై ఎల్లామ్ విడుత్తు కూట్టరియతిరువడిక్కళ్ కూట్టినై'** సంసారబంధమును విడిపించి, లభించుట కశక్యములైన నీ శ్రీపాదములందు జేర్చుకుంటివి అని, ఇంకను కొన్ని తావుల అనిష్టనివృత్తికిని, ఇష్టప్రాప్తికిని పట్టుకొమ్మ అగు ప్రాపకత్వము ప్రకటింప బడినది.

ఐదవ పత్తునందు, **'తమియేనుక్కరుళాయ్'** ఒంటరినయిన నన్ను దయజూడుమా అని, **'ఆఱెనక్కునిన్ పాతమే శరణాకత్తందొళిన్దాయ్'** నాకు నీ శ్రీపాదములను రక్షకముగా నిచ్చినావు అని, **'ఉన్నాలల్లాల్ యావరాలు మొన్రుమ్ కుఱై వేండేన్'** నీతో తప్ప నాకు వేరొక కావలసినదేమీ లేదు అని, **'కళల్ కళైవైయే శరణాకక్కొండు'** ఆ పూతన ప్రాణమును పీల్చినవాడగు శ్రీకృష్ణుని పాదములను ఉపాయముగా నిశ్చయించుకొని అని, **'నంబెరుమానడిమేల్ శేమంగొళ్ తెన్‌కురుకూరు శడ కోపన్'** శ్రియఃపతి పాదములనే రక్షకములుగా నమ్మిన శ్రీనమ్మాళ్వారులు అని, **'నాడొరుమేక శిందైయనాయ్'** నిత్యము పరమాత్మ విషయమైచింతగలవాడై అని మున్నగుచోట్ల ప్రార్థనా రూపమగు భక్తి వర్ణింపబడినది.

ఆరవపత్తునందు, **'తిరుమామకళిరుమ్ నామ్ మలినిరున్దు'** మహాలక్ష్మి తాను సమృద్ధితో నుందురు అని, **'అడిమై శెయ్‌వార్ తిరుమాలుక్కే'** శ్రియఃపతి కైంకర్యము చేయువారు అని, **'ఒశిన్దవొణ్ మలరాళ్ కొళునన్'** సంశ్లేషముచే వాడినటువంటి

పరిమళపుష్పవాసిని అయిన మా పిరాట్టికి వల్లభుడు అని, **'ఎన్దిరుమార్ మార్వక్కు'** శ్రీదేవిని వక్షస్థలమునందు కలిగినవానికి అని, **'కోల తిరుమామకళోడున్నై కూడాదే'** సుందరపిరాట్టితో గూడ నిన్ను పొందనేరక అని మున్నగుతావుల కైంకర్యప్రార్థన గావింపబడినది.

ఏడవ పత్తునందు, **'కన్న లేయముతే'** కలకండ వంటివాడా అని, **'కొడియేన్ పరుకిన్నముతే'** పాపినైన నాకు అమృతము వంటివాడా అని, **'అలైకడల్ కడన్ద వారముతే'** సంద్రమును మథించి పొందిన అమృతమువంటివాడా! అని **'తిరుమాలిక శీరిరప్పొతిర్ కాలం పరికిల్ మార్వనో'** శ్రియఃపతి కళ్యాణ శోభనే భవిష్యత్తులో కూడ అనుసంధించు కొని తృప్తి పొందెదను అని, **'ఏళులకై ఇన్బమ్ పయక్క'** సప్తలోకములకును సుఖము కలుగునట్లు అని మున్నగచోట్ల కైంకర్యమును స్వీకరించునట్టి సర్వేశ్వరుని భోగ్యత తెలుపబడినది.

ఎనిమిదివ పత్తునందు, **'అడియేన్ పెరియనమ్మాన్'** దాసుడు పొందినట్టి స్వామీ! అని **'విణ్ణవర్కోన్ నంగళ్ కోనె'** నిత్యసూరులకు స్వామి అయిన వాడే మనకూ స్వామి! అని, **'అమర్న్దనాయకనై'** అమరి ఉన్నట్టి స్వామి అని, **'మూవులకాళి'** త్రిలోక రక్షకుడు అని, **'నేర్పట్టనిరై మూవులగుక్కుమ్ నాయకన్'** ముల్లోకములకు ముఖ్యనాయకుడు అని - మున్నగు తావుల శ్రియఃపతి సర్వస్వామిత్వము నిరూపింపబడినది.

తొమ్మిదవ పత్తునందు, **'పండైనాళాలే నిన్దిరువరుళుమ్ పయంగత్తాళ్ తిరువరుళుమ్కొండు నిన్ కోయిల్ శీయ్త్తు'** చిరకాలముగా పిరాట్టి యొక్క, నీయొక్క అనుగ్రహమును కలవాడనైనీవు వేంచేసి ఉన్నట్టి దివ్యదేశమున కైంకర్యము సమర్పించుచు అని **'నిన్ తీర్త్తవడిమైకుత్తేవల్'** నీకు కైంకర్యమొనర్చునట్టి దాసుడను అని, **'తొడర్న్దు కుత్తేవల్ శెయ్దు'** నిన్ననుసరించి కైంకర్యమును జేసి అని, **'కొడువినైయేనుమ్, పిడిక్క'** ఘోరపాపములు నశించునట్లు అని, **'నానుమ్ ఈశావడిమై వణిశెయ్యపుకున్దేన్'** ఓ స్వామీ! నేను ఎడతెగకుండ దాస్యము చేయుటలో అన్వయించు కొనగలిగితిని అని మున్నగు తావుల నిత్యకైంకర్యము ప్రతిపాదింపబడినది.

పదవ పత్తులో **'తుయర్ కెడుమ్ కడితు'** మనదుఃఖమును నశింపజేయును అని, **'ఎళుమైయుమేతంశారా'** ఎన్నటికిని దుఃఖము సమీపించదు అని, **'ఇప్పిఱ పరుక్కుమ్'** ఈ జన్మములను రూపుమాపును అని, **'పిణి యొన్దుమ్ శారా'** కష్టమొక్కటియును సమీపించదు అని, **'పిరవిత్తుయర్ కడిన్దోమ్'** సంసారదుఃఖమును పోగొట్టుకొంటిమి అని, **'వెండే ఒళిన్ద వినైయాయిన వెల్లామ్'** శ్రియఃపతిని సేవించినప్పుడే



సకలదుఃఖములును విడిచిపోయినవి అని, **'అమరా వినైకళే'** భగవంతుని ఆశ్రయించు వారిని ప్రతిబంధకములు స్పృశింపవు అని **'పిరవికెడుత్తు'** పునర్జన్మము రాకుండచేసి అని, **'ఆవావత్తు వీడుపెత్తు'** ఆశతీరి మహదానందమగు పరమపదమును పొంది అని మున్నగు తావుల కైంకర్యవిరోధులను త్యజించుట ఉట్టంకిపబడినది. ఇట్లు శ్రియఃపతిత్వము మొదలుకొని కైంకర్యవిరోది నివృత్తి పర్యంతము ఉపాదేయములగు అర్థములకు తెలుపునట్టి మంతరత్నమును తిరువాయ్మొళియును యావజ్జీవము అనుసంధించవలసినవి అని శ్రీపిళ్ళైలోకాచార్యస్వామివారు తమ **'సారసంగ్రహము'** అను గ్రంథరాజమును సాయించిరి.

## రహస్యత్రయైక్యము :

తిరుమంత్రమున, చరమశ్లోకమున సంగ్రహముగ జెప్పబడిన అర్థములను ద్వయమంత్రము వివరించినట్లు, నమ్మాళ్వార్ అనుగ్రహించిన మొదటి మూడు ప్రబంధములందు సంగ్రహంగా తెలుపబడినట్టి అర్థపంచకమును వేదములలో చెప్పిన రీతిలో అన్వయరూపముగ స్వానుభవముచే **'ఉయర్వర ఉయర్నలమ్'** అను తిరువాయ్మొళిలో పరత్వమునందు పరత్వమును ప్రతిపాదించినారు. **'తిణ్ణన్ వీడుమ్'** అను తిరువాయ్మొళిలో, ఇతిహాసపురాణములలో చెప్పినట్లు అన్వయవ్యతిరేకముల రెండింటిచేతను పరులకు ఉపదేశించునట్లు అవతారమునందు పరత్వమును ప్రతిపాదించిరి. **'అణైవతరవణై'**లో మోక్షప్రదమగు పరత్వమును చెప్పిరి.

ఇంకను, **'ఒన్దుమ్ తేవుమ్'**తో వరుసగా వచ్చు నాలుగు తిరువాయ్మొళులలో అర్చావతారములోని పరత్వమును చెప్పి, పరస్వరూపము, భగవచ్ఛేషత్వము కంటె భాగవతశేషత్వమే ఆత్మకు భోగ్యమని, **'పయిలుం శుడరొళి'** అనుతిరువాయ్మొళిలో సాయించిరి. ఆపై **'ఏరాళు మిరైయోన్'** లో శేషత్వమే ఆత్మయొక్క స్వరూపమని చెప్పిరి. అట్టి ఆత్మ పరమాత్మకు శరీరభూతమైనదని, ప్రకృతికంటె విలక్షణమై జ్ఞానా నంద స్వరూపముగా నుండునని, **'కణ్గళ్ శివన్దుమ్'**లో వివరించిరి. **'కరుమాణిక్కమలై'**లో ఇతరులకు శేషభూతులము అను మాటే సహింపజాలని ఆ శేషత్వము అనన్యార్హ మగును అని నొక్కివక్కాణించిరి. ఇట్లు ఈ నాల్గు తిరువాయ్మొళులలో స్వస్వరూప మును తెలియజేసిరి.

**'వీడుమిన్ ముత్తవుమ్'** అను ప్రసిద్ధ తిరువాయ్మొళిలో భగవంతునికంటె ఇతరములను ఆశ్రయింపగోరు అహంకారమమకారములను తక్షణమే విడనాడ వలసినదని ప్రబోధించిరి. సేవింపకూడనివారి సేవ చేయుట తగదని, **'శొన్నార్**

**విరోతమ్**'లోను, ఐశ్వర్య, కైవల్యములు త్యాజ్యంబులని '**ఒరునాయకమ్**'లోను, శరీరసంబంధమును బట్టివచ్చు దాన ప్రతిగ్రహములు త్యాజ్యములు అని '**కొణ్డపెండీర్**' లోను - ఇట్లీ నాల్గు తిరువాయ్‌మొళులలో విరోధి స్వరూపమును పేర్కొనిరి.

'**నోత్తు నోన్బిలేన్**' అను తిరువాయ్‌మొళిలో, ఎటువంటి నోమును నోచుకొన కుండానే, అకించనుడైన నాకు నీ శ్రీపాదములను శరణముగా నొసంగినావని పొంగిపోవుదురు. రక్షించినను, రక్షించకపోయినను సరే నీకంటే వేఱొక్క గతి లేదని భగవంతుని శరణుజొచ్చిన వైనమును తెల్పు ప్రసిద్ధ '**ఆరావముతు**'లోను, '**వైకలుమ్ వినైయేన్ మెలియ**' అన్నట్లు భక్తిపారవశ్యముతో శ్రీనమ్మాళ్వారులు భగవంతుని శ్రీపాదములను శరణు జొచ్చినట్టి రీతిని '**మానేయ్ నోక్కు**' అను తిరువాయ్‌మొళి ఉగ్గడించును.

'**ఎనతావియై నిన్ఱు నిన్ఱురుక్కియుణ్డిట్ట**'లో నాకు ప్రాణభూతునిగా నా హృదయమున వేంచేసి ఉన్నట్టి వానిని ధ్యానించి, వాని గుణములను అనుసంధించు కొనువాడనై అని తెలుపునట్టి '**పిఅన్దనాఱు**' మున్నగు నీ నాలుగు తిరువాయ్‌మొళుల చేతను ఉపాయస్వరూపమును ప్రతిపాదించిరి.

'**తనక్కేయాక**' వాడు నన్ను గొనిపోవునది తన ఉపయోగమునకే అన్నట్లు కైంకర్యమునందు స్వప్రయోజనమెంత మాత్రము ఉండకూడదని జెప్పు '**ఎమ్మావీడుమ్**' అను తిరువాయ్‌మొళియు, సర్వకాల సర్వావస్థలందును సమస్త కైంకర్యములు చేయవలెననెడి ప్రార్థనను తెలుపు. '**ఒళివిళ్‌కాలమెల్లామ్**' అను తిరువాయ్‌మొళియు, అట్టి నిరతిశయ కైంకర్యమును భాగవతులవరకును అనుష్ఠింపవలెననెడి '**నెడుమాఱ్కడిమై**' అను తిరువాయ్‌మొళి ఆ కైంకర్యములోకూడ పరసమృద్ధియే ప్రధానంగా ఉండవలెనని తెలుపు, '**వేయ్ మరుతోళిణై**' అను ఈ నాలుగు తిరువాయ్‌మొళులలో ఫలస్వరూపమును ఆవిష్కరించిరి. ఈ ఇరవై తిరువాయ్ మొళులలోను చెప్పిన విషయమే తక్కిన ఎనభై తిరువాయ్‌మొళులలోను విస్తరించి నందువలన అర్థపంచకము కూడ ఈ తిరువాయ్‌మొళి ప్రబంధమునకు విషయమని స్పష్టమైనది.

'**మయర్వర మతినల మరుళినన్**' ఇంచుకైన ప్రమాదము లేని జ్ఞానానందము లను పొందితిని అని ఆరంభించి, '**అవావత్తు వీడుపెత్తు**' శ్రియఃపతినాశ్రయించి పరమపదమును పొందితిని అని సమాప్తి చేయుటచే వాటి అయిదింటిలో ప్రధానములైన ఉపాయ, ఉపేయములు రెండూ దీనిలో విశదీకరింపబడిన విషయములని



తెలియుచున్నది. '**తొళు తెళ్ళుమనవే**'- నాదీనమైన ఓ మనసా! '**విరుప్పే పెత్తుముత ముందు కళిత్తేన్**' పరమపదమును అమృతము వలె పొందితిని అని, '**మేలైత్తొండుకళిత్తని తొళుమ్ శొల్లు పెళిత్తే**' (తి.వా. 10-10-7) సంధ్యాసమయమున నమస్కారమని చెప్పగలిగితిని అని బద్ధాంజలి, సంతోషము, నమస్కారము, అను ముక్తలక్షణముల వల్లను, '**విపన్యవః**' అని శ్రుతిలో జెప్పినట్లు భగవంతుని స్తోత్రము చేయు నిత్యసూరుల వలెనే శ్రీశఠకోపులును '**శొల్పుణిశైయాయిరమ్**' అన్నట్లు స్తోత్రము చేసి వాచిక కైంకర్యము సమర్పించుట వల్లను, అర్థపంచకములో పైన జెప్పిన రెండింటిలోను ఉపేయమొక్కటే తిరువాయ్‌మొళిలో జెప్పబడినదని తెలియుచున్నది.

**అర్థపంచకము- తిరువాయ్‌మొళి :**

తిరువాయ్‌మొళిలో అయిదర్థములును వివరింపబడినవి అనుటకు కారణ మేమనగా - ఈ ప్రబంధములలోని శ్రీసూక్తులలో ప్రాప్యభూతుడగు శ్రియఃపతి స్వరూపమును ప్రతిపాదించునవి కొన్ని, ప్రాప్త అగు జీవాత్మ స్వరూపమును తెలుపునవి మఱికొన్ని, ప్రాప్త్యుపాయమును తెలుపునవి మరికొన్ని, ఫలమును తెలుపునవి మఱికొన్ని, ప్రాప్తివిరోధిని తెలుపునవి కొన్ని- ఇక తక్కినవన్నీ ఈ విషయములనే విశదీకరించును - అని భగవద్విషయ ఈడుముప్పత్తాఱాయిరప్పడి వ్యాఖ్యానములో సాయించిరి. అర్థపంచకములోని ఒక్కొక్కదాని ప్రాధాన్యమును నొక్కి వక్కాణించుటకే, ఒకమారు ఉపాయ ఉపేయములు రెండును ప్రధానములని తెలుపబడినది. మఱొక మారు, ఉపేయ మొక్కటే ప్రధానమని చెప్పబడినది. అంతిమ ఉద్దేశ్యము ఫలము. దీనికిగానే, తక్కిన నాల్గు అర్థములును తెలుపబడినవి. ఈడు ముప్పత్తాఱాయిర్పడిలో కైంకర్యమే ప్రధానంగా ఉట్టంకించబడినది. తక్కిన నాలుగు దీనికి శేషములే అని నిష్ఠగా అనుసంధించవలెను.

ఇక నమ్మాళ్వారుల ప్రథమ ప్రబంధమగు తిరువిరుత్తముయొక్క, చరమ ప్రబంధమగు తిరువాయ్‌మొళి యొక్క మొదటి పాశురముల సంగ్రహార్థములను తెలియపరచుచున్నారు. ఒక అక్షరమునకొక ప్రకృతియున్నట్లు, తిరుమంత్రమనెడి రహస్యము సంగ్రహమై, '**ఓమిత్యేకాక్షరం**' అన్నట్లు ఒకటే అక్షరమగు ప్రణవమును '**తస్య ప్రకృతిలీనస్య**' అన్నట్లు ఆ ప్రణవము యొక్క అర్థమును సంగ్రహముగా తెలుపు అకారము వలెనే, ఈ రెండు ప్రబంధములతొలి పాశురములందు, '**ఇమైయోర్ తలైవా!**' రెప్ప వాల్చక సేవించునట్టి నిత్యసూరులకు నిర్వాహకుడా! అని, '**అయర్వఱు**

**మరర్కళ్ అధిపతి'** అజ్ఞాన మెంతమాత్రము లేని నిత్యసూరులకధిపతి అని సాయించి సర్వాధికమగు పరస్వరూపమును అనుసంధించినారు.

**'అడియేన్'** - దాసుడను **'ఎన్మననే!'** నా మనసా! అని ఇట్లు శేషభూతమై, పరిశుద్ధాంతఃకరణము గలిగిన స్వస్వరూపమును, **'పొయ్నిన్ఱ జ్ఞానముమ్ పొల్లావళుక్కు మళుక్కుడమ్బుమ్'** దేహాత్మభిమానము, సాంసారికదుష్కర్మ ప్రవృత్తి, మురికి శరీరమును అని అవిద్యారూపమగు విరోధి స్వరూపమును **'ఉయరళిప్పానెన్నిన్ఱ యోనియుమాయ్ పిఱన్దాయ్'** ఈ ఆత్మలను కాపాడుటకై ఎన్నిఅవతారములనెత్తితివి అని **'మతినలమరుళినన్'** జ్ఞానానందమును కృపచేసినవాడు అని ఉపాయస్వరూపమును, **'శెయ్యుమ్ విణ్ణప్పమ్'** చేయునట్టి విన్నపము అని, **'తొళుతెళు'** దండము సమర్పించి స్తోత్రముచేసి అనియు సాయించినట్లు శేషియగు సర్వేశ్వరుని విషయమున త్రికరణములతో జేయు కైంకర్యమే పరమపురుషార్థమని ఫలస్వరూపమును సంగ్రహముగా అర్థపంచకమును జెప్పిరి. దీనితో బాటు అవిద్యాది స్వరూపస్వభావములు, ఆత్మపరమాత్మల సంబంధము, రక్షణక్రమమును, గుణవిగ్రహవిభూతి యోగమును, భాగవతాభిమానమును, అన్యాపదేశమునకు హేతువగు భక్తిమొదలగునవి దీనిలో నిమిడి యున్నవి. ఇంకను వేదాంత సంగ్రహ తాత్పర్యములగు అర్థములనేకములు ఈ తావున నిక్షిప్తమై యున్నవని గ్రహించవలెను.





## పదకొండవ అధ్యాయము

# పదిపత్తులు - పది అవతారములు

అవతారసామ్యము :

శ్రియఃపతి లోకసంరక్షణార్థము దశావతారములుగ అవతరించినట్లు తిరువాయ్మొళికూడ లోకహితార్థము పది పదులుగ అవతరించినది. **'ఒలిపుకళాయిరత్తి పత్తుళ్ళతైమాశరుక్కుమ్'** (తి.వా. 5-2-11) ప్రశస్త కీర్తిగల వెయ్యిపాశురములును మనస్సులోని దోషములను తొలగించును అని, **'తెరుళ్కొళ్ళ చ్చొన్నవోరాయిరమ్'** (తి.వా. 2-10-10) ఈ చేతనులకు తత్త్వజ్ఞానము కలుగునట్లు సాయించిన వెయ్యిపాశురములు అని, **'తూయ వాయిరత్తిప్పత్తాల్ పత్తరావర్'** - పావనమైన ఈ పది పాశురములు అభ్యసించునట్టివారు భక్తులగుదురు అని, **'అడిమై అరక్కొణ్డాయ్'**- సర్వేశ్వరుడు ఈ చేతనుని అనన్యార్హశేషభూతునిగా అంగీకరించినట్లు, **'ఉరియ తొండరాక్కు ములకముండాత్కే'** (తి.వా.6-9-11) జగద్రక్షకుడైన శ్రియఃపతికి అనన్యార్హశేషభూతులనుగా జేయును అని, శ్రీమన్నారాయణుడు సంసారమునకు ఔషధమువంటి వాడని చెప్పినట్లు, తిరువాయ్మొళి దివ్యప్రబంధము, **'ఉడైన్దు వారాయ్ కలై యోడి విక్కుమ్'** (తి.వా. 1-7-11) ఈ పది పాశురములు మహావ్యాధులను గూడ తునాతునకలు జేసి వేయును అని సాయించినట్లు సాంసారిక సకల దుఃఖములును ఈ దివ్యప్రబంధము రూపుమాసి పోవునట్లు చేయునని తెలియవలెను.

**'పత్తరుమ్ వైకున్దత్తై అరుళుమ్ నమక్కు'** స్తుతించుట కశక్యంబైనట్టి పరమ పదమును మనకు కృపచేయును అన్నట్లు స్వయత్నముచే సాధించుట కశక్యంబైనట్టి పరమపదమును శ్రియఃపతి అనుగ్రహించు రీతిని, ఈ ప్రబంధము కూడ **'వానిన్ మీతేత్తి యరుళ్ శెయ్తు'** పరమపదమును పొందించునట్టి కృపను పెంపొందిచును. **'తన్ తాళిన్ కీళ్శేర్త్తి'** తన శ్రీపాదములక్రింద చేర్చుకొనును అన్నట్లు శ్రియఃపతి వలెనే ఈ దివ్యప్రబంధము, **'అరుళి అడక్కీళిరుత్తుమ్'** కృపతో శ్రీపాదములక్రిందకు గొనిపోవును. **'ఇన్బక్కతి శెయ్యుమ్'** (తి.వా. 7-5-11) ఆనంద రూపమోక్షమును కలుగజేయును అన్నట్లు శ్రియఃపతి వలె ఈ ప్రబంధము **'ఎంగనే శొల్లిలు మిన్బమ్ పయక్కుమ్'** ఏవిధమున అనుసంధించుకొనినను మోక్షమునందించును.

**'ఊడుపుక్కెన తావియై యురుక్కి యుండెడు కిన్ఱ నిన్ఱన్నై'** (తి.వా. 5-10-10) లోపల ప్రవేశించి నాఆత్మను కరిగించి చంపుచున్న శ్రియఃపతి వలె, ఈ ప్రబంధము

కూడ **'ఒన్బతోడొన్నుక్కు మూవులకు మురుకుమ్'** (తి.వా. 9-5-11) ఈ తిరువాయ్ మొళిలో సాయించిన ఒక పాశురమును, తరువాత తొమ్మిది పాశురములను అనుసంధించినచో ప్రేమచే మనస్సు కరిగి పోవును. ఇట్లు ఈ దివ్యప్రబంధము సర్వేశ్వరునితో సమానమైనది అయినందువలన, ఆయన పది అవతారములవలెనే ఇది పదిపత్తులలో అవతరించినదని తెలియవలెను.

మరొక ముఖ్యవిషయమును మనము గుర్తింపవలసి ఉన్నది. తిరువాయ్మొళి ప్రతిపత్తునందు ఒక్కొక్క తిరువాయ్మొళి ప్రధానమై, ఆయాపత్తులకు ఆయా తిరువాయ్మొళులందు లక్ష్యముండును. ప్రతి పాశురమునకు కడపటనుండు క్రియాపదము ముఖ్యమైనట్లు, ఒక్కొక్క తిరువాయ్మొళికిని పరత్వము, భజనీయత, సౌలభ్యము, అపరాధ సహత్వము మున్నగునవి ప్రత్యేక, ప్రత్యేకముగా నున్నందువలన, నూఱు పాశురములలో పరోపదేశ పాశురములైన పది ప్రధానములగును. నమ్మాళ్వారులు రసజ్ఞులైన భాగవతుల గోష్ఠిని ఆశింపక, అందుబాటులో నున్నట్టి సంసారుల యోగ్యతాదికారములను గమనింపక, వారిని భగవద్గుణానుభవమునందు రుచిగలవారినిగా దిద్దుబాటు జేయుటకే కృషి జేసిరి. ఇది వారి ఔన్నత్యము, సౌలభ్యము. గాన ప్రతిపత్తునందు తెలుపబడిన అర్థములు పరోపదేశమున కనుకూలములుగా ప్రస్తావించి, సమన్వయించుటకై సర్వేశ్వరుడు తనకు గలుగజేసిన వివిధదశలను ప్రతి పత్తునందు వర్ణించినారు.

సర్వస్మాత్పరుడు సర్వకారణభూతుడై లోకముననుండి కార్యకారణ పదార్థముల వలె గాక, ఉపాదాన కారణముగూడ తానే అగును. గాన కార్యభూతములగు సమస్త పదార్థముల లోను వ్యాపించి ఉండును. అట్లు వ్యాపించుట ఆకాశమువలెగాక అంతరాత్మగా వ్యాపించి ఉండును. సర్వనియంత ఐనను పరమకారుణికుడై సర్వశరణ్యుడగును. శరణ్య కృత్యములగు అనిష్టనివృత్తి ఇష్టప్రాప్తులను సర్వశక్తులతో అనుగ్రహించును. నిత్యులతో, పత్నీపరిజనముచే కూడి సర్వకాముడై భోగాదులనను భవించును. అట్లని, ఆ భోగములలో మైమరచి యుండక ప్రళయాది విపత్తులు సంభవించినపుడు, ఆపత్సఖుడై లీలావిభూతిని గాపాడును. సంసారతాపత్రయ పీడితులగు ఆశ్రితుల కష్టములను పోగొట్టి ప్రపన్నార్తి హరుడగును.

ఈ విధముగ, పదిపత్తులలో నిరూపింపబడిన పది గుణములతో కూడి యుండు సర్వేశ్వరుడు 'మయర్వఱ మతినల మరుళినన్, అని, భక్తిరూపాపన్న జ్ఞానమునొసంగి, అజ్ఞానమును నిశ్శేషముగా బోగొట్టును. అట్టి జ్ఞానఫలమగు మోక్షమును, **'విన్**



**శెమ్మాపాత పఱ్ఱుత్తలై శేర్తు'** నీ ఎఱ్ఱని పాదపద్మములలో జేర్చుకొని అన్నట్లు స్వరూపానురూపముగ నిష్కర్షించి, ఆమోక్షఫలమగు కైంకర్యవృత్తిని, **'వళువిలావడిమై శెయ్యవేణ్డుమ్'** అని ప్రార్థింతురు. పరమపురుషార్థము తప్ప తక్కినవాటియెడల విరక్తికి అనుకూలమగు భగవద్విషయ ప్రీతి అతిశయించి, ఆలస్యమును సహింపజాలక, త్వరకలిగి, **'అలర్మంగై యుఱైమార్బా! ఉన్నడికీళ్ అమర్న్దు పుకున్దేన్'** లక్ష్మీదేవిని వక్షస్థలమున గల శ్రీమన్నారాయణా! నీ పాదములను శరణుజొచ్చినాడను' అని ఉపాయమును వరించి, దానివలన కలుగు ఉపకారమునకు ప్రత్యుపకారముగా ఆత్మసమర్పణము చేయదలతురు. అయితే, తన ఆత్మకూడ భగవంతునిదే అని జ్ఞాపకము (జ్ఞానము) కలుగగా, **'అతువు మత్తాజ్ఞనట్టన్నతు ఎతువు మొన్టు మిల్లై చ్చెయ్వతిజ్ఞుమంగే'** అయ్యో! ఆ ఆత్మ కూడ నాది కాదే! ఈలోకమున, పరలోకమున నేను చేయదగినట్టి ప్రత్యుపకారమేదీ లేదే! అని తొట్రుపడిరి. తరువాత స్వామి భుజములను చక్కగా కౌగిలించుకొని ప్రీతి పరశవమున ఆత్మవస్తువును సమర్పించిరి.

అంతటా వ్యాపించి యున్నవాడును, అద్వితీయమైనవాడును, నా ఆత్మను శరీరముగా గలవాడును, తనకు దాసుడు శేషభూతుడు అను జ్ఞానమును కలుగజేసిన వాడును అయిన శ్రియఃపతిని తెలిసికొంటిని అనిరి. అటువంటి ఆత్మ జ్ఞానఫలమగు భగవత్ప్రాప్తిని **'మరణమానాల్ వైకుందమ్ తరుమ్'**మృతినొందినప్పుడు వైకుంఠము లభింపజేయును. శరీరావసానమందు శ్రియఃపతి ఏర్పాటుచేసి, గొనిపోయి అర్చిరాది మార్గమున పరమపదమున చేర్చునుగదా- అని ఆళ్వారుల విశ్వాసము. ఆవిధముగ, పరమాప్తుడగు సర్వేశ్వరునే రక్షకముగా ప్రార్థించి, తాములభించిన ఫలమును ఇతరులు కూడ పొంది తన వలెనే సుఖపడవలెనను ఉద్దేశ్యోపపాదనముతో పదిపత్తులలోను వాక్యార్థమును అనుగ్రహించిరి.

మొదటి పత్తులో, సర్వేశ్వరుడు తన నిర్హేతుక కృప వలన అజ్ఞానమును పోగొట్టి భక్తిరూపాపన్న జ్ఞానము నొసగిరి. ఆపై వీరు తనను మరచిపోవుదురని తలచి వీరిపై ప్రీతితో విడనాడి వీరి హృదయమునందే సర్వదా వసించి యుండగా, దానిచే సంశయ, విపర్యయ, విస్మృతి రహితమైన జ్ఞానమును శ్రీనమ్మాళ్వారులు కలిగి యుండిరి. అయితే తానే ఆ గుణానుభవముచేయక, సంసారుల వైపు చూచి, వారి సంసారమున గల త్యాజ్యములైన దోషములను విడువజేసి, ఉపాదేయములైన భగవద్గుణములను భగవంతుని ఆశ్రయించు విధమును, ఆశ్రయించుటకనుకూలమగు మంత్రమును ఉపదేశించిరి. ఆశ్రయణీయుడగు శ్రియఃపతి సౌలభ్యము, అపరాధ సహత్వము,

శీలవత్త్వము, ఆర్జవము, మున్నగు కల్యాణగుణములను జూపి పరభక్తి గల వారికిని, పరిగణన (స్వామి ఒక్కడే ఉన్నాడను ఆస్తిక్యము) గలవారికిని సమానముగా సేవ సాయించు సమబుద్ధి నెరింగించి వాని నాశ్రయించుటలో గల సుకరత్వము, రస్యత, ఆశ్రయించుట తోడనే అన్ని ఫలములును ఘటిల్లువిషయము, ఆశ్రయించుట నారంభించినప్పుడే ఆశ్రయణ విరోధులన్ని తొలగి పోవునను విషయము తెలిపి, అటుభక్తి యోగమునవలంబించి దేవతాంతరములపట్ల పరత్వబుద్ధిని విడనాడి, శ్రియః పతిని ఆశ్రయింపుడని శ్రీనమ్మాళ్వారులు ఉద్బోధించిరి.

దీనితో 'ఆచార్యహృదయము' గ్రంథములోని తృతీయ ప్రకరణము సుసంపన్నమైనది. ఇక చతుర్థప్రకరణమును అధ్యయనం చేద్దాము.





# పన్నెండవ అధ్యాయము
# మొదటి, రెండవ పత్తుల సారాంశము

శ్రీపిళ్ళైలోకాచార్యుల వారి తిరుత్తమ్ములు అళకియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ వారి ప్రణీతమై, పెరియ జీయర్, విశదవాక్ శిఖామణి శ్రీమణవాళ మహామునులవారి విశిష్టవ్యాఖ్యాన సహితమైన 'ఆచార్యహృదయము' గ్రంథమున ఇంతవరకు మూడు ప్రకరణములను, అధ్యయనం చేసినాము. ఇపుడు ఈ గ్రంథమున చివరి ప్రకరణమును అధికరింప ప్రయత్నించెదము. ఈ నాల్గవ ప్రకరణములో తిరువాయ్‌మొళిలోని ఒక్కొక్క పత్తు సారాంశమును గ్రహింతుము.

**మొదటిపత్తు సారాంశము :**

**'పరపరనాయ్ నిన్తవళ్‌వేళ్ నైప్పా మననవై యుళుమ్బుర్ వానవరతిపతి'** అనగా, **'పరన్ ముతలాయవై ముళుతుణ్డ పరపరన్'** (తి.వా. 1-1-8) సకల వస్తువులకును శ్రేష్ఠమైన కారణమై ఆ వస్తువులను ప్రళయకాలమునందు తనలో నుంచుకొనినట్టి శ్రియఃపతి అని, **'ఆయ్‌నిన్ఱ పరన్'** సమస్త పదార్థములను తనకు శరీరముగ గలిగిన సర్వేశ్వరుడు అని మున్నగు తావుల ఇంత మాత్రమని చెప్పుటకు శక్యముగానట్టి మహిమ గల స్వామి ఆళ్వారుల మనస్సులో ప్రవేశించి **'శార్న్ద ఇరువల్ వినైకళుమ్ శరిత్తు మాయప్పత్తిరుత్తు తీర్న్దు తన్బాల్ మనమ్ వైక్క త్తిరుత్తి'** నాతో జేరిన పుణ్యాపాపములనెడి రెండు విధములైన క్రూరకర్మలను పోగొట్టి అజ్ఞానము చేగలిగిన సంసారబంధమును ఛేదించి, కృతకృత్యుడై తనపై మనస్సును లగ్నము చేయుటకు దిద్దుబాటు చేసిరి. అయినా ఆళ్వారులు తమ అయోగ్యతను తలచుకొని, వెనుదీయు నప్పుడు కూడ తన సౌందర్యమును, ప్రేమను జూపి, వీరిని మరలా తన వేపునకు త్రిప్పుకొని, బీడుగా పడి ఉన్నట్టి భూమిని సేద్యమునకు యోగ్యమైనది జేయువారి వలె వీరిని తన సుందరనేత్రముల తోకటాక్షించి సంస్కరించిరి.

అపుడు నమ్మాళ్వారులు, **'నెంజమే నల్లై నల్లై'** - మంచిది మంచిది! ఓ మనసా! లక్ష్మీపతి అగు స్వామిని నేను ఎడబాసినను, నీవు యెడబాయక అనువర్తింపుము అని మన మిరువురము స్వామికి దాసులమై మన అయోగ్యతలను తలచుకొని వెనుదీయక స్థిరముగా నుంటే మన అనాదికాలార్జితమైనట్టి కర్మను, విషయ లంపటమును, ప్రయోజనాంతర శ్రద్ధయును, సాధనాంతర సంగమమును మున్నగు దురితములలో నొక్కటి నిన్ని చేరనీయడు. ఓ నా మనసా! పరమార్థమును తెలుసు

కొనుము అని తన మనస్సుకు బోధించినారు. అంతేకాదు **'ఏకః స్వాదు న భుంజీత'** అన్నట్లు భగవత్ కటాక్షమును ఒంటరిగా ననుభవింపక పరుల కష్టములు జూచి సహింపజాలక కృపతో **'వీడుమిన్ ముత్తవుమ్'** అన్నింటిని వదలుడు' అని సంసారులకు బోధించిరి.

**'నీర్, నుమ తెన్నివై వేర్ ముతల్ మాయ్‌త్తు'** - మీరు, మీది అను అహంకార, మమకారములను వ్రేళ్ళతో గూడ పెకలించి వేయండి! అని, దోషములను విడువ వలసిన విధమును తెలిపిరి. 'నేను, నాది' అను పలుకుట కూడ తగదని, ఆళ్వారులు 'మీరు మీది' అనిరని పెద్దల శ్రీసూక్తి. **'వీడుడైయాన్'** పరమపదముగల వాడు అనుచోట ఉపాదేయమగు భగవత్స్వరూపమును, **'ఎల్లైయిలన్నలమ్'** అపరిచ్ఛిన్న ఆనందము గలవాడు అను తావున స్వామి గుణమును చెప్పి **'వీడిశైమిన్'** అట్టి బ్రహ్మానంద సంధాయకునికి మీ ఆత్మలను సమర్పింపుడు అని ఉద్బోధించిరి.

ఇంకను, శ్రియఃపతి శ్రీపాదములందు చేతనుని ఆత్మను సమర్పించునట్టి క్రమమును, **'వణ్‌పుకళ్ నారణన్'** నిత్యములైన కల్యాణగుణములుగల నారాయణుని అనుతావున అట్టి ఆత్మ సమర్పణమునకు ఆశ్రయమైనట్టి తిరుమంత్రముతో గూడ ఉపదేశించిరి. ఆశ్రయించునప్పుడు సులభుడై, అపరాధములు కనిపించిన తోడనే విడనాడక, **'ఎన్ పిళైత్తాళ్ తిరువడియిన్ తకవినక్కు'** స్వామి అగు మీయెడల ఏమి తప్పుజేసితిని అని అడుగదగినట్లు అపరాధములను సహించువాడై, వారితో కలిసి మెలసి ఉండును. వారిని తన ఇష్టప్రకారము ప్రవర్తింపజేసికొను తలపులేక, పల్లమున నుండు నీటిని ప్రయత్నముతో మెరకకు పారుదల చేయువారివలెనే, వారుండునట్టి స్థితికి సరియగునట్లు అందుకు అనుకూలముగా నియమించుకొని, తనను అనుభవింపజేసుకుందురు. ఓహో! ఏమి సౌలభ్యము! ఏమి సౌశీల్యము! ఏమి వాత్సల్యము! గోష్పాదమంత చోటులో సముద్రమును ఇమిడ్చినట్లు అసాధ్యముగా ప్రవర్తించునా? అని అనుకొనక ఉండునట్లు, **'ఎన్నుడై చ్చూళలుళాన్'** నారెండు వైపుల నున్నాడు అని ఆరంభించి, **'ఉచ్చి యుళానే'** శ్రియఃపతి నా శిరస్సు నందున్నాడు అని తాను సహించునట్ల తనను అనుభవింపజేయుదురు. భక్తితో ఆశ్రయించిన యెడల నా స్వామి నా నేత్రములలో నిలుచును. ఆయనను తలచుకొన్నను వచ్చును.

పరభక్తికి పరిగణనకు సమానముగా వచ్చి సేవ సాయించువానిని ఆశ్రయించుట సులభమైనదిగా, భోగ్యమైనదిగా ఉండగలదు. **'అముతిలుమాత్తవినియన్'** స్వామి అమృతముకంటె మిక్కిలి ప్రియమైనవాడు. ఆయను ఆశ్రయించుట వలన ఫలము



సిద్ధించుట ఎట్లనగా- 'మోక్షమార్గము కాటంకముగా నిలిచిన క్రూరపాపములను పోగొట్టి నాశములేనట్టి మోక్ష సంపత్తు నిచ్చును! **'అవనై త్తొళుతాల్ వళినిన్ఱ వన్ వినైయాళ్ విత్తళువిన్ఱియాక్కమ్ తరుమ్'** (తి.వా.1-6-8).

అయితే, శ్రియఃపతి నాశ్రయించు ఉపాయమేది? అనగా భక్తిమార్గమున స్థిరముగా నుండుటే. అట్లు నిలకడగా నుండిన, దేవతాంతర విషయములపట్ల గల సంశయములను ఆతడే పోగొట్టును. వైదిక సిద్ధాంతమునకు, వేదబాహ్యములగు షణ్మతములకు ఉన్న విరోధము పోవునట్లు, వేదమార్గమును యథార్థరీతిని నిరూపించి సాయించినట్టి నిరవధిక వాత్సల్యయుక్తుడు, జ్ఞానాది గుణపరిపూర్ణుడైన శ్రీకృష్ణుడు, రథమునందు ఆసీనుడై అర్జుననకుపదేశించుట అనెడు వ్యాజముతో శ్రీభగవద్గీత ద్వారా, **'భక్త్యాత్వనన్యయా శక్యః', 'మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు'** అను తావుల సాయించినట్టి భక్తిమార్గము నందుండి, **'నుమ్మిరుపశై యఱుత్తు'** (తి.వా. 1-3-7) **'మననక మల మఱక్కళువి'** మనస్సు నందు సంశయములను, విరోధులను పోగొట్టును. శ్రియఃపతినాశ్రయించినప్పుడే **'ఉద్యోగత్తై వినైకళుమ్ మాళుమ్'** అనగా **'నాళుమ్ నిన్ఱడునమపళమై యమ్ కొడు వినైయుడనే మాళుమ్'** (తి.వా.1-3-8) ప్రతి దినము విడువకుండ నిలిచి, బాధించుచున్న మనయొక్క అనాదియైన అత్యంతక్రూర పాపములు స్వామిని ఆశ్రయించుట కారంభించిన తోడనే మన ఆత్మను వీడి నశించును.

అయితే, మనము చేయవలసినదేమి? **'అవనుడై యుణర్వు కొండు'** వాని విషయమగు జ్ఞానమును గొని, అనగా వానిని బాగుగా తెలిసికొని, **'నన్ఱైన నలంశెయ్‌వతు'** ఫలాపేక్ష లేకుండ వానివిషయమున భక్తిగల వారము గావలెను. శ్రియః పతి ఆళ్వారులకు ఇంచుకైనను అజ్ఞానము లేనట్టి భక్తిని కృపచేసినట్లుగనే, ఆళ్వారులు కూడ సంసారిచేతనులను అట్టి అనన్యభక్తి యందు ఆసక్తిగల వారుగా కృపచేయు చున్నారు. ఇదే తిరువాయ్‌మొళి ప్రథమపత్తు సారాంశము.

**రెండవపత్తు సారాంశము :**

భగవత్ కృపచే జ్ఞానసంపన్నులైన నమ్మాళ్వారులు, ఆ జ్ఞానమునకు ఫలమగు మోక్షమును వెంటనే లభించవలెనని ఆశపడిరి. ఆ ఆశ తీరక చింతాక్రాంతులు కాగా, ఆ శ్రియఃపతియే వెడలివచ్చి, వీరి దుఃఖమంతయు దూరమగునట్లు వీరిని ఆలింగనము చేసికొనిరి. ఆ విధముగా ఆళ్వారులపై చూపిన ప్రీతిని వీరితో పరంపరాను గతముగ సంబంధముగలవారందరి వరకును వ్యాపించుటన్లు చేసిరి. అటువంటి

ప్రీతి చేతనే వీరికి మోక్షమును కృపసేయువాని శేషిత్వమునకు, తమయొక్క శేషత్వమునకును అనుగుణమైన స్వామి పరత్వ లక్షణములను, వానికి సంబంధించిన శ్రీసూక్తులను ప్రత్యక్షాది ప్రమాణములతో సాయించిరి. ఆశ్రయించునట్టి వారికి రుచి పుట్టుటకు గాను త్యాజ్యమగు సంసారమున గల దుఃఖమును, ప్రాప్యమగు మోక్షమున గల ఆనందమును సంసారనివృత్తికి సాధనములను, అనుష్ఠానములను ప్రధానమగు సగుణబ్రహ్మోపాసనమును, క్షేత్రవాసాదులను తెలిపినారు.

**'శోరాత వెప్పొరుట్కు మాతియాన్‌శోతి'** లోటు లేనటుల పరంజ్యోతి స్వరూపుడైన పరమాత్మ లీలావిభూతి విషయమున సంకల్ప విశిష్టమగు స్వరూపముతో నిమిత్త కారణమై, సూక్ష్మచిద్విశిష్టమగు స్వరూపముతో ఉపాదానకారణమై, జ్ఞానశక్త్యాది విశిష్టమగు స్వరూపముతో సహకారి కారణమగుచున్నాడు. ఇక నిత్యవిభూతి విషయమున, ఇచ్ఛావిశిష్టమగు స్వరూపముతో ఉపాదాన కారణమై, వినియోగోపయోగి జ్ఞానాది విశిష్టమగు స్వరూపముతో సహకారికారణమును అగుచున్నాడు. ఈ విధముగ శ్రియఃపతి బద్ధ, ముక్త, నిత్యస్వరూపముగా నుండు చేతన త్రయమునకును, ప్రాకృత, అప్రాకృత కాలరూపమగు అచేతన త్రయమునకును త్రివిధకారణమును అగుచున్నాడు.

**'అఱియాతన వఱి విత్త'** తెలియని వాటిని తెలిపినవాడు, అన్నట్లు ఆశ్రియః పతి నమ్మాళ్వారులకు తత్త్వ, హిత, పురుషార్థములను విశదము చేయగా, **'అడిమైయుడైన్దుళ్ళం తేఱి'** -మనసుతేట పడి కైంకర్యమునవలంబించిరి. పరిశుద్ధ అంతఃకరణము గలవారై అన్యవిషయములపట్ల సంతోషమును, దుఃఖమును విడిచి, జన్మ, వ్యాధి, ముదిమి, మరణముల వదలి ప్రకాశించు తేజోరూపమైన దివ్యశరీరములు గలవారైన నిత్యసూరుల గోష్ఠిలో జేరుట ఎన్నటికో గదా అనుకొని, అట్టి సాయుజ్య మోక్షమును పొందవలెనని ఆశపడి వెంటనే అది లభింపనందున, **'వాడి వాడుమ్'** పాదునుండి పెరికివేసిన తీగెవలె వాడిపోయిరి. అపుడు స్వామి నిత్యసూరుల యెడల తాము జూపు ప్రీతిని శఠకోపుల ఒక్కరియందే జూపి, ఆలింగనము జేసికొనిరి. అంతేనా! ఏడేడు జన్మల నుండి వీరితో సంబంధముగల వారిని కూడ తమ భక్తులను గావించి, సుఖపెట్టిరి. ఈ గొప్ప అతిశయము లభించి, శ్రీవైష్ణవ సంపత్తు వృద్ధి పొందుచున్నదే అని ఆళ్వారులు ఆశ్చర్యానందములను ప్రకటించిరి.

**'నీన్దుమ్ తుయరిల్లా వీడు'**, **'కెడలిల్ వీడు'**, **'ఎమ్మావీడు'** అను తావుల సాయించినట్టి గంధరహితమై, అనర్థమెంత మాత్రము లేనిదై, అన్ని విధముల



విలక్షణమైన మోక్షమును నాకు కృప చేసినట్లయితే - ఆ మోక్షము అహంకార గర్భితమైనందున, ఐశ్వర్యాదుల వలె, స్వరూపవిరుద్ధమైనందున, దాని మాటకూడ నా కసహ్యమే అనుచున్నారు. అయితే, నా స్వామీ! నాకు మోక్ష మీయవలెనని మీరు సంకల్పించినచో, **'నిన్ శెమ్మాపాత ప్పఴుప్పుత్తలై శేర్త్తాల్లై అమ్మా నడియేన్ వేణ్డువతీతే'** (తి.వా.2-9-1) - నీ ఎఱ్ఱని శ్రేష్ఠమైన తామర పుష్పములవంటి శ్రీపాదములను నాశిరస్సుపై శీఘ్రముగా నుంచుడు. ఇదే ఈ దాసుని ప్రార్థన. **'తనక్కే యాక వెనై కొళ్ళుమీతే'** నీ కైంకర్యమునకే గదా స్వామీ! పరమపదమునకు నన్ను తోడ్కొని పోవునది! అని జీవాత్మ, పరమాత్మ ఉభయుల స్వరూపముల నిలబెట్టునది గదా! ఆళ్వారుల ప్రార్థన.

**'తేవు మెల్లా ప్పొరుళుమ్ కరుత్తిల్ వరుత్తిత్త మాయ పిరాన్'** (తి.వా. 2-2-3) సంకల్పము చే దేవతలను, తక్కిన సమస్త వస్తువులను, సృజించినట్టి ఆశ్చర్యశక్తి గల శ్రియఃపతిని, ఆయన సర్వకారణత్వమును, **'శోపాలకోళరి యేఱు'** గోపాలకులకు బలముగల సింహము వలెనున్న శ్రీకృష్ణుడు అనుచోట అవతార సౌలభ్యమును, అఘటిత ఘటనా సామర్థ్యమును, శేషశాయిత్వమును, శ్రియఃపతిత్వమును పై **'తిణ్ణన్ వీడు'** అను తిరువాయ్‌మొళిలో నిరూపించినారు. **'ఇరువరవర్ ముతలుమ్‌తానే'** బ్రహ్మ, రుద్రుల కిరువురకు తానే స్వయముగ కారణము, అని సర్వకారణత్వమును, **'వీడు ముతలామ్'** మోక్షమునకు హేతువై ఉండును అని సకల ఫలప్రదత్వమును, **'పిఱవిక్కడల్ నీన్దువార్క్కు పుణైవన్'** శ్రీగజేంద్రాళ్వానుల దుఃఖమును పోగొట్టినవాడు అని ఆపత్సఖత్వమును, ఈ **'అణైవతరవణై'** అను తిరువాయ్‌మొళియందు తెలియజేసిరి.

ఇంకను, **'కళ్వా'**, **'తీర్తన్'** అను పాశురములందు వచనప్రత్యక్షములచే స్వామి కాన్పించిరి. ఎట్లనగా, 'మాకు కారణభూతుడవగు శేషివి నీవే' అని గరుడ వాహనుడై సాక్షాత్కరించిన శ్రియఃపతిని దేవతాంతరులలో నగ్రేసరులగు బ్రహ్మరుద్రాదులే పాదనమస్కారముచేసి ప్రకటించిరి. అర్జునుడుకూడ శ్రీకృష్ణుని పాదములపై పుష్పములనుంచి, ఆయన పరత్వమును ఔదలదాల్చెను.

**'పులనైన్దు'** అను పాశురమున భగవంతుని ఆశ్రయింపగోరువారు ప్రాకృత విషయములను విడనాడవలెనను కోరికను, ప్రాప్యవిషయమున ప్రావణ్యమును, సాధన ప్రావణ్యమును, రుచియు వృద్ధిపొందునట్లు శబ్దాదివిషయము లనుభవించునట్టి పంచేంద్రియములను వశపరచుకొని, సంసారదుఃఖమును పోగొట్టుకొని, ఆనంద మతిశయించియుండు పరమపదమున ప్రవేశించుడు- **'నల మన్ద మిల్లతోర్ నాడు**

**పుకువీర్'** అని ఆళ్వారులుద్బోధించినారు. సంసారనివృత్తి పూర్వకమగు మోక్షప్రాప్తిని కోరువారు అసురవర్గము తొట్రుపడి నశించి పోవునట్లు చేసిన వాడగుటచే, ప్రబలమగు ప్రతిబంధకములను అనాయాసముగ తొలగించు సామర్థ్యము గల శ్రియఃపతి కల్యాణగుణోపాసనమును విధించుచున్నారు. **('తస్మిన్ యదన్త స్తదుపాసితవ్యమ్'.)**

ఇంకను, భగవదుపాసనాంగములను తెలుపుచున్నారు. **'తిరముడై వలత్తార్ తీవినై పెరుక్కి'** (2-10-5) సమూహబలముచేత పాపములను వృద్ధిపరచకుము. **'వల్వినై మూళ్కి'** తుచ్ఛవిషయములనాశింపకుము. **'శూదెన్ఱు కళవుమ్ శూడుమ్ శెయ్యాతు'** దొంగిలింపకుము, జూదమాడకుము. బాల్యమునుండియే ధర్మమాచరించి ఉత్తరోత్తర లోకోత్తర శ్రేయస్సుకై పాటుపడుడు. తిరుమాలిరుంశోలై వంటి దివ్యదేశముల నాశ్రయింపుడు. అదే పురుషార్థము. ఆ దివ్యదేశములను స్తుతింపుడు. దివ్యదేశవాసము పురుషార్థసాధకము.

**'తొళక్కరుతువతే'** -దివ్యదేశములకు దండము సమర్పింపుడు. **'వలమ్ శెయ్తు నాళుమ్ మరువుతల్ వణక్కే'** - దివ్యదేశమున ప్రతిదినము ప్రదక్షణము చేయుటే పురుషార్థము. **'నెఱిపడవతువే నినైవతు నలమే'** - ఆ దేవయాన (అర్చిరాది) మార్గమునే విడువక చింతించుట పురుషార్థము. భగవదుపాసనను, ఈ ఉపాసనాంగములతో జేర్చి, బ్రహ్మస్వరూపాంతర్గత అపహత పాప్మత్వాది కల్యాణగుణోపాసనమును ఈ రెండవ పత్తునందు నమ్మాళ్వారులు అనుగ్రహించినారు.





## పదమూడవ అధ్యాయము

# మూడవ - నాల్గవ పత్తుల సారాంశము

శ్రియఃపతి మోక్షమునకు ఫలముగా ఆళ్వారులకు స్వదివ్యమంగళ విగ్రహాను భవమును అనుగ్రహించిరి. అట్టి దివ్యానుభవమువలన కలిగిన ప్రీత్యతిశయమువలన స్వామికి సమస్త కైంకర్యములును చేయవలెనను అభినివేశము గలవారై, ప్రేమ శ్రియః పతివరకే గాక, భాగవత శేషత్వము వరకు అన్వయించిరి. ఇంకను, నిత్యసూరులచే పరమపదమున సేవింపబడు శ్రియఃపతిని మనము పొందగలమా? అని భయపడి వెనుదీయకుండ, అవతార సౌలభ్యము పరత్వము వంటిదిగా తెలియవచ్చునట్లు అర్చావతారమునగల సౌలభ్యమును ఉపదేశించి సకల ఫలప్రదుండైన శ్రీమన్నారాయ ణుని స్తుతిరూపముగ వాచిక కైంకర్యమున ప్రవేశించుడని హితవు పలుకుచున్నారు.

**'ఏళ్చ్చి క్కేడిన్ఱి ఎంగణుమ్ నిఱైన్ద వెన్దాయ్'** (తి.వా. 3-2-4) వృద్ధిక్షయములు లేనివాడవై అంతటా వ్యాపించి యున్నట్టి ఓ స్వామీ! అని, **'ఆశవుడై యైమ్బులన్కళ్ అఱియా వకైయా లరు వాకి నిఱ్కుమ్'** - మితములైన విషయములను గ్రహించెడి పంచేంద్రియములకును తెలియకుండునట్లు సూక్ష్మముగా నుండువాడు అని, **'యావైయుమ్ యవరుమ్ తానాయవరవర్ శమయందోరుమ్ తోయ్విలన్'** (తి.వా. 3-4-10) సకల చేతనాచేతనములకు తాను అంతరాత్మయై ఉండువాడును, ఆదేవ, మనుష్యాదుల సుఖదుఃఖాలతో ఎట్టి సంబంధము లేనివాడును అని, **'అనశ్నన్యోఽభిచాక శీతి'** - వేఱొకడు కర్మఫలములను అనుభవింపక సాక్షిభూతుడుగా ఉన్నాడు అన్నట్లు వాటిలోని దోషములతో సంబంధము లేనివాడుగా పరమాత్మ ఉన్నాడు.

అట్లుండియు, **'తీర్న్ద వడియవర్తమ్మై'** (తి.వా. 3-5-11) దృఢాధ్యవసాయము గల భాగవతులను, **'శన్మశన్మాంతరమ్ కాత్తడియార్కళైక్కొండు పోయ్ తన్నై పెరుత్తి తన్తాళిణై కీళ్ క్కొళ్ళుమప్పన్'** (తి.వా. 3-7-7) జన్మపరంపరలో పడకుండ రక్షించి గొనిపోయి స్వస్వరూపావిర్భావమును కలుగజేసి, తన శ్రీపాదముల క్రింద చేర్చుకొను ఉపకారకుడగుచున్నాడు.

**'కొడువినై తూత్తుళ్నిన్ఱు పావియేన్ పలకాలమ్ వళిత్తికైత్తలమరుకిన్ఱేన్'** (తి.వా. 3-2-9) క్రూర పాపసమూహమనెడి కాంతారమున చిరకాలముగా దారి తప్పి భ్రమించి తిరుగుచున్న పాపిని నేను అన్నట్లు సృష్టి సమయమున నీవు ఒసంగినట్టి శరీరముగొని, నిన్ను తిరిగి చేరుటకై యత్నింపక, శరీరవశ్యుడనై ప్రవర్తించి, అనర్థపడి, సత్త్వరజస్తమో

గుణముల మూలముగ నానావిధమైన ప్రకృతివలన కలిగిన శరీరములకు బద్ధుడనై, ఒక దానితోనొకటి మెలుచుకొని ఉండు కర్మలమూలముగ మిక్కుటములగు పాపములలో పడద్రోయు జన్మపరంపరలో చిక్కుకొంటిని.

'ఈ నా బంధమునకు మూలకారణము తెలిసికొనుటకు గాని, నశింప జేయుటకుగాని నేను సమర్థుడను గాను. ఈ పీటముడిలో మరింత చిక్కుకొని పోవుట తప్ప, విడిపించుకొని బయటకు వచ్చుమార్గము తెలియక ఈ ముళ్ళ పొదలో పడి, ఓ దేవా! అల్లాడుచున్నాను. **'వినైకళ్ వేరఱప్పాయ్‌న్దు'** (తి.వా. 3-2-1) నేను ఎప్పుడు నిన్ను చేరెదను? **'ఎంగువన్దణుకిల్పన్'** ఎక్కడికి వచ్చినిన్ను పొందగలను! నిన్ను నేను సమీపించగలనా! ఆ దినమొకటి గలదా? వైరాగ్యముతో శరీర సంబంధమును వదిలించుకొని, నీ శ్రీపాదములను చేరుట ఎన్నడో గదా! అని ఆళ్వారులు తపన జెందుచున్నారు.

ఆళ్వారుల ఈ ప్రవర్తనకు తగినట్లు **'వానవర్ నాట్టైయుమ్ నీ కణ్డుకొళ్'** (తి.వా. 3-9-9) నిత్యసూరులవాసమైన పరమపదమును నీవు కనుగొనుము అని శ్రియః పతి అనుగ్రహించెను. **'ఊనమిల్ మోక్కమెన్‌గో'** సంకోచము లేని మోక్షమనగా సర్వేశ్వరుని శరీరభూతుడగు, ఈ ఆత్మ అనుభవించుట మాత్రమేగాక, శరీరి అగు పరమాత్మ విషయమగు అనుభవముకూడ కలది కావున, కొఱత లేనిదై స్వరూపాను గుణమైనదిగా నుండును. పరమపురుషార్థ రూపమగు మోక్షమునకు ఫలము భగవదనుభవ, కైంకర్యములగుటవలన, **'ముడిచ్చోతి'** అను తిరువాయ్‌మొళియందు వాని దివ్యమంగళ విగ్రహమును, తిరువాభరణములను అనుభవించి, వాటిని ఇంతమాత్రము అని నిష్కర్షించి అనుభవించుట అశక్యమైనందున, అది తమ ఇంద్రియ సౌష్ఠవమున గల లోపముగా నెంచి ఆళ్వారులు కష్టపడుచుండగా, నది విషయ వైలక్షణ్యమునుబట్టి ఉండునది అని శ్రియఃపతి వీరికి దెలిపి ఆకష్టమును పోగొట్టిరి. ఈ అనుభవము వలన, **'పెత్తువీడుయిరే'** (తి.వా. 3-2-10) ఆత్మ నిత్యత్వమును పొందినది అని సాయించి, నిత్యవస్తువు యొక్క సత్తను బొందిరి. ఆ సత్తకు ప్రయోజనమే భగవత్ కైంకర్యేచ్ఛ! **'ఒళివిల్ కాలమెల్లామ్ ఉడనాయ్ మన్ని వళువిలా వడిమై శెయ్యవేణ్డుమ్ నామ్'** (తి.వా. 3-3-1) ఎడతెగకుండ కాలమంతయు సర్వదేశములందు అమరియుండి మనము ఒక్క కైంకర్యమున్ను విడువకుండ చేయవలెను. అనగా - దేశకాలాది నిర్బంధము లేకుండునట్లు, సర్వదేశ, సర్వకాల, సర్వావస్థలలోను, సర్వవిధకైంకర్యములను చేయవలెనని కోరిరి. ఇదే ముముక్షువులందరు కోరి చేయవలసినది.



ఆళ్వారులు తమ స్థితి కనుగుణముగ తమను కైంకర్యమున జేర్చుకొనమని ప్రార్థించి, **'పుకళ్ నల్లొరువన్'** అను తిరువాయ్‌మొళి యందు విశ్వములోని అన్నింటిని విభూతిగా కలిగి వాటిలో అంతరాత్మగా వ్యాపించి, వాటి దోషములతో సంబంధమెంత మాత్రము లేనివాడుగా స్వామి వైభవమునను భవించి ఆనందము ఉప్పొంగినవారై, **'ఎమ్మానై చ్చొల్లిపాడి'** (తి.వా. 3-4-1) నా స్వామిని స్తోత్రగానము చేసి అని, **'పణ్గల్ తలై క్కొళ్ళపాడి'** (తి.వా. 3-4-2) అధికముగా, అతిశయము గానముచేసి అని **'మునివిన్ఱి యేత్తి'** (తి.వా. 3-5-6) అసూయపడకుండ స్తోత్రము చేసి అని, **'ఏత్తిక్కునిప్పార్'** స్తోత్రము చేసి, నృత్యము చేయువారు అని, వాచిక కాయిక, మానసిక వ్యాపారమూలముగ ముదర పండిపోయి అత్యంత ప్రీతిజెందిరి.

ఈ విధమైన ప్రీతి అతిశయము శ్రియఃపతివరకే కాకుండ **'తమ్మడి యారడియార్ తమక్కడియారడియార్ తమ్మడియారడి యోంగళే'** భగవంతునికి దాసులు, వారికి దాసులు, వారికి దాసులు అన్నట్లు భాగవత శేషత్వము స్థిరముగా నుండువారు మనకు ఆదర్శప్రాయులని సాయించారు. **'అడియార్‌కళ్ కుళాంగళైయుడన్ కూడువతెన్టుకొలో'** నీ దాసులగు భాగవతుల గోష్ఠిలో చేరుటెన్నడో ! అని ఆశపడినారు. కైంకర్యమునకై పడగను విప్పుకొని ఉన్నట్టి శ్రీ ఆదిశేషువు వలెనే, ఈ ఇంద్రియమున కిది వృత్తి అని పరిమితి లేకుండ అనుభవింపవలెనను ఆతురత గలవారై మనుష్య మాత్రులను స్తోత్రముచేయుటకై కవిత్వము చెప్పుకవిగాకుండ ('వాయ్‌కొండు మానిడమ్ పాడవన్ద కవియే నల్లేన్') జగత్ సృష్టికర్త యగు శ్రియఃపతిని స్తుతించిరి. భగవదను భవమునకు ఏ విధమైన ఆటంకము గాని, కొరతగాని, విషయాంతర సంబంధము గాని, ఏ కష్టముగాని దుఃఖముగాని లేనివారై నిరతిశయానంద భరితులైరి.

పుండరీకాక్షుడై నిత్యసూరులచే సేవింపబడువానిని సంసారులు భయపడి వెనుదీయక పైబడి ఆశ్రయించునట్లు **'ఎళివరుమ్', 'ఇణైవనామ్'** అను తిరువాయ్ మొళుల యందు సాయించిన అవతార సౌలభ్యము, పరత్వము వంటిదిగా ఎంచునట్లు అర్చావతార సౌలభ్యమును ఉపదేశించిరి. భగవంతుడు మీ కోరికలను నెరవేర్పగలడు, తనతో సాయుజ్యము ప్రసాదింపగలడు. భగవంతుని స్తుతించుటకై రండు! ముక్తపురుషులనుభవించుచున్నట్టి మోక్షైశ్వర్యమును చూడుడు! మానవుల నీచవృత్తు లను మాన్పించి, స్వరూపప్రాప్తమగు భగవత్ కైంకర్యమునందు ఉద్యుక్తులనుగా ఆళ్వారులు జేయుచున్నారు. తామొనర్చినట్టి వాచికకైంకర్యమున మనలను ప్రవేశపెట్టుచున్నారు. ఇదియే మూడవ పత్తు సారాంశము.

**నాల్గవపత్తు సారాంశము :**

'అన్తః ప్రవిష్టః శాస్తా జనానామ్' శ్రీమన్నారాయణుడు అంతరాత్మగా వ్యాపించి యుండి సర్వజనులను నియమించుచున్నాడు. **'ఒళువిల్ కాలమెల్లాం'** అనుతిరువాయ్ మొళిలో తెలిపియున్నట్లు కైంకర్యమున ప్రీతివలెనే కాలాంతరమున, దేశాంతరమున శ్రియఃపతి అమానుషకృత్యములను ఆయా దేశకాలములలో ఉన్నట్లుగానే చూచి అనుభవింపవలెనని ఆళ్వారుల ఆశ. కాలోపాధిని పోగొట్టి, ఆ కాలములోవలెనే వాటిని అనుభవింపజేసి, వీరి దుఃఖమును పోగొట్టి, వీరు త్రికరణశుద్ధిగా చేసిన వాటినన్నింటినీ భోగ్యములుగా స్వామి స్వీకరించిరి.

అట్టి అపురూప స్నేహమున నిమగ్నులై, స్వామిని విడనాడి ఉండునప్పుడు, వానితో సంబంధము గల వస్తువులను చూచినపుడు వాడే అనుకొని భ్రమించి, పరమపదమున భగవదనుభవమునకై ఆశపడి, ప్రార్థించిరి. **'వైకుంఠే తు పరే లోకే'** అన్నట్లు పరమపదమునందు పెరియపిరాట్టితో తాను వేంచేసి ఉన్నపుడు, సేవించి, అనుభవించునట్లు, ప్రత్యక్షముగా అనుభవింపజేసిరి. ఇది నమ్మాళ్వారుల మానసికానుభవము, ఇట్లుపదేశ పూర్వకముగ తెలియజేసిరి. 'మీకు ప్రకృతితోగల సంబంధమే, మీరుజ్జీవింపకుండుటకు కారణమగుచున్నది. మీరు శ్రియఃపతిని ఆశ్రయింపుడు. ప్రకృతి సంబంధమును విడనాడుడు! వాని కైంకర్యమే మీరు పొందునట్టి నిరతిశయ పురుషార్థము'.

**'మరుకలీశనై'** (తి.వా. 4-3-2) దోషములేని, నియామకుడైన శ్రియఃపతిని అని, **'ఈశన్ఞాల ముణ్డుమిళ్న్ద'** నియన్తయై, ప్రళయకాలములో భూమిని తనలో నుంచుకొని, సృష్టికాలంలో బయలుపరుచు ఉపకారకుడు- అని, ఉభయవిభూతి నాయకుడు అని సర్వనియంతయగు సర్వేశ్వరుని ప్రస్తుతించిరి. **'పూవై వీయా నీర్ తూవి పోతాల్ వణంగే నేలు నిమ్బావై వీయా మేనిక్కు పూశుమ్ శాన్దెన్నెంజమే'** పుష్పమును విడువని జలమును సమర్పించి, నమస్కరింపనివాడనైనను రెల్లు పువ్వుతో సమానమై యున్ననీ దివ్యమంగళవిగ్రహమునకు నా మనస్సు పూయతగిన చందనముగా ఉన్నది- అని పుష్పములచే అలంకరింపబడిన నీ కిరీటమునకు సమర్పించుకొన తగిన మాలగా నా ప్రాణమున్నది అని ఆయాకాలములందు వానికి కైంకర్యము సమర్పించుటకు ప్రాప్తిలేక పోయెనే అని ఆళ్వారులు దుఃఖించిరి.

**'కాతల్ మైయిలేరినేన్'** (తి.వా. 4-3-9) ఆశ అనుభ్రమను పొందితిని అన్నట్లు, వానిపై ప్రీతి అధికమై మనస్సు చలించినతోడనే మొదటికే మోసమగునేమో అని



శ్రియఃపతి కొంచము మఱుగు కాగా, అపుడు వానితో సదృశములగు పదార్థములతో వానితోనే మాట్లాడునట్లు మాట్లాడి పిచ్చెత్తినట్లయిరి. ఆళ్వారుల ఈ భ్రమకు, దుఃఖమును బాపుటకై స్వామి నిత్యవిభూతిలో అనుభవింపవలసిన భోగమునుకూడ ఈ లోకమునందే అనుభవింపదగినట్లు ఏక భోగముగా వారికి ప్రకాశింపజేసిరి. అపుడాళ్వార్, **'వీవిలిన్బమిక వెళ్లై నీకళ్న్దన్ మేమియే'** (తి.వా. 4-5-3) అనంత ఆనందచరమావధిలో ఉన్నాను అని, **'కూట్టరియ తిరువడిక్కల్ కూట్టినై నాన్ కండేనే'** దుర్లభములైన శ్రీపాదములను నేను పొందితిని అని హర్ష పరవశులైరి. **'కొడువులకమ్ కాట్టేల్'** ఇక క్రూరమైన ఈ లోకమును చూడజాలను అని లోకయాత్ర విషయమున వైరాగ్యమును, ఐశ్వర్య, కైవల్య విషయములపట్ల సంపూర్ణవైరాగ్యమును గలవారై, ఆళ్వారులు, **'ఒరునాయకమాయోడవుల కుడ నాణ్ణవర్ పెరునాడు కాణవిమ్మైయిలే పిచ్చెతాంగొళ్వర్'** (తి.వా. 4-1-1) ఏకాధిపత్యముకలవారై చాలకాలము లోకముల పరిపాలించిన మహారాజులు విశాల విశ్వమంతయు చూచుచుండగా ఈ లోకమునందే బిచ్చమెత్తుకుందురు అన్నట్లు **'రాజ్యం నామ మహావ్యాధి చికిత్స్యోఽనాశనః, భ్రాతరం వా సుతం వాపి త్యజన్తి ఖలు భూమిపాః'** -రాజ్యాధికారమనునది ఒక గొప్ప వ్యాధి. చికిత్సకు లొంగనిది, నశింపజేయునది. దీని మూలముగ రాజులు తోబుట్టువులను, కొడుకులను కూడ వదలివేయుచున్నారు. అట్లు రాజ్యైశ్వర్యము అల్పమైనది, స్వర్గసుఖము అస్థిరమైనది, **(క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి)** కైవల్యము పరిమితము. కావున ముముక్షువు చేరదగిన చోటు పరమపదమే.

**'పేశ నిన్ద శివనుక్కుమ్, పిరమన్దనక్కుమ్, పిఱక్కుమ్ నాయకనవనేక పాలనన్ మోక్కత్తు క్కణ్డుకొళ్మిన్'** (తి.వా. 4-10-4) ఓ సంసారులారా ! మీరు పరదేవత అని చెప్పుచున్న రుద్రునికి, బ్రహ్మకు, మిగతావారికి ఆ శ్రీమన్నారాయణుడే స్వామి. బ్రహ్మకపాలమునుండి శివుడు విడుదలై బ్రతికి బట్టకట్టుటలో ఈ విషయము నిరూపితమైనది గదా! **'ఇలింగతిట్ట'** (తి.వా. 4-10-5) లింగమును స్తుతించుటకై చేయబడిన స్తోత్రములు, **'ఇళమ్బు మాఱు శమైయముమ్'** (తి.వా. 4-10-9) శబ్దమాత్ర సారము లైనట్టి షణ్మతములు వేదబాహ్యములని ఆళ్వారులు నొక్కి వక్కాణించిరి.

ఇంకను, **'యన్మయం చ జగత్సర్వమ్'** జగత్తు ఎవ్వని నుండి ఉద్భవించినది? అని అడిగి, **'విష్ణో స్సకాశా దుద్భూతమ్'** అది విష్ణువువలన కలిగినది అని సాయించిరి. వేదములందు స్తోత్రపరములగు వాక్యములతోను, రాజసతామస పురాణములలోను పరదేవతలుగా జెప్పబడిన బ్రహ్మరుద్రాది దేవతలు తమకు వచ్చిన కష్టములనే

ముందుగా తెలిసికోలేక, ఆ కష్టములను తమకు తాము తొలగించుకోలేక, శ్రియః పతిని ఆశ్రయించి రక్షింపబడిరి గదా! పరతత్త్వము శ్రీమన్నారాయణుడే అని తెలిసి కోలేక క్షుద్రదేవతలను పూజించి, నరమాంసాది నింద్యపదార్థములను నైవేద్యము పెట్టి, ఆవేశమెక్కి ఆడుతూ సంసారులు అతినీచస్థితికి దిగజారుచున్నారే అని ఆళ్వారులు ఆవేదన చెందినారు. (తి.వా. 4-6-2, తి.వా. 4-6-4)

చీమను ఏనుగుగా చేసి కవిత్వము చెప్పుమని అడుగువారివలెనే, లింగమును చూపించి, దీని మహిమను చెప్పవలసినదని అడుగుటచే తమోగుణవశ్యులైన వారు చెప్పినట్టి లైంగపురాణాది రూపమగు కుదృష్టుల వాచాలతను ఆధారముగా చేసికొని, తమ విపరీత వాదములచే కొందరు సామాన్యసంసారులలో అయోమయము సృష్టించి, పబ్బము గడుపుకొందురు. కాని, ఇవన్నియు వేదప్రమాణమునకు అనుగుణమైనవి కాకపోవుటచే ముముక్షువులు ఈకుతర్కవాదములకు విలువనివ్వరు. **'యా వేద బాహ్యా యా యాశ్చ కాశ్చ కుదృష్టయః, తా స్సర్వా నిష్ఫలాః ప్రేత్యతమోవిష్టా హి తా స్మృతాః'** అన్నట్లు బౌద్ధాదులచే ప్రవర్తింపజేయబడిన షణ్మతములును వ్యర్థములే! అవి వేదబాహ్యములు.

**'ఒడియొడి'** (తి.వా. 4-10-7) తిరిగి తిరిగి అని ఆరంభించి, **'పళియేరిక్కణ్డీర్'** దేవతాంతరపరులు పోయిన మార్గమున పోయి **'గతాగతం కామకామా లభన్తే'** - అన్నట్లు స్వర్గనరకములకు పోవుచు మరల మరల **'క్షీణే పుణ్యే మర్త్య లోకం విశన్తి'** పుణ్యము ఖర్చుచేసికొని ఈ లోకమున జన్మించు చుందురు. **'కణ్డుమ్ తెళియ కిల్లీర్'** అనగా శ్రియఃపతి జగన్నిగరణాది రూపములగు దివ్యచేష్టితములను శాస్త్రముల ద్వారా తెలిసికొని 'ఆతడే ఆశ్రయింపదగినవాడు' అని తెలిసికొనలేకున్నారు.

అయినను, మనలను ఈ లోకముననే యుంచినది ఎందుకనగా పుణ్యాపాప కర్మలు చేయువారు, వారి కర్మానుసారముగ ఫలములను పొందుదురను శాస్త్రమర్యాద చెడిపోవుననియే సుమా! **'మమ మాయా దురత్యయా'** అని పరమాత్మ చెప్పిన రహస్యము అదే! గాన, అది వాని మాయ అని తెలిసికొని, 'మామేవయేప్రపద్యంతే మాయా మేతాంతరంతితే' నన్ను శరణుజొచ్చినవారు నా మాయలో పడరు అన్నట్లు ఆశ్రియఃపతి శ్రీపాదములలో శరణాగతి చేసి, వాని మాయనుండి విముక్తి పొందుడు. **'ఆట్చెయ్‌వతే యురువతావతెన్ను' - నీళ్‌కుడకూత్త - నుకాట్చెవతే ఉఱువతావతు'** కుంభనృత్యము చేయు సర్వేశ్వరునికి కైంకర్యము చేయుటయే ఈ ఆత్మకు స్వరూప ప్రాప్తము, అని చెప్పిఉన్నందున, నిరతిశయ భోగ్యములగు అద్భుతకార్యములొనర్చు



ఆ శ్రియఃపతికే కైంకర్యమొనర్చుట ఈ ఆత్మకు సులభసాధ్యము, శ్రేయస్కరము అని నమ్మాళ్వారులుపదేశించిరి.

**'విరక్తి పూర్వకమాక ఆశ్రయణత్తై రుచిపక్కిరార్ నాలామ్బత్తిల్'** అనగా ప్రయోజనాంతర, దేవతాంతర, వేదబాహ్యకుతర్కముల, మతముల విషయమున వైరాగ్యమును కలుగజేసి, తద్వారా జగత్కారణత్వాది విషయప్రమాణోపపత్తుల మూలముగ భగవంతుని ఆశ్రయించుటకు సంసారులకు రుచి పుట్టించుచున్నారు. ఇదే ఆళ్వారుల విలక్షణ మార్గము. ఇదే నాల్గవ పత్తు సారాంశము.



# పదునాల్గవ అధ్యాయము

# ఐదవ ఆరవ పత్తుల సారాంశము

ఈ ఐదవ పత్తులో, ఇంతకు ముందు చెప్పిన, పరత్వాదులచే తమకు కలిగిన యుత్కర్షమును, నికర్షమును అనుసంధించుకొని వెనుదీయునప్పుడు పైపైబడి అంగీకరించు పరమకారుణికుడగు పరమాత్మ వీరికి కలుగజేసిన స్వవిషయభక్తిని, భాగవత సమావేశమును కలిగియున్నట్టి వీరు తమచే దిద్దుబాటు చేయబడిన, శ్రీవైష్ణవులను దిద్దుబాటు చేసిన తమను జూడవచ్చిన నిత్యసూరులను, శ్వేతదీపవాసులగు సిద్ధులను జూచి మంగళాశాసనమొనర్తురు. అట్లు దిద్దుబాటుకాని అసురరాక్షస ప్రకృతులను భగవద్భాగవత వైభవోపదేశముచే సంస్కరించి భాగవతగోష్ఠి సేవయింపగునట్టి జ్ఞానముదయించిన వారికి ప్రాప్యత్వరకు మూలమైన భక్తిని ఉపదేశింతురు.

**'ఆవా వెన్నరుళ్ శెయ్‌తు'** అయ్యో! అయ్యో! అని ఈ చేతనుని దయతో జూచి, **'కలియుగమొన్షు మిన్షిక్కే తన్నడియార్క్కరుళ్ శెయ్యుమ్'** తనపై భారముంచిన వారికి కలిదోషములలో నొక్కటికూడ సంప్రాప్తింపకుండ కృపచేయును. అది శ్రియఃపతి స్వభావము. ఎంత గొప్ప పాపులైనను, వారి కర్మానుగుణముగ నిర్వహించుటకు అనుకూలమైన తన నిరంకుశ స్వాతంత్ర్యరూపమగు గట్టును, తన అనుగ్రహము ఈ చేతనులవైపు రాకుండునట్లు అపరాధములు చేసిన వీరికి గల ఔపాధిక స్వాతంత్ర్య రూపమగు గట్టును, ఈ రెండును పొర్లి పోవునట్లు, నిండిపోవు కృపాప్రవాహముగల శ్రియఃపతి మనలను అనుగ్రహించును.

ఇంకను, **'పొయ్యే కైమైశొల్లి'** (తి.వా. 5-1-1) గొప్ప అసత్యమును చెప్పి అని, **'ఎన్నైన్నే శిలక్కూత్తు శొల్లి'** (తి.వా. 5-1-2) అమృతము వంటివాడా! అని కొన్ని అసత్యములు చెప్పగా అని, **'ఉన్నైయుమ్ వంజిక్కుమ్ కళ్ళమనంద విర్న్దే'** (తి.వా. 5-1-3) నిన్ను కూడా వంచించుచున్న కపట హృదయమును వదిలి, అనగా - కించిత్తయినా సత్యముకాని శుద్ధ అబద్ధము చెప్పి, ప్రేమపరవశులవలెనే భావించి, హృదయము సాంసారిక విషయములందు ప్రీతిగలదై, అనన్యప్రయోజనుల వలెనే వాని ఔదార్యమును, దివ్యమంగళ విగ్రహసౌందర్యమును ప్రీతితో జెప్పుచున్నారని తోచునట్లు పలుమారు చెప్పుచు, సర్వజ్ఞుడవైన నిన్నుకూడ వంచించునట్టి కృత్రిమమైన మనస్సును నివర్తింపజేయుమా ! అనుచు అవి వీరి చెంతజేరకుండునట్లు చేయుమని శ్రియఃపతిని ఆళ్వారులు ప్రార్థించిరి.



అన్ని పదార్థములలోను తానే అంతరాత్మగా నుండి, 'నేను నిన్ను విడనాడినను, నన్ను విడనాడని వాడవగు నిన్ను విడనాడుదునా ?' **('ఎన్నై ముత్తవుమ్‌తానానాన్ - ఇనియున్నై విట్టెన్‌కొళ్‌వనే')** (తి.వా. 5-1-10) అని వీరే స్వయముగ చెప్పునట్లు చేసిన విషయాంతరవైరాగ్యమునకు ఫలముగ పరమాత్మపై ఆళ్వారులకు ప్రీతి అధికమైనది. **'పేరమరర్ కాతల్'** (తి.వా. 5-3-4) గొప్పగా అమరిఉన్నట్టి ఆశను అన్నట్లు అపరిచ్ఛేద్యముగా నమరియుండి, **'పిన్నిన్షు కాతల్ నోయ్ నెంజమ్ పెరితడుమ్'** (తి.వా. 5-4-6) ఆశ అనెడి బాధ వెనుకనుండి మనస్సును మిక్కిలి బాధించుచున్నది అనుచు, ఆ ఆశ మిక్కిలి అతిశయించి **'కడల్ ఞాలమ్ శెయ్‌తేనుమ్ యానే'** అని తీవ్రభావనచే సర్వేశ్వరుని సమీపించినవారై **'వాయన్దవళుతివళనాడన్'** (తి.వా. 5-6-11) వళుతివళనాడను దివ్యదేశమున వేంచేసి యున్న శ్రియఃపతి జగత్కారణత్వాద్యద్భుత కార్యములను **'నేనే చేసినాను'** అనుచు అనుకరణము వలన అభిమత విషయమునుసమీపించి మాట్లాడుదురు.

**'ఉన్నై విట్టొన్షుమాత్తికిత్కిన్షిలేన్'** (తి.వా. 5-7-1) నిన్ను విడిచి ఉండి సహింప సమర్థుడను కాను అని, **'ఆరావముతే అడియే నుడలమ్ నిన్బాలన్బాయే నీరాయ్'** (తి.వా. 5-8-5) ఎంత గ్రోలినను తృప్తి తీరని అమృతము వంటివాడా! ఈ దాసుని శరీరము నీపట్ల ప్రీతి స్వరూపమై నీరైపోవుచున్నది అనగా శిథిలమగుచున్నది. **'వైకలుమ్ వినైయేన్ మెలియ'** (తి.వా. 5-9-1) ఈ పాపిని ప్రతిదినము బాధించుచున్నది.

**'విషవృక్ష ఫలంగళ్ కైకూడినవర్'** ఇట్లు భగవద్విషయమున ప్రీతి అతిశయించుట వలన భాగవతుల సహవాసమువలన **'సంసార విషవృక్షస్యద్వేఫలే హ్యా అమృతోపమే, కదాచిత్ కేశవే భక్తిః తద్భక్తై ర్వా సమాగమః'** సంసారమనెడి విషవృక్షము యొక్క అమృత ఫలాలుగ చెప్పబడిన భగవద్భక్తి, భాగవత సమాగమములను వీరు చేజిక్కించుకొనిరి.

**'వైకున్దమ్ పూతంగళేయాయ్'** (తి.వా. 5-2-4)-విశాలమైన సముద్రము నందు పవ్వళించి యున్న శ్రియఃపతి భక్తులై వేంచేసిన నిత్యసూరులును, ముక్తప్రాయులగు దేవతలును వీరిని **'కణ్డోమ్ కణ్డోమ్'** - 'సేవించినాము సేవించినాము' అన్నట్లు చూచుటకింపుగా నున్నందున సేవించినాము. సేవించినాము - అని అనేక పర్యాయములు చెప్పునట్లు సేవించి **'పొలిక పొలిక'** వర్ధిల్లాలి! వర్ధిల్లాలి! అను తిరువాయ్‌మొళిలో వారందరు వృద్ధిపొందవలెనని మంగళాశాసనము చేసిరి.

ప్రహ్లాదుడు ఉపదేశింపగా వినికూడ దిద్దుబాటుకానట్టి రాక్షసుడగు హిరణ్యకశ్యపుని వలెనున్న, **'ప్రదీయతాం దాశరథాయ మైథిలీ'** రాఘవునికి సీతనొసంగుము అని శ్రీవిభీషణులవారు ఉపదేశింపగా విని, సంస్కరింపబడని రాక్షసుడగు రావణుని వలెనున్న, ఆళ్వారులుపదేశించినను దిద్దుబాటు కానట్టి రాక్షస స్వభావులు, అసుర స్వభావులు అయిన వారిని వెతికి పట్టుకొని ఆకలి, ద్వేషము, వ్యాధి మున్నగు దోషములనన్నింటిని ఈలోకములోనుండి తరిమి వేయుటకై చక్రధరుడైన స్వామి భక్తులు అవతరించినారు అని ప్రకటించినారు. **'తిరియుమ్ కలియుగమ్ నీంగిత్తే వర్కళ్ తాముమ్ పుకున్దు'** (తి.వా.5-2-3) వస్తువుల స్వభావమును మార్చెడి కలియుగము తొలిగి, గొప్ప కృతయుగము ప్రవేశించి, నిత్యసూరులు తాము స్వయముగా ప్రవేశించి అని సాయించినట్లు శరీరమును నశింపజేసి ప్రాణములను పోగొట్టువ్యాధి, దానికి కారణమైన శత్రుత్వము, క్షుత్తు మున్నగు దేశదోషములును, **'భవిష్యత్యధరోత్తరమ్'** అన్నట్లు పదార్థముల స్వరూపము మారిపోవునట్లు చేయు కలియుగ సంబంధమగు కాలదోషమును పరిహరింపగలరు.

**'ఇరియ పుకున్దిశైపాడి ఎంగుమిడమ్గొణ్డన'** (తి.వా. 5-2-3) ఆర్భాటముగ ప్రవేశించి గానము చేసి సమస్త ప్రదేశములును తమ స్థానములుగా జేసికొని నారుకదా ! అన్నట్లు భగవదనుభవము వలన కలిగిన ప్రీత్యతిశయమువలన గొప్పవైభవముతో ప్రవేశించి, ప్రతికూలురుగా ఉన్నవారికి అవకాశము కలుగకుండా అంతటా వ్యాపించి యున్నట్టి వారిని, **'మేవిత్తొళుతుమ్మినీర్కళ్'** అనగా, మీరు అనన్య ప్రయోజనులై ఆశ్రయించి ఉజ్జీవించండి అని ఉద్బోధించిరి.

ఒకవేళ, దేవతాంతర ప్రావణ్యము వలన భగవద్ వైభవము తెలిసికొనుటకు తగిన జ్ఞానములేని వారయితే, **'నిరుత్తి నుముళ్ళత్తు కొళ్ళుమ్ తెయ్వంగళ్'** (తి.వా. 5-2-7) మీ మనస్సునందు నిలుపుకొనుదేవతలు మిమ్మల్ని రక్షించునప్పుడు, రాజైనవాడు ఊరిఊరిలో ఉద్యోగస్థులను ఏర్పరచునట్లు, మీకు వారిని ఆశ్రయణీయులుగా ఏర్పరిచినట్టి శ్రియఃపతికి కృతజ్ఞతగా దండము సమర్పించండి. అప్పుడు కలియుగ దోషము మిమ్ములను అంటదు అని ఉపదేశించినారు.

**'నక్కపిరానోడయను మిన్దిరనుమ్'** (తి.వా. 5-2-10) రుద్రుడు, చతుర్ముఖ బ్రహ్మ, ఇంద్రుడు మున్నగు దేవతలు శ్రీకృష్ణుని యొక్క దివ్యమంగళ విగ్రహమును శుభాశ్రయముగా నాశ్రయించి విశాలలోకముల వ్యాపించి, మహదైశ్వర్యమును సంపాదించుకొనిరి. వారి వలెనే మీరును శ్రియఃపతిని నేరుగా ఆశ్రయించితిరేని



విపరీత ప్రవర్తనలను కలుగజేయు కలియుగ దోషము మీకంటదు. **'విష్ణుభక్తిపరో దేవః'** అన్నట్లు రాక్షస స్వభావము పోయి, దేవతలని చెప్పదగినట్టి భగవద్భక్తులుగా మిమ్ములను చేయును. అంతేగాక, దిద్దుబాటు కాదగిన వారిని దిద్దుబాటు చేయుట మాత్రమేగాక, ముందుగానే సంస్కరింపబడి, భాగవత గోష్ఠిని సేవింపరుచిగలవారై, **'మనసి విలసతాక్ష్ణా భక్తిసిద్ధాంజనేన'** సిద్ధాంజనము వలెనే తెలియరాని అర్థములును ప్రకాశింపజేయునదై, ప్రాప్యవైలక్షణ్యమును సాక్షాత్కరింపచేయునట్టి భక్తిని ఉపదేశపూర్వకముగా ఆళ్వారులు అనుగ్రహించినారు. ఇది తిరువాయ్‌మొళి ఐదవపత్తు సారాంశము.

**ఆరవపత్తు సారాంశము :**

అందరు వచ్చి ఆశ్రయించుటకు అనుకూలముగ శ్రియఃపతి తన శ్రీపాదములనే కృపతో చూపింపగా, అవే ఉపాయముగా, ఉపేయముగా శ్రీనమ్మాళ్వారు తమ తిరువాయ్‌మొళి ఆఱవపత్తులో, ఆ శ్రీపాదములను ఎన్నడు విడవకుండ అనుసంధించు అధ్యవసాయము గలవారైరి. ఇంతవరకు అవలంబించిన భక్త్యుపాయము దుష్కరమని అనుభవమున తెలుసుకొని, మనస్సు పరిపక్వమైన వారికి ప్రపత్తి నిష్ఠయే ఉత్తమమని ఈ ఆఱవ పత్తునందు సాయించుచున్నారు.

నమ్మాళ్వారులు నాయికా దశనుపొంది, **'ఏరుశేవక నార్కెన్నైయు ముళశెన్మింగళే'** ఆర్తరక్షణ దీక్షను వహించిన శ్రియఃపతి రక్ష్యవర్గములో నేనుకూడ ఒకతెను ఉన్నానని తెలుపుడు అని సారసపక్షుల పురుషకారము నర్థింతురు. తిరువిణ్ణగర్ దివ్యదేశమునందు వేంచేసిఉన్న స్వామి శ్రీపాదములు తప్ప వేరు ఉజ్జీవనోపాయములేదు అని, **'వన్‌శరణ్ శురర్క్కాయ్'** అతడు దేవతకుకూడ రక్షకుడు అని సాయించిరి. స్వామి కృపవలన, **'సర్వలోకశరణ్యాయ రాఘవాయ మహాత్మనే నివేదయత మాంక్షిప్రం విభీషణ ముపస్థితం'** అనుచు వచ్చి శరణాగతుడైన శ్రీవిభీషణుల వారు **'సర్వలోక శరణ్యుడు'** అని చెప్పిన మాట సముద్రఘోషవలె నిరర్థకము కాకుండ, శరణాగతులయినట్టి వారిని రక్షించువిషయమున దీక్ష వహించినవాడై, తన ఉపాయత్వము రాతిమీద (శిలాశాసనం) చెక్కియుండునట్లు తిరుమలలో వేంచేసి ఉన్నాడు.

**'పూవార్ కళల్ కళరువినైయేన్ పొరున్దుమాఱు పుణైరాయే'** (తి.వా. 6-10-4) పుష్పసమానమైన శ్రీపాదములను పాపినైన నేను పొందు విధము తెలుపుమా అనగా సాధనానుష్ఠానము జేసి ముక్తప్రాయుడను కాలేకపోతిని. నీ విషయమున మిక్కిలి ప్రీతి కలిగి నిన్ను సేవింపవలెననెడి ఆశవలన బలహీనుడనై భయపడుచుంటిని. ఇక

నేను ఉపాయానుష్ఠానమునకు సమర్థుడనుకాను. నిరతిశయభోగ్యములైన నీ శ్రీపాదములను నేను చేరునట్లు నీవే ఒక మార్గము నేర్పరుపుము- అని అర్థించిరి. **'వైకల్ పూంగళివాయ్ వన్దు మేయుమ్‌కురుకినంగాళ్'** (తి.వా. 6-1-1) సుందరములైన ఉప్పుకాలువ తీరములందు ప్రతిదినము వచ్చి మేయునట్టి ఓ సారసపక్షులారా! అని, **'కనివాయ్ కాతన్మైక్కైకళ్ కూప్పిచొల్లీర్'** దొండపండు వంటి పెదవులు గల భగవంతుని సేవించి చేతులు జోడించి ప్రార్థించు పాపినైన నా అభినివేశమును వానికి విన్నవింపుడు అని, శ్రియఃపతిని పొందిననే తప్ప ప్రాణములు నిలుపుకోలేకున్నను, తనను రక్షించుకొనుటలో తానే ప్రయత్నించుట అను స్వాతంత్ర్యమును సహింపజాలనట్టి స్వస్వరూప పారతంత్ర్యమువలన భగవంతుడే తనను రక్షించువాడని నిర్ణయమునకు వచ్చిరి.

అపుడు, **'ఉభాభ్యా మేవ పక్షాభ్యామ్'** అన్నట్లు, జ్ఞానానుష్ఠాన రూపములగు రెండు రెక్కలుండుట వలన ప్రాప్యమగు భగవద్విషయమును శీఘ్రముగా లభింప జేయుటకు పక్షులు తగిన ఘటకులని, వాటిని స్వామి కడకు దూతలుగా బంపిరి. అయినను స్వామి రాక ఆలస్యమైనందుకు ఆళ్వారు నాయికకు ప్రణయరోషము ముంచుకువచ్చెను. ఆలస్యముగా ఏతెంచిన స్వామిని **'పోకునమ్బి'** వెళ్ళిపొమ్ము! **'కళకమేరేల్ నమ్బీ'** (తి.వా. 6-2-6) మా గోష్ఠి మధ్యకురాకు! అని ఉపేక్షింపవలెనని ఇసుకలో బొమ్మరిండ్లు కట్టుచు గుజ్జనగూళ్ళు ఆరగించునట్లు ఆటలాడగా, స్వామిఆ బొమ్మరిండ్ల తన శ్రీపాదములతో తొలగించి, తన దివ్యమంగళవిగ్రహ సౌందర్యమును జూపించి, నాయిక ప్రణయరోషమును పోగొట్టిరి. ప్రణయకలహము శమింపగా, తమ గుణచేష్టితములను అనుభవించుటకు తగిన సామర్థ్యమును పెరుమాళ్ళు ఆళ్వారులకు అనుగ్రహించిరి.

**'కురైవాయ్చ్చియర్'** అను తిరువాయ్‌మొళి యందు, **'ఎన్నై కురై యెనక్కు'** నాకేమి కొరత ఉన్నది? అని, **'నణ్ణినాన్ వణఙ్గ పెత్తేనెనక్కార్ పిరఱర్ నాయకర్'** భగవంతుని స్తోత్రము చేసి వానికి దండము సమర్పింపగలిగితిని. ఇక నాకువాడు తప్ప మరి ఎవ్వడు నాథుడు కాగలడు ? అని ఆళ్వారులు గర్వముతో మురిసిపోయిరి.

ఉపాయాంతరములను త్యజించి, సిద్ధోపాయమగు సర్వేశ్వరుని వరించుట, **'సకృదేవ ప్రపన్నాయ'** అనునట్లు ప్రాప్తికి గాను ఒక్కతడవ మాత్రమే చేయవలసినది అని తెలిసిన వీరు, **'పితరం, మాతరం, దారాన్, పుత్రాన్, బంధూన్, గురూన్, సఖీన్, రత్నాని ధనధాన్యాని క్షేత్రాణిచ, గృహాణిచ, సర్వధర్మాంశ్చ సంత్యజ్య, సర్వకామాంశ్చ**



**సాక్షరాన్, లోకవిక్రాంత చరణౌ శరణంతే వ్రజన్ విభో'**- ఓ భగవంతుడా ! తండ్రిని, తల్లిని, భార్యను, పుత్రులను, బంధువులను, గరువులను, స్నేహితులను, రత్నములను, ధనమును, ధాన్యమును, భూములను, గృహములను, సర్వధర్మములను, సర్వకామము లను, కైవల్యమును త్యజించి త్రివిక్రమావతారమున లోకములను కొలిచినట్టి నీ శ్రీపాదములను శరణుజొచ్చినాను. అనువచనము **'ఆగ్నేయ మష్టమం చైవ భవిష్యన్నవమం స్మృతం'** అనుచోట అష్టాదశ పురాణములలో తొమ్మిదవ పురాణముగా జెప్పబడిన భవిష్యత్‌పురాణమునందుండు దానిని -శ్రీభాష్యకారులు తమ శరణాగతి గద్యయందు చేర్చినదానిని- అనుసంధించి శరణాగతి వేడిరి. ఈ వాక్యమున **'సర్వధర్మాన్'** అనుపదము ఉపాయాంతరములను, ఉపేయాంతరములను తెలుప గలదు.

**'నమ్మక్కైవలిన్దు'** (తి.వా. 6-5-1) -ఈమె మనలను అతిక్రమించినది అని, **'ఇళన్దతు శంగే'** కంకణముజారి పోయినది అని, **'ఈతెల్లామ్ కిడక్క విని పోయ్'** ఈ వస్తువులన్నీ ఉండగా, వెళ్ళిపోయి అని, **'ఎమ్మైయొన్నుమ్ నినైత్తిలళే'** - కొంచమైనను ఈమె మమ్మల్ని లక్ష్యపెట్టడం లేదు అని, **'ఇన్తైనక్కుతవాతకన్ఱ'** (తి.వా. 6-7-6) ఇప్పుడు నాకు సహాయముగానుండక విడిపోయినది అని సాయించిరి. చేతనాచేతన రూపములగు వీటిని విడిచిపెట్టి, నిద్రపోవుచున్నట్టి వాని చేతిలోని పండుజారి పడిపోవునట్లు, భగవంతుని పట్లగల ప్రీతి పారవశ్యత వలన తనంతనే విడిపోవుచుండగా చూచి **'సర్వాన్ భోగాన్ పరిత్యజ్య'** అన్నట్లు వీటిలో ఒకదానినైనా లక్ష్యపెట్టక ఉపేక్షించి దూరమైనారు.

ఇంకను, **'పొన్నులకాళీరో పువనముళుతాళీరో'** (తి.వా. 6-8-1) మనోహరమైన శ్రీవైకుంఠమును అనుభవించండి, లీలావిభూతిని అనుభవించండి అని, **'నెయ్యమరిన్నడిశిల్ నిచ్చల్ పాలోడు మేవీరో'** నెయ్యికలిపిన ప్రసాదమును పాలతో కలిపి (పాయసాన్నము) ఆరగించుడు అని, **'ఓడివన్దేన్ కుళల్ మేలొళిమామలరూతీరో'** పరుగెత్తివచ్చినాకొప్పుమీద ప్రకాశించు శ్లాఘ్యమైన పుష్పమూలమీది మకరందమును గ్రోలుడు! అని తమకు ఉపాదేయమగు పరమపదముతో గూడ పురుషకార భూతులైన విహంగములకు కట్నముగా సమర్పించిరి. **'త్వమేవ మాతాచ పితా త్వమేవ, త్వమేవ బన్ధుశ్చ గురుస్త్వ మేవ త్వమేవ విద్యాద్రవిణం త్వమేవ, త్వమేవ సర్వం మమ దేవ దేవ'** అని, **'తేవరానైయే తన్తైతాయెన్ఱడైన్ద'** శ్రీ, శ్రియఃపతులనే తల్లిదండ్రులుగా నమ్మి అని సాయించినట్లు, భగవంతుడే మాతాపిత్రాది సర్వవిధబంధువని, **'ఉణ్ణుమ్ శోరు,**

**పరుకునీర్, తిన్నుమ్ వెత్తిలియుమ్ యెల్లామ్ కణ్ణన్'** తినే అన్నము, త్రాగే మంచినీరు, వేసుకునే తమలపాకు, అన్నీ శ్రీకృష్ణుడే అన్నట్లు ధారక, పోషక, భోగ్యపదార్థములన్నీ ఆశ్రీకృష్ణుడే అనీ, **'వైత్తమానిదియాయ్ మదుశూదనైయే'** ఆపత్కాలపెన్నిధి కూడ మధుసూదనుడే అని, బొమ్మలు మున్నగు క్రీడోపకరణములవలన కలుగు ఆనంద మంతా శ్రియఃపతి యొక్క తిరునామములనుచ్చరించిన మాత్రమున కలుగునని, ఇట్లు తామంతకు ముందు విడిచిపెట్టిన విషయములవలన కలుగు రసమంతయు, భగవద్విషయములోనే లభించగలదని ఆళ్వార్లు సంపూర్ణముగా విశ్వసించిరి.

ఇంకను, జగత్తుకు సర్వవిధముల రక్షకుడవై (శ్రియాసార్థం) పెరియపిరాట్టితో కూడియున్ననిన్ను చేరుకొనక ఎంతకాలము ఇట్లు కష్టపడుదును? నిరతిశయ భోగ్యములగు నీ శ్రీపాదములందు నన్ను జేర్చుకొను కాలము ఇంకను రాలేదా? మానసానుభవము మాత్రమే కాకుండ, నీ శ్రీపాదములను ప్రత్యక్షముగా జేరుట ఎన్నటికో?

**'అన్టు ఞాల మళన్ద పిరాన్ పరన్ శెన్టు శేర్ తిరువేంగడమామలై'** లోకములను గొల్చుట అను అమానుష కృత్యమువలన, ప్రకాశించుచున్న పరత్వము గలవాడు, అట్టి శ్రమ పోవునట్లు, ఎండలో ఆయాసపడి వచ్చినవాడు మడుగులో స్నానము చేయునట్లు, సంతోషముతో వేంచేసియున్నట్టి శ్రియఃపతిని **'తిలకములగు క్కాయ్‌నిన్ట తిరువేంగడమ్'** - లోకానికంతకు ముఖ్యాభరణముగా నున్న తిరుమలయందు సేవించి, **'అకలకిల్లేన్'** అని సాయించి, పురుషకారభూతురాలగు పెరియపిరాట్టిని ముందుంచు కొని, **'అడిక్కీళ్ అమర్న్దు పుకున్దేన్'** శ్రీ పాదములక్రింద అమరియుంటిని అని సాయించి తమకు గల సిద్ధోపాయనిష్ఠను తమయొక్క శ్రీసూక్తుల వలనను (**'పిణక్కఱ'** ఇత్యాది పాశురములు మొదలుకొని **'వేతప్పునితవిరుతి'**అను వరకును) ద్వయము యొక్క పూర్వఖండమును అనుసంధించుకొనుట చేతను తమ అనుష్ఠానముచేతను ప్రకాశింపజేయుచున్నారు. ఇది ఆఱవపత్తు సారాంశము.





## పదిహేనవ అధ్యాయము

# ఏడవ - ఎనిమిదవ పత్తుల సారాంశము

తిరువాయ్‌మొళి ఏడవ పత్తులో ఉపాయకృత్యమునకు గావలసిన విచిత్రశక్తి సంబంధము వలన యథార్థజ్ఞానము గలిగినవారిచే పొందదగిన పరమపదమును తానే ఉపాయమై ఇప్పించునప్పుడు తిర్యక్‌స్థావర జంతువులకును, శత్రువులకుకూడ యిప్పింపగల శ్రియఃపతి శ్రీపాదములను క్షణకాలమైనను విడిచియుండజాలనివారై నమ్మాళ్వారులు సాంగముగ ప్రపత్తి నొనర్చిరి. అయినను తమను విషయాంతరముల పట్ల ఆసక్తి గల వారినిగా జేసి, భగవద్విషయమునకు దూరమై పోవునట్లు చేయగల ఇంద్రియముల సంచారముగల సంసారమునందుంచి ఉన్నందున మిక్కిలి దుఃఖితులై, మొరపెట్టిరి. తమ స్థితిగతులను తామేస్వయముగ జెప్పుకొనజాలక తొట్రుపడి, మనసు పరాధీనమయ్యెను.

అప్పుడు, శ్రియఃపతి తన విజయవిలాసములను చూపించి ఆళ్వారుల మనస్సు స్థిమిత పడునట్లుచేసిరి. ఆ స్థిమితముకూడ ఇరుగుపొరుగు సంసారల దుఃఖములను తలచుకొనుటచే చెడిపోయి ఎప్పటి వలెనే ఆర్తి పెరిగెను. అనుభావ్య విషయము స్మృతి విషయమై బాధపెరుగుచు, తరుగుచు ఉండగా, ఆళ్వారులు స్వామితో ఇట్లనిరి.

ఉపాయ భూతుడగు నీకు జ్ఞానశక్తులలో కొఱతలేదు. దాసుడనైన నాకు కూడ ఆకించన్యము, అనన్యగతిత్వము, ఆర్తివిషయములలో ఏ కొరతలేకుండ అనుగ్రహించితివి. నీవేల నన్నింకను సంసారములో నుంచియున్నావు?

**'మాకు, మాతో సంబంధముగలవారికి ఇంపుగా తిరువాయ్‌మొళి పాడుటకు గాను ఉంచితిమి ఆళ్వారే!'**

'వ్యాసాదులు, ముదలాళ్వారులు కవిత్వము చెప్పి, పాడుటకై యుండగా, దాసునిగొని కవిత్వము చెప్పినావే' అని ఉపకారస్మృతితో ప్రత్యుపకారము జేయదలచి, ఏదియుగానక 'వానికి భోగ్యమైనది తప్ప చేయవలసినది వేరొక్కటిలేదు' అనుకొనిరి. తిరువారన్‌విళై అను దివ్యదేశమునందు పెరియపిరాట్టితో పెరుమాళ్ళు వేంచేసి ఉన్నట్టి పెద్దగోష్ఠిలో తిరువాయ్‌మొళి విన్నపించే కైంకర్యమునకై ఆశపడిరి.

తిరువారన్ విళైయే ప్రాప్యము, ఆ దివ్యదేశమున వేంచేసియున్నట్టి పెరుమాళ్ళే ఉపాయము - అని తమ నిశ్చయమును ప్రకటించినారు. ఈ దివ్యదేశమునందే తమ మనస్సు లగ్నమైనందువల్ల, పరమపదవాసమును సైతము ఆళ్వార్లు ఉపేక్షించినారు.

**'ఎణ్ణిలాప్పెరుమాయనే'** (తి.వా. 7-1-1) అసంఖ్యేయ ఆశ్చర్యభూతగుణ సంపన్నుడా! అని **'గుణంగళ్ కొణ్డ మూర్తియో మూవరాయ్ పడైత్తళిత్తు కెడుక్కుమ్'** (తి.వా. 7-1-11) సత్త్వరజస్తమోగుణములచే స్వీకరింపడిన శరీరములు గల విలక్షణులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురి స్వరూపమై జగత్తును సృష్టించి, రక్షించి, ఉపసంహరించు కున్నవాడై, **'పాలతున్బజ్గళిన్బంగళ్ పడైత్తాయ్'** (తి.వా. 7-2-1) స్థానమును గుర్తెరిగి సుఖదుఃఖములను సృజించినవాడా! అని, **'ఊళితోరూళి యురువుమ్ పేరుమ్శెయ్ కైయుమ్ వేఱవన్ వైయుంకాక్కుమ్'** (తి.వా. 7-3-11) ప్రతికల్పములో వేరు వేరు నామరూపచేష్టితములు గలవాడవై, జగత్తును రక్షించువాడా! అని, 'మాయా వామననే' (తి.వా. 6-8-7) ఆశ్చర్యకార్యములచేసినవాడా! అని, **'ఉళ్ళ ప్పల్ యోగుశెయ్తి'** (తి.వా. 7-8-4) జగద్రక్షణకై అనేకవిధములగు ఉపాయములను జేసినావు అని ఉపాయ కృత్యమునకు గావలసిన అద్భుతశక్తి యోగమును బయల్పరచిరి.

ప్రాప్యప్రాపకములు రెండును తానే అయి, లోకులు చేయుకార్యములు చూచికాని, వారి అసంగత వాక్కులు పట్టించుకొనిగాని వెనుదీయక నిలిచి నిరతిశయా నందయుక్తమును, స్వయత్న సాధ్యము కానిది అయినా శ్రీవైకుంఠమును తన కృప వలననే అనుగ్రహించును. శ్రియఃపతి, 'పుఱ్ఱాముతలా ప్పుల్లెరుమ్బాతి యొన్ఱిన్ఱియే నఱ్ఱాలుక్కుయిత్తనన్' (తి.వా. 7-5-1) గడ్డిమున్నగు వస్తువులను, అల్పమైన చీమలు మున్నగు ప్రాణులను స్థావర జంగమముల నన్నింటిని ఒక్కసాధనానుష్ఠానమూ లేకుండానే మోక్షమును అనుగ్రహించెను అని, **'నాట్టై యళిత్తుయ్యచ్చెయ్తు'** (తి.వా.7-5-2) లోకమును అనుగ్రహించి ఉజ్జీవింపజేసిన స్వామి అనిసాయించారు.

సర్వశక్తిమంతుడైన శ్రియఃపతి తన శ్రీపాదములను ఆళ్వారులు పొందకుండు నట్లు, వాటినుండి వేరు చేయుయంత్రముల మధ్య ఈ శరీరములో ఇంకను బందీచేసినాడే అని వ్యథజెందుచున్నారు **'అన్బురుకి నిఱ్కుమతు నిఱ్కచ్చుమడు తన్దాయ్'** (తి.వా. 7-1-10) ప్రీతిచే కరిగి ఉండతగినట్టి భాగ్యముండగా, ఆ భాగ్యము నివ్వక శరీరమనెడి భారమను ఇచ్చితివి. ఇంద్రియముల ద్వారా నన్ను బాధించు చుంటివి. ఇట్లు స్వామికి మొరపెట్టుకొనుటకుకూడ తాము అశక్తులైనందున, మిక్కిలి దుఃఖితులై పట్టరాని ఉద్వేగముతో పిరాట్టిదశను బొంది, **'కంగులుమ్ పకలుమ్ కణ్డయిలరియాళ్'** - రేయిపగలూ నిద్ర అన్నమాటలేదు గదా! అని, **'శిన్దుక్కుమ్ తిశైక్కుమ్'** అంతటా జూచుచు, ధ్యానించును, మోహించును అని, **'ఆశా చిన్తా స్మృతిః కీర్తిః విలాపో●న్మాద విభ్రమాః, మోహో వ్యాధిః మృతిశ్చేతి వికారాః కామజాః దశ'**



అన్నట్లు అవస్థలకంతులేకుండి పెరుగు దుఃఖాతిశయమును గని, ఈమెను గొనిపోయి పెరుమాళ్ళు శయనించి యున్న శ్రీరంగం కోవిల తలవాకిలి వద్ద పడుకొనబెట్టి తల్లి ప్రార్థించి, మొరబెట్టుకొనుచు, తానే స్వయముగ ఈమె దయనీయ దశను పెరుమాళ్ళకు విన్నపించి, **'తిరువరంగత్తాయ్! ఇవళ్ తిఱత్తెన్ శెయ్కిన్దాయ్' ఓరంగనాథా!** ఈమె విషయములో ఏమి చేయతలంచినావు? అని, **'ఎన్ శెయ్కేనెన్ ఎన్ తిరుమకళుక్కు'** నాకుమార్తె విషయం నేనేమి చేయగలను? అని, **'అన్నైయర్కాళ్! ఎన్నై తేత్తవేణ్డా'** (తి.వా. 7-3-9) ఓ తల్లులారా! నాకు ధైర్యము చెప్పవలదు, అని సాయించిరి.

నాయికా అవస్థలోనున్న నమ్మాళ్వారు, **'కణ్ణపిరానుక్కెన్ పెణ్మై'** (తి.వా. 8-3-5) శ్రీకృష్ణునికై నా స్త్రీత్వమును (లజ్జ, భయములను) పోగొట్టుకొంటిని అని, మనస్సు ఆకర్షింపబడిన వారై పారతంత్ర్యమును వదలుకొనిరి.

ఇట్లు విరహవేదన వలన తొట్రుపడుచున్న వీరికి, ధైర్యము జెప్పుటకు భగవంతుడు తన జయపరంపరను చూపింపగా సంతోషించి, ప్రీతిగల వారగు శ్రీవైష్ణవులతో కలసి, **'కఱ్పారిరామపిరానై యల్లాల్ మత్తుమ్ కఱ్పరో'** (తి.వా.7-5-1) ప్రియమును, హితమును అభ్యసించువారు శ్రీరామచంద్రుని విషయము తప్ప వేరొక్క దానిని అభ్యసింతురా? అని ఇట్లు ఈ భగవద్విషయమును, సంసారులు పోగొట్టుకొను చున్నారే అని దుఃఖమున మునిగిపోయిరి.

పూర్వమువలె, మరల ఆర్తి, త్వర హెచ్చిపోగా, **'శూళవుమ్, తామరైనాణ్మలర్ పోల్ వన్దు తోన్ఱుమ్'** (తి. 7-7-1) అపుడే వికసించిన తామర పుష్పములవలె చుట్టూవచ్చి ఎరుగను అని, **'కణ్ణన్ కోళిణై వాణ్మకమాయ్ కొడియేనుయిర్ కొళ్కిన్ఱతే'** (తి.వా. 7-7-8) తన దివ్యప్రకాశమునే ఆభరణముగా గల ఉజ్జ్వలమైనట్టి శ్రీకృష్ణుని ముఖస్వరూపమై పాపినైన నా ప్రాణమును హరించుచున్నది అనుచున్నారు. అట్లు సర్వేశ్వరుని ముఖావయవశోభ మనస్సులో స్థిరపడి, మరల మరల జ్ఞాపకమునకు వచ్చుచు, ఎక్కడ చూచినను అదే కనిపించుచు బాధించుచుండగా, **'మాయంగళ్ శెయ్తువైత్తి'** (తి.వా. 7-8-5) జ్ఞానులను సైతముసంసారములో నుంచుట అను ఆశ్చర్యములనొనరించి యుంటివి, అనగా అవిద్యాకర్మవాసనారుచులను నిశ్శేషముగా పోగొట్టి నీకు అనన్యార్హశేషభూతునిగా చేసికొనిన పిమ్మట కూడ జన్మమరణా ద్యాశ్చర్యములను గలుగజేసి, నన్ను సంసారములో పడవేసినదెందుకు? అని ఆళ్వారులు అడిగిరి. 'మాకును, మాదాసులకును కాలక్షేపము జరుగుటకు గాను మిమ్ములగొని, తిరువాయ్మొళి గానము చేయుటకుగాను ఈలోకముననే ఉంచి యుంటిమి సుమీ!

అని శ్రియఃపతి నుడివిరి. 'మీ ఉపకారమును కాలతత్త్వమున్నంతవరకు అనుసంధించు కొనినను, తృప్తి కలుగదు' అని ఆళ్వారులు తిరువాయ్‌మొళి గానమును కొనసాగించిరి. గాన, ప్రాప్యముయొక్క అవధి భాగవత పర్యంతమని, ప్రాపకముయొక్క అవధి అర్చావతారుడై సులభుడుగా వేంచేసిఉన్న శ్రియఃపతి అని ఆళ్వారులు సంతోషముతో ప్రకటించుచున్నారు. ఇది ఏడవ పత్తు సారాంశము.

**ఎనిమిదవ పత్తు సారాంశము :**

తమ తిరువాయ్‌మొళి గానముతో నమ్మాళ్వారులు ఆత్మ సమర్పణ చేయగా, శ్రియఃపతి తానొక దుర్లభమైన వస్తువును పొందినట్లు తలచి వీరికి గల ఆత్మగుణముల విషయమున మిక్కిలి ప్రీతి గలవాడై, వీరి మనస్సులోనే యుండి నిరతిశయముగ అనుభవించుచుండిరి. ఇంకను వీరు తాము అయోగ్యులమనుకొని, వెనుదీయకుండు నట్లు ఆత్మస్వరూపముయొక్క వైలక్షణ్యమును ప్రకాశింపజేసిరి. వీరి ఆత్మయొక్క యాథాత్మ్యమును అనుసంధించుకొని, ఇంతకుముందు తాము నిశ్చయించుకొనిన ప్రాప్యప్రాపకములను గురించి తెలిసికొని, సంతోషించినవారికి ప్రాప్యము, ప్రాపకము వేఱువేఱనుకొని రెండు ప్రక్కల మనసును పోనీయకుండ, ప్రాప్యమునందే ఆసక్తికలవారినిగా, ప్రాప్యప్రాకములు రెండును ఒక్కటే అని తెలిసికొను వారినిగా జేయుచున్నారు.

**'తేవిమారావార్ తిరుమకళ్ పూమియేవ మత్తమరరాట్చెయ్‌వార్ మేవి యవులకమ్ మూన్టవై యాట్చి'** (తి.వా. 8-1-1) నీ పట్టమహిషులు శ్రీదేవి, భూదేవి, నీవు నియమింపగా కైంకర్యము చేయువారు, వారితో సమానులైన నిత్యసూరులు, అమరియున్న మూడు లోకములు నీచే పరిపాలింపదగినవి అని, **'పణియావమరర్ పణివుమ్, పణ్బుమ్ తామేయామ్'** (తి.వా. 8-3-6) దేవతాంతరముల నాశ్రయింపని నిత్యసూరుల యొక్క ఆశ్రయమునకును, జ్ఞానాదిగుణములకును తామే విషయమైనట్టి వారై అని సాయించి నట్లు నిత్యములుగా కల్పింపబడిన పత్నీ, పరిజన, స్థాన, భోగ్య, భోగోపకరణములు గలిగియున్నట్టివాడై, సత్యకాముడైన సర్వేశ్వరుడు తాము వీరింగొనిచేయించునట్టి వాచిక కైంకర్యమును మఱచి పోవునట్లుచేసిరి. దీని వలన ఆళ్వారులకు కలవరము, అనుమానమును, లజ్జయును, భయమున్ను కలిగినవి. ఇవి అన్నియు నివర్తించునట్లు, శ్రియఃపతి- పరాశరాదులు, ముదలాళ్వారులు ఉండి యుండగా నమ్మాళ్వారులను గొని వాచిక కైంకర్యమును స్వీకరించినట్టి పూర్వోపకారమును జ్ఞాపకమునకు వచ్చునట్లు చేసిరి. ఇందుకు ప్రత్యుపకారముగా, కృతజ్ఞతగా తమ ఆత్మను సమర్పింపదలచిరి



గాని తమ ఆత్మ, తక్కిన వస్తువులన్నీ స్వామివే అయి ఉన్నపుడు తానేమివ్వగలడు ? అయినను, ఉపకార స్మృతివలన గలిగిన సంతోషమువలన భ్రమించి పోయి, జ్ఞానాధికుడైన జనకచక్రవర్తి మహేశ్వరుని ధనుర్భంగమొనర్చిన శ్రీరామచంద్రుని పరాక్రమమును గనిన సంతోషమువలన మనసు పరవశమై పోయి, పెరుమాళ్ళ అవతారమునకు అనుగుణముగా నవతరించినట్టి సీతాపిరాట్టిని ఆయనకు సహధర్మచారిణిగా సమర్పించినట్లు 'నీ శ్రీపాదములను నాకు పరిపూర్ణముగా ఇచ్చిన గొప్ప ఉపకారమునకు ప్రత్యుపకారముగా నీవు దాసుని ఆత్మను, భుజములను చక్కగా తడివి కౌగలించుకొని ఇచ్చినవాటిని నీకే అగునట్లు సమర్పించితిని' అని ఆళ్వారులు సంతోషాతిశయముతో సాయించిరి.

అట్లు ఆళ్వారులు ఆత్మలాభము వలన కలిగిన సంతోషమున మిక్కిలి పరవశులై పోయి, పలు విధముల స్వామిని స్తోత్రము చేసి, సీతాపిరాట్టి కల్యాణము తరువాత, జన్మభూమియైన మిథిలను విడిచినట్లు, వీరు సాంసారిక సంబంధములను విడిచిరి. **'ఆద్వార మనువవ్రాజ మంగళాన్యభిదధ్యుషీ'** - మంగళ వాక్యములను చెప్పుచూ సీతాపిరాట్టి గడపవరకు వెళ్ళెను అన్నట్లు ఆళ్వారులుకూడ **'ఆళుమాళారాళియుంశంగు మప్పార్ తామ్'** (తి.వా. 8-3-3) భూలోకమున అవతరించినప్పుడు కైంకర్య మొనర్చువారు లేక తన శంఖుచక్రములను తానే మోసుకొని పోయెను- అని స్వామి సౌకుమార్యమును జూచి భయపడి, సీతాపిరాట్టి పెరుమాళ్ళయొక్క శౌర్యాదుల తలంచుకొని భయము వీడి, **'తుల్యశీలః'** అను తావున సాయించినట్లు, తనకు తగియున్న వారగు పెరుమాళ్ళతో కలిసి యుండి అనుభవించినట్లు, వీరును **'వార్కడావరువి'** అని ఆరంభించి స్వామి శౌర్యాదులనను సంధించుకొని, నిర్భయులైరి.

**'అమర్న్దు మాయోనై ముక్కణమ్మానై నాన్ముకనై యమర్న్దేనే'** (తి.వా.8-4-10) అమరికతో వేంచేసి ఉన్న ఆశ్చర్యభూతుడును, త్రినేత్రుడైన రుద్రునికి అంతర్యామి యును, బ్రహ్మకంతర్యామియునైన శ్రియఃపతిని పొందితిని - అన్నట్లు, వానితో కలిసి మెలిసి అనుభవించి, పెరుమాళ్ళను విడిచియున్నపుడు దుఃఖపరంపరచే పీడింపబడినదై సీతాపిరాట్టి మంచుచే చెదిరిన తామరపూవులెనే కాంతినంతా కోల్పోయినదై మిక్కిలి అధైర్యపడియుండెను. అనగా - రోమరోమమున దయ యన్నదే లేనివారికి సైతము దయకలుగజేయుదశను పొందినట్లు, నమ్మాళ్వారులకు కూడ, **'కాణవారాయెన్రెన్రు కణ్ణుమ్, వాయుమ్ తువర్న్దు'** - ఓస్వామీ! సేవ సాయింపుమా! అని చెప్పి చెప్పి కళ్ళు,వాక్కు శుష్కించి పోయినవి. సీతాదేవి గుణములను గని, ఆమె

విషయమున శ్రీరాముని ప్రీతి అతిశయించినట్లు, వీరి విషయమునను స్వామి ప్రీతి వృద్ధి పొందినది. దరిద్రునకు ధనముదొరికినట్లయితే, దానివంకనే చూచుచుండునట్లు, వీరి లభించినందువలన గలిగిన ప్రీతివలన రెప్పవాల్చకుండ చూచుచుండి, ఆమెచే మానుషసుఖములను గాకుండ దివ్యములగు భోగములను అనుభవింపజేసినట్లు, వీరినికూడ **'తరున్దానరుళ్ తానిని యానఱియేన్'** (తి.వా. 8-7-2) - గజేంద్రుని కొనరించినట్టి అనుగ్రహమును ఇక మీద నేను ఒక గొప్ప విషయముగా అనుకొనను అని, **"శెవ్వాయ్మురువ లోడెనత్తుళ్ళత్తిరున్ద వవ్వాయున్టి యానఱియేన్ మత్తరుళే"** (తి.వా. 8-7-7) ఎఱ్ఱని అధరముమీద విలసిల్లుచున్న మందహాసముతో గూడ నా హృదయమందు వేంచేసి ఉన్నట్టి విధమును తప్ప వేరొక విధమునెరుగను అని ఇట్లు సంతోషముతో మాట్లాడునట్లు అప్రాకృత భోగములననుభవింపజేసినాడు.

అయినను, ఆళ్వారులు ఇక మూడు తిరువాయ్మొళులలో అయోగ్యతాను సంధానమే చేయుదురు. **'మరుళ్తానీతో'** (తి.వా. 8-7-3) - ఇది నాభ్రమా? అని **'పిన్నైయార్కవన్నై కొడుక్కుమ్'** (తి.వా. 8-7-6) అటుపిమ్మట వానిని మరెవ్వరి కిచ్చును? **'అరుళ్ తానిని యానరియేన్'** (తి.వా. 8-7-3) అనుగ్రహమును గూడ నేను ఇప్పుడు గొప్పదిగా నెంచను అని అనుసంధింతురు. **'శిరియేనుడైచ్చిన్దైయుళ్ నిన్టొళిన్దార్'** (తి.వా. 8-7-8) అయినా, అతిక్షుద్రుడనైన నా హృదయకుహరమునందు వేంచేసి యుండెనుగదా! అని తన తక్కువ స్థితిని స్మరింతురు. ఇట్లు మూడు తడవులు వీరి తలపు లోనికి వచ్చి పోయిన ఈ అయోగ్యతాను సంధానరూపమగు వ్యాధి మరల వీరి స్మృతికి వచ్చి, వీరిని వెనుదీయునట్లు చేసినట్లయిన ఏమి చేయవలయునని భయపడి, అట్టి తలపు మరల వీరి మనస్సుకు రాకుండుటకు గాను, 'నాకు కౌస్తుభమణి వలెను, లక్ష్మీదేవివలెనున్ను మిక్కిలి తేజస్కమైనదియు, భోగ్యమైనదియునై నా కంటె వేరయినది కానట్టి నాయొక్క గుణముగాను కదా మీ ఆత్మ ఉండగలదు అని స్వామి ఆత్మయొక్క వైలక్షణ్యమును విశదముచేసిరి. **'యానున్దా నాయొళిన్దాన్'** (తి.వా. 8-7-4) నేను తనకు శేషభూతుడనను జ్ఞానమును కలుగజేసినవాడు అని, **'తేనుమాలుమ్ కన్నలు మముతుమాకి తిత్తిత్తు'** (తి.వా. 8-8-4) తేనెవలెను, పాలవలెను కలకండవలెను, అమృతమువలెను భోగ్యముగానుండి అని, తననుండి వేరుగా నుండనిది అని, నిరతిశయభోగ్యమైనదని సాయించిరి.

**'శెన్తు శెన్తు పరమ్పరమాయ్'** (తి.వా. 8-8-7) అన్నమయాది పంచకోశములను క్రమముగా పరీక్షించి పైకి పోయి అన్నట్లు, దేహేంద్రియాదులకంటెను విలక్షణమై,



జ్ఞానానందమయమై పిరాట్టి వలెనే అనన్యార్హమై, అంత మాత్రమే గాకుండ **'....నీక్కమిల్లావడియార్ తమ్మడియార్.... గోక్కళవర్కే ......'** (తి.వా. 8-10-10) నా స్వామిని విశ్లేషింపని దాసులు, దాసానుదాసులు, వారి దాసులు మనకు స్వాములు. వారికే దాసులమై ప్రవర్తించు ఉత్తమ పురుషార్థము నాకు ఎల్లప్పుడును కలుగుగాక ! అనగా, భగవద్విషయమునను, భాగవతుల విషయమునను, ఇట్లు ఉభయత్రమనస్సు కలవాడను కాకుండ, భగవద్దాసానుదాసుల వరకును శేషత్వమును కోరియుండునంత పరతంత్రమైనట్టి స్వరూపమును ఆళ్వారులు అనుసంధించుకొనుచున్నారు. కోరుకొనుచున్నారు.

అట్లు మన పరతంత్రస్వరూపము నిలువవలెననిన, దుఃఖములన్నింటిని నశింపజేయుతిరుక్కడితానమను దివ్యదేశమును మనస్సులో నిలుపుకొని అనుసంధించు కొనవలసినదని, బోధించుచున్నారు. ఇట్లు మనలను ప్రాప్యమును, ప్రాపకమును ఒక్కటియే అనెడి నిశ్చయముగల వారినిగా తీర్చి దిద్దుచున్నారు. ఇది తిరువాయ్మొళి ఎనిమిదవ పత్తు సారాంశము. ఇక తొమ్మిదవ, పదవ పత్తుల సారాంశమును మనము గ్రహించవలసియున్నది.



# పదహారవ అధ్యాయము
# తొమ్మిదవ పత్తు సారాంశము

శ్రియఃపతి అవాప్తసమస్త కాముడగుటచే చేతనుని నుండి ఏ ఒక్కటీ అపేక్షింపక, ప్రళయాద్యవస్థలలో సహాయపడి రక్షించునట్టి ఆపత్సఖుడగును. ఎనిమిదవ పదియందు ప్రకాశింపజేసిన ఆత్మ దర్శనమునకు ఫలము స్వరూపానురూపమైన ప్రాప్యమును అనుభవించుటలో గల త్వర వలన క్షణకాలమైనా ఆలస్యమును సహింపజాలరైరి. అట్లు ఆర్తులైనట్టి తమకు ప్రారబ్ధశరీరావసానమున ప్రాప్యము లభింపగలదని గడువు విధించిరి. ఆళ్వారులు తమ ఉపదేశముచే దిద్దుబాటు అయినట్టి వారినే గాక, తక్కిన వారినిన్ని విడువజాలనట్టి వరమకృపామూర్తులగుటవలన వారి వారి యోగ్యతలకనుగుణముగ సర్వోపాయములను తెలుపుచున్నారు.

**'ఎణ్ణిశైయుమ్ కీళుమ్ మేలుమ్ ముత్తవు ముణ్డపిరాన్'** (తి.వా.9-1-1) అష్టదిక్కులందును, అథోలోకములందును, ఊర్ధ్వలోకములందును, సమస్త ప్రాణులను తన యందుంచుకొని రక్షించినట్టి ఉపకారకుడు అని, **'అవనే యకల్ ఞాలప్పడైత్తిడన్దాన్ అవనేయతుణ్డుమిళిన్దానళన్దాన్'** (తి.వా. 9-3-2) విశాలమైన భూమిని సృజించి ప్రళయమునందు పాతాళలోకములో నుండి విడదీసినవాడు ఆ శ్రీమన్నారాయణుడే. వాడే ప్రళయమునందు భూమిని మ్రింగి సృష్టికాలమునందు బయలు పరచెను, మహాబలినుండి తీసికొలిచెను అని, ఆ శ్రియఃపతి ఆపత్సఖత్వమును, సత్యకామత్వమును, నిరపేక్షత్వమును కొనియాడిరి.

**'ఇడుత్తుమ్ వియన్దు'** అను తిరువాయ్‌మొళిలో తమతో గలిసి ఉన్నట్టి స్థితిని స్మరింపజేయగా సంతోషించిన వారై సంభాషించునప్పుడు సర్వేశ్వరుడు శేషశేషి భావక్రమము తప్పి ప్రవర్తించినట్టి స్వభావమునందు ప్రీతి గలిగి **'ఆరుయర్ పట్ట తెనతుయర్ పట్టతు'** అను తావున నిత్యానుభవముగల నిత్యసూరుల స్వరూపమును నా ఆత్మ బొందినదా? అని **'శోతివాయ్ తిఱన్దున్ తామరైక్కణ్గళాల్ నోక్కాయ్'** (తి.వా. 9-2-1) ఉజ్వలమైన నోరు తెరచి ఒక మాట చెప్పి, పద్మములవంటి నేత్రములతో కటాక్షింపుము అని **'పాదపంకయమే తలైక్కణియాయ్'** నీ పాదారవిందములను నా శిరముపై నుంచుమా! అని, **'ఉన్ తామరై మంగైయుమ్ నీయుం ఇడంకొళ్ మూవులకన్దొళు విరున్దరుళాయ్'** (తి.వా.9-2-3) కమల వాసిని యైన నీ పిరాట్టి, నీవు విశాలములైన మూడు లోకములును ఆశ్రయించునట్లు వేంచేసి ఉండుడు- అని మీ



గోష్ఠిని సేవించునట్లు నాకు కృపచేయవలెను, నీకు ఇష్టులైన వారిని నీవు చూచినపుడు నీవు చేయు మందహాసమును దాసుడు సేవింపవలెను - అని ఈ విధమున అనేక విధములుగ పొందుటకు తాళిఉండజాలక **'కూవుతల్ వరుతల్ శెయ్యాయ్'** ఓ భగవంతుడా ! నీవైనా నా వద్దకు రా! లేదా నన్నైనా నీ వద్దకు చేర్చుకో! ఎలాగైనా చేయి! అని ఆళ్వారులు మొరపెట్టుకొనిరి.

**'మాక వైకుందమ్ కాణ్బతఱ్కె న్మనమేక మెణ్ణు మిరాప్పకలిన్ఱియే'** (తి.వా. 9-3-7) పరమాకాశమున నున్న శ్రీవైకుంఠమును చూచుటకు నా మనస్సు రేయింబగళ్ళు ఎడతెగకుండ ఏకరీతిగా ధ్యానించును అని, **'కాణక్కురుతు మెన్ కణ్ణే'** (తి.వా. 9-4-1) నిన్ను సేవించుటకై నా నేత్రములాశపడుచున్నవి అని, శ్రియఃపతిని జ్ఞాపకమునకు దెచ్చు పదార్థములను జూచి కష్టపడుటచే శిథిలమై పోవుచున్నందున బాధపడి, **'తిరుక్కాట్కరై మరువియమాయప్పన్ మాయా నినైతోరుమ్ నెంజమ్ ఉరుకుమార్'** (తి.వా.9-9-1) తిరుక్కాట్కరై అను దివ్యదేశమునందు అమరివేంచేసి యున్నట్టి ఆశ్చర్య భూతుడైన శ్రియఃపతి యొక్క మాయా చేష్టితములను తలచుకొనినప్పుడు మనస్సుకరిగిపోవుచున్నది.

**'తమరోడఙ్గరై వార్కు త్తక్కిలమే కేళీరే'** (తి.వా. 9-7-2) అచట తమభక్తులతో కలిసి యుండువారికి మేము తగినవారము కామా ? అని అడుగవలసినది అని చెప్పి దూతను పంపించుటచే, **'కళిమొళియా శలత్తరియశౌల్'** అని ధరించి ఉండజాలనందున క్రమముతప్పి శ్రియఃపతిని పిలిచి, మొరపెట్టుకొని, **'కనైయిల్ మనమిన్టి క్కణ్ణనీర్కళ్ కలుళ్వన్'** (తి.వా. 9-8-3) ఎల్లప్పుడును ఏకాగ్రచిత్తుడనై కన్నీరు కార్చుచుందును అనగా రెండు ప్రక్కలా వ్యాపించు మనస్సు కలవారు కాకుండా ఏకాగ్రచిత్తులైరి.

పెరుమాళ్ళను విడిచిపెట్టి పదునాల్గు వర్షములు ప్రాణములను ధరించిఉన్న శ్రీభరతాళ్వానులు, ఆ అవధి పూర్తి అయిన తోడనే ఒక రోజు పడిన కష్టమును, పదినెలలు సహించిన సీతా పిరాట్టి **'మాసాదూర్ధ్వం న జీవిష్యే'** అని హనుమతో సమాచారమును పంపిన పిమ్మట ఆమాసం రోజులలో పడిన కష్టమును, శ్రీకృష్ణుడు పశువులను కాచుటకై అడవికి పోయినపుడు పగలంతా సహించి ఉన్న గోపికలు వాడు గోవులకు వెనుక ప్రక్కవచ్చుచుండగా, వానిని ముందు ప్రక్కన చూడనందున ఒక సాయంత్రం పడినట్టి కష్టమంతా ఒక క్షణములో పడినట్లు వానిని విడిచి క్షణకాలమైనా సహించి ఉండజాలనంత ప్రీతి పరవశులనుగా జేసిన వారి ఆర్తికి ఫలమేమి?

**'ఇనిప్పత్తిలొన్ట దశమదశైయిలే పేరెన్టు'** అనగా, **'నయనప్రీతిః ప్రథమం చిన్తా భోగస్తతోనుసంకల్పః నిద్రా చ్ఛేదస్తనుతా విషయవిరక్తి స్త్రపానాశః ఉన్మాదో మూర్ఛామరణమిత్యేతా స్మరదశా దశైవస్యుః'** అని, **'ప్రథమంత్వభిలాష స్స్యా, ద్వితీయం చిన్తనం భవేత్, అనుస్మృతి స్మృతీయస్తు, చతుర్థం గుణకీర్తనం, ఉద్యోగః పంచమః ప్రోక్తః ప్రలాపః షష్ఠ ఉచ్యతే, ఉన్మాదస్సప్తమో జ్ఞేయః, అష్టమో వ్యాధిరుచ్యతే, నవమే జడతాచైవ, దశమం మరణం తథా'** అనీ చెప్పియున్నట్లు కాముకులకు దశమావస్థ యందు మరణము కలుగునట్లు మా విషయమున పరమభక్తి గల మీకు కూడ మమ్మ్మలను పొందక పోయినట్లైన, మృతి పొందునట్లుచేయునట్టి పరమభక్తిదశ అంతిమపదిలో గలుగవలసి ఉన్నది కావున నింతకు ముందు చెప్పిన ఆలస్యము లేదు, ఇక కానున్నది పదిలో నొక్కటి యగు మరణావస్థయందే ఫలము!

నమ్మాళ్వారులకు దినము గడచుట సముద్రమును దాటినట్లున్నది. స్వామితో విరహావేదనను భరించలేక మరణమే శరణమని, అదియే తమ ఆర్తికి ఫలమని తలచిరి. శ్రీభరతులవారికి దీర్ఘకాలావధిని ఏర్పరచి ఇచ్చినట్లు కాకుండ **'నాళై వతువై మణమెన్టు నాళిట్టు'** రేపటి దినమున వివాహము చేసికొనెదను- ఈరోజే అంటే అత్యానంద పరవశయై కష్టపడును, పోనీ, కొన్నిదినాల తర్వాతంటే, అమ్మో అన్ని రోజులా అని ఓర్వలేక కష్టపడును అని తలచి, రేపటిదినమే అని చెప్పి ఆండాళుకు ఒకరోజు గడువుపెట్టినట్లు, **'మరణ మానాల్'** అను తావున ప్రారబ్ధశరీరావసానమున ఫలము కలుగునని వాడే ఒక గడువును ఏర్పాటుచేయగా ఆళ్వారులు సంతోషించిరి.

తనకు స్వామి విధించిన గడువులోపుగా, జ్ఞానశూన్యులైన సంసారులకు చరమోపాయోపేయపర్యంతము హితోపదేశము చేసిరి, **'కొండపెండీర్'** అని ఆరంభించి, భార్యాపుత్రులు ఎదురుగా ఉన్నప్పుడు ప్రేమింతురే గాని, పరోక్షమున ప్రేమింపరుగాన వారు అ బంధువులనీ, ప్రళయకాల రూపమగు ఆపత్తునందును మనలను విడనాడని వాడగు ఆ స్వామియే పరమబంధువని, రక్షకుడని సాయించిరి. తమకు భోగ్యులైనటు వంటివారనుకొని చేబట్టిన స్త్రీలు మనకు ఆపత్తు వచ్చినపుడు మనలనుపేక్షింతురు గాన వారు భోగ్యులు కారు. వాడే నిరతిశయ భోగ్యుడు. ఎప్పటికీ మనలను ఒకే విధముగ ప్రేమించువాడు మన స్వామియే!

**'ఇల్లై కండీరిన్బమ్'** (తి.వా. 9-1-9) వాస్తముగా వాడు తప్ప సుఖరూపముగా నుండునది ఒక్కటియును లేదు అని చెప్పి ఈ ఆత్మ ఉన్నంతవరకు ఉండవలసిన గుణానుభవమునకు తగినట్టి సిద్ధోపాయము భగవానుడే అని చాటిచెప్పిరి.



ఉపాయాంతర పరిత్యాగ పూర్వకమగు సిద్ధోపాయమును స్వీకరించు విషయమున నమ్మకము లేని బుద్ధి దౌర్బల్యము గలవారికి, **'మాలైనణ్ణి త్తొళుతెళుమినో'** (తి.వా.9-10-1) భక్తిని కలుగజేసుకొని ఆశ్రయించి ఉజ్జీవింపుడు అని సాంగమగు భక్తిని, దానికి శక్తిలేనివారికి **'శరణమాకుమ్ తన తాళడైన్దార్కెల్లామ్, మరణమానాల్ వైకున్దమ్ కొడుక్కుమ్'** (తి.వా. 9-10-5) తన శ్రీపాదములను ఉపాయమని తలచి ఆశ్రయించినవారికి రక్షకుడు, మృతినొందినప్పుడు పరమపదము నిచ్చువాడును అని ప్రపత్తిని, దానికిని శక్తిలేనివారికి, 'తిరుక్కణ్ణపురము'న (తి.వా. 9-10-10) భగవన్నామానుసంధానముచేయుడని, దీనికీ శక్తిలేనివారికి, **'ఇప్పత్తుమ్ పాడియాడి ప్పణిమినవన్ తాళ్కళైయే'** (తి.వా. 9-10-11) ఈ పది పాశురములను గానము చేసి, నృత్యము చేసి ఆశ్రియఃపతి శ్రీపాదములను ఆశ్రయింపుడు అని, భగవద్గీత నుపదేశించినట్టి, శ్రీకృష్ణునివలెనే వారివారి అధికారానుగుణముగ మోక్షోపాయము లన్నింటిని ఈ తొమ్మిదవ పదిలోనుపదేశించిరి.



# పదిహేడవ అధ్యాయము
# పదవపత్తు సారాంశము

నమ్మాళ్వారుల ఆర్తికి, త్వరకు అనుగుణముగ గడువుపెట్టి ఇచ్చినందుకు ఫలము అర్చిరాది మార్గమున విలక్షణదేశమునకు పోవుటయే గాన, అందుకాప్తుడగు భగవంతుని తోడుగా గొని, ఫలమును పొందుటలో సంశయము లేదని నిశ్చయించు కొనిన వీరు ఇంతకు ముందు దాగియున్న అర్థములనన్నింటిని బయలుపరచు కాలము రాగానే, మొదట ఉపదేశార్హమైన తమ మనస్సుకు కృత్యాకృత్యములను విధించిరి. వీనికి తగిన శ్రీవైష్ణవులకు కర్తవ్యాదులను బోధించిరి. మొదట భక్తియోగమును జెప్పి, సంసారులకు సులభమగు ఆశ్రయణమునుపదేశించిరి. అట్లు గుణానుభవ కైంకర్యము లలో నున్న వీరికి శీలగుణరూపమగు ఆధారమునుకూడ చూపెట్టిరి.

ఆళ్వారుల పట్ల ప్రీతివలన వారి శరీరమునందెక్కువ వ్యామోహము గల శ్రియః పతికి ఆశరీరమున దోషములను తెలిపి, అప్పుడు తమకు పరతంత్రుడై తమను పరమపదమునకు గొనిపోవుటకు ఎక్కువ ఆదరము చూపువానిని, అనాది కాలముగ తమను సంసారమునందు పడద్రోసి ఉపేక్షించుటకు కారణమేమని అడిగిరి. జితేంద్రియత్వాదులు అందుకు ఆవశ్యములుకదాయని ఒకవేళ శ్రియఃపతి చెప్పినచో, 'అవికూడ మీ అధీనములేకదా స్వామీ!' అని సర్వజ్ఞులగు వీరు సమాధానము చెప్పుదురని తలచి స్వామి మారుమటాడలేదు!

ఆళ్వారులకు శ్రియఃపతి అర్చిరాది మార్గమున, అచటి వారు జేయు సత్కారము లను, ఆమార్గమున బోయి లభించునట్టి ఫలమును, శ్రీచరణకమల ప్రాప్తి పర్యంతము చూపింపగా, దానిని సాక్షాత్కరించిరి. అయితే అది మానసానుభవ మాత్రమై చక్షురాది బాహ్యేంద్రియములకు తెలియునది కాకపోవుట వలన, దానిని ప్రత్యక్షముగా పొందవలెనని ఆతురపడిరి. స్వామి కాదనుటకు వీలులేకుండ శపథమునుంచిరి. ఆ శపథము వ్యర్థము గాకుండ, కారణములను తెలుపుచు, తమ పరమభక్తి అంతయు గోష్పాదమగునట్లు వాడే స్వయముగ అభినివేశముతో వచ్చి, తమ తాపమును పోగొట్టిన విధమును ఈ పదవ పదిలో తెలుపుచున్నారు.

**పునల్‌మై నిన్టవరై పోలుమ్ తిరువురువమ్'** (తి.వా. 10-6-8) సముద్రజలమువలె, కాటుకవలె, నిలిచిఉన్న పర్వతమువలె ఉన్న దివ్యమంగళ విగ్రహుడై అని, **'పొల్లాక్కని వాయ్ తామరైక్కణ్ కరుమాణిక్కమ్'** (తి.వా. 10-10-10) పండువంటి ఎర్రని



అధరములు గల వాడును, పద్మములవంటి నేత్రములుగలవాడును, నీలమణి వంటి శరీరము గలవాడును అని, అన్యోన్యవిలక్షణమై, అతిమనోహరమై, అనుభవించువారికి ప్రత్యేక ప్రత్యేకముగా, పైపైగా ఆశకలిగించు అవయవశోభతో నున్నవానికి, సకలశ్రమహరమైన **'కామరూపం గొణ్డెళున్దళిప్పాన్'** (తి.వా. 10-1-10) అనురూపమైన మోహనావతారమెత్తి వేంచేసి రక్షించినట్టి శ్రియఃపతి అని పాయించిరి.

ఆపై అర్చిరాది మార్గమున పరమపదమునకు గొని పోవుటకు గాను లోకము లను కొలుచుట అను వ్యాజ్యమున ముందువెళ్ళి తాను పాదము పెట్టిన తావులన్నింటిలో నీడను, తటాకములను ఏర్పరచి, దివ్యగుణామృతమును వర్షించును. ఇంకను **'తశరతన్ పెత్తు మరకతమణిత్తడమ్'** (తి.వా. 10-2-8) దశరథ చక్రవర్తి కనినట్టి మరకతమణి వలె అతిసుందరమైన తటాకమువంటివాడు అయిన శ్రీరామచంద్రుని అని, **'కూత్తన్ కోవలన్'** (తి.వా. 10-1-6) కుంభనృత్యము చేసిన గోపాలుడు అని పాయించి రామకృష్ణాద్యవతారములెత్తినవాడై, పిరాట్టియు, లక్ష్మణ స్వామియు చూచుచుండగా (వారిపురుషకార పూర్వకముగ) 'ప్రియమైన మిత్రుడా! అని పిలిచి, అంగీకరింప బడిన శ్రీగుహదేవుడు, తన విశేషకటాక్షమువలన పవిత్రులుగా జేయబడిన శబరి, పిరాట్టికై ప్రాణములను కోల్పోయి, పరమపదము ప్రసాదింపబడిన శ్రీజటాయువు, **'సుగ్రీవం నాథ మిచ్ఛతి'** అని భగవంతుడు తానే స్వయముగా పోయి అంగీకరించిన వానరాధిపతి అగు సుగ్రీవుడు, వాని వానరపరివారము, తనతో కలిసి ఉండుటే సుఖముగా, తనను వదలి ఉండుటే దుఃఖముగా నెంచిన అయోధ్యలోనుండు చరాచరములు, దివ్యమంగళ విగ్రహవైలక్షణ్యమునే ఉపాయముగా స్వీకరించి పరమపదవాసమును పొందిన చింతయంతి, కృష్ణుడే వెన్నను దొంగలించుచుండగా జూచి, వెన్నంటి, ఇంటిలోపెట్టి తలుపువేసి, 'మోక్ష'ము నీయక పోతివేని దొంగతనము గుట్టు రట్టు చేసెదనని బెదరించి మోక్షమును పొందిన దధిభాండుడు, పైగా, నామరూపములు గల ఒక్కొక్క పదార్థములోను ఒక్కొక్క ఆత్మ ఉన్నదిగాన, దీనిలోని ఆత్మకు కూడ మోక్షమివ్వమని నిర్బంధించుటచే, మోక్ష మివ్వబడిన దధిభాండము **"సుగంధమే తద్రాజార్హం రుచిరం రుచిరాననే ఆవయోర్గాత్ర సదృశం దీయతామను లేపనమ్"** అని శ్రీకృష్ణుడు చందనముకోరగా, అనన్య ప్రయోజనముగా ఇచ్చి, విశేష కటాక్షమునకు పాత్రమైన గూని (కుబ్జ) యు, అట్లే, పుష్పములను సమర్పించిన మాలాకారుడు, ఘంటాకర్ణుడు, భక్తిపూర్వకముగ మనోహరములగు భక్ష్యములను గొని వచ్చి కృష్ణునకు సమర్పించిన ఋషి పత్నులు, శ్రీప్రహ్లాదుడు, శ్రీవిభీషణులవారు, శ్రీగజేంద్రుడు, శ్రీగరుత్మంతునికి భయపడివచ్చి, భగవంతుని శ్రీపాదములను

శరణుజొచ్చిన సుముఖుడు కృష్ణావతారమున భగవంతుని దివ్యచేష్టితాదులను సాక్షాత్కరింపగోరినవాడై తపస్సు చేసినందున స్వామి వాటినన్నిటిని దర్శింపజేయగా, అనుభవించి నిత్యానుభవమును (మోక్షమును) అపేక్షించినట్టి గోవిందస్వామి, మార్కండేయుడు నానా జాతులవారు అయిన పదునెనిమిది మంది పెద్దగోష్ఠిని అర్చిరాది మార్గమున తానే మార్గదర్శిగా నుండి తోడ్కొని పోవువాడై, తిరుమోకూరను దివ్యదేశమునందు వేంచేసియున్న పరమాప్తుడైన కాలమేఘ పెరుమాళ్ళను దారితోడుగా స్వీకరించెను.

**'నాముమక్కఱియచ్చొన్నే నాళ్కళుమ్ సణియనాన'** (తి.వా. 10-2-9) మేము మీకు తెలియజెప్పిన దినములు దగ్గర పడినవి అని, భగవత్ప్రాప్తి సమీపించినతోడనే మంచిగ తెల్లవారిన రోజున **(సుప్రభాతా చ మే నిశా)** సహాయ భూతుడగు శ్రియః పతిని విడనాడకుండ, **'పశుమేయ్క్క పోకేల్'** (తి.వా. 10-3-9) ఓస్వామీ ! ఆవులను మేపుటకు పోవలదు అని, **'ఎన్ కైకళియేల్'** (తి.వా. 10-3-8) నన్ను విడిచి పోవలదు అని పోకుండ అడ్డుపెట్టి ఇట్లు సాయించుచున్నారు. **'మీళ్కిన్ఱతిల్లై ప్పిఱవిత్తుయర్ కడిన్దోమ్'** (తి.వా. 10-4-3) సంసారదుఃఖమును పోగొట్టుకొన్నాము. ఆ దుఃఖమింక రాదు. **'నిలై పేర్కలాకామై నిచ్చిత్తిరున్దేనే'** (తి.వా. 10-4-4) నా హృదయ స్థైర్యము సడలకుండ, నిశ్చయముగా నుండి కృతకృత్యుడనైతిని- అని సాయించిరి.

మరణ కాలము సమీపించినంతనే, సంపాదించి రహస్యముగా దాచి ఉంచిన ధనమును పుత్రాదులకు చూపించువారి వలెనే, తమకు భగవత్ ప్రాప్తి సమీపించినంతనే ఒక్కరును దుఃఖపడకూడదని, అందరికి హితాహితములు తెలుపవలెనని తలంచిరి. **'తొళుతెళ మననే'** - ఓమనసా! శ్రియఃపతికి దండము సమర్పింపుమా! అని తొలుతనే ఉపదేశించిరి. తమ కంటె ముందుగ భగవద్విషయము వైపు పరుగెత్తుచున్న తమ మనస్సుతో, **'పణి నెంజే నాళుమ్ పరంపరనై'** (తి.వా. 10-4-7) ఓ నా మనసా! మరువకుండ నిత్యానుభవము జేయుమా! ఈ అనుభవము నిత్యముగా నుండుగాక! అని, **'నరకత్తై నకు నెంజే'** (తి.వా. 10-6-5) ఓ మనసా! నరకమును పరిహసింపుమా! అని, **'వాళి మననమే కైవిళేల్'** (తి.వా. 10-7-9) ఓ మనసా! తిరుమాలిరుంశోలై దివ్యదేశమును విడువకుమా! నీకు మంగళమగు గాక! అని విషయాంతరముల ఎడల ప్రవర్తించినట్లు భగవద్విషయమునకూడ ప్రవర్తింపకుమా! అనుచున్నారు. నేను పరమ పదమునకు పోవుచున్నాను. చిరకాలముగ మనలను నీచస్థితి లోనుంచి బాధపెట్టినట్టి సంసారము వైపు చూచి పరిహసించుచు పొమ్ము! మనకు ఈ సంపద అంతయు



తిరుమల వలన గలిగినదేగదా! అట్టి తిరుమలను ఎన్నడును విడనాడకుము. అని ఈ విధమున కృత్యాకృత్యములను అవశ్యముగ ఆచరింపవలసిన వాటిని విధించు చున్నారు.

తన మనస్సువలెనే, అంతరంగులైన శ్రీవైష్ణవులను, **'తొణ్డీర్! వమ్మిన్'** (తి.వా. 10-1-5) ఓ స్వాములారా! రండీ! అని భగవద్విషయము నందాశ కలవారిని పిలిచి, **'కొణ్డకోయిలై వలంశెయ్‌తింగాడుతుమ్ కూత్తే'** (తి.వా. 10-1-5) తనకు నివాసముగా అంగీకరించినట్టి కోవిలకు ప్రదక్షిణము చేసి ఈ లోకములో నృత్యము చేసెదము ఓ భక్తులారా! రండి! ఇట్లు దివ్యదేశమున కైంకర్యము జేసి సంతోషించుటకు గాను రావలసినది అనుటచే మన కర్తవ్యమును, **'ఎణ్ణుమినెన్దైనామమ్'** (తి.వా.10-2-4) నాస్వామి యొక్క తిరునామమును అనుసంధించుడు అని చెప్పుటచే స్మర్తవ్యమును చెప్పిరి. ఇంకను, వక్తవ్యమును, శ్రోతవ్యమును, ద్రష్టవ్య, గంతవ్య, వస్తవ్యములను చెప్పుదురు.

ఇంతవరకు శ్రీవైష్ణవుల కర్తవ్యమును, స్మర్తవ్యమును ఎరుకపరచిన నమ్మాళ్వారులు వారి వక్తవ్యాదులను వివరించుచున్నారు. **'పేశుమిన్ కూశమిన్ఱి'** (తి.వా. 10-2-4) సంకోచము లేకుండ చెప్పండి! అనగా మీ అయోగ్యతను తలచుకొని సంకోచపడకుండ తిరువనందపురమున ప్రీతితో వేంచేసియున్నట్టి పెరుమాళ్ళను గురించి చెప్పవలసినది అనుటచే వక్తవ్యమును, **'నమర్ కళో శొల్ల క్కేణ్మిన్'** (తి.వా. 10-2-6) ఓ మా బంధువులారా! చెప్పెడి మాటను వినుడు! అని శ్రోతవ్యమును **'పడముడై అరవిల్ పళ్ళిపయిన్ఱవన్ పాతంకాణ నడమినో'** (తి.వా. 10-2-8) ఫణములు గల ఆదిశేషునిమీద ప్రీతితో పవ్వళించిన వాని శ్రీపాదములను సేవించుటకై రావలసినది అనుటచే ద్రష్టవ్య, గంతవ్యములను, **'అనన్దపురనకర్ పుకుతు మిన్టే'** (తి.వా. 10-2-1) తిరువనంద పురమను మహానగరమును ఇప్పుడే ప్రవేశించండి అనుటచే వస్తవ్యమును తెలియ పరచిరి. **'శార్వే తవ నెరుక్కి తామోదరన్ తాళ్‌గళ్'** (తి.వా. 10-4-1) దామోదరుని శ్రీపాదములు భక్తి మార్గమున ప్రాప్యములు అని తమ నిశ్చయజ్ఞానమును వెలిబుచ్చిరి.

శ్రీమదష్టాక్షరీ ద్వయమంత్రములను త్రికరణశుద్ధిగ అనుసంధించమని, **'శెంజొల్కవికాళ్'** అనుదశకమున భగవద్గుణానుభవములతో, కైంకర్యముతో కాలక్షేపము చేయమని ఉపదేశించిరి.

భోగ్యముగ కవిత్వము చెప్పువారిని చెడుమార్గమున పోకుండజేసి, మనస్సును దిద్దుబాటుచేసి, పరమపదమును చక్కచేయుటకై పోయిరి. తిరిగి లోకమంతయు

దిద్దుబాటగు లోపుగా విచ్చేసి, పరమపదము నీయబూని, వీరిని లోకమందుంచినట్టి కార్యము సుసంపన్నమైన వెంటనే వీరికెదురుగా నిలిచి, వీరిని పరమపదమునకు గొని పోవుటకై త్వరపడిరి. వీరిది చరమశరీరమగుట వలన, తమ శరీరమందు తమకు గల ప్రీతి వలన దానితో గూడ కొనిపోవుటకు సమకట్టిరి. కాని ఆళ్వారులు తమ శరీరమును త్యాజ్యంబని తలచి, అంటీ అంటకయుండి విడిచిపోవుటకై సిద్ధపడు చుండగా నట్టి దేహములో తాను ప్రవేశించి, తనకు వాసస్థానములైన దివ్యదేశములన్నిటి యందు తనకు గల ప్రీతిని వీరి శరీరమునందొక్కదాని యందే చూపించి, **'సంతోషించి, 'అంగనామంగనా మంతరే మాధవో మాధవం మాధవం చాంతరేణాంగనా'** అన్నట్లు రాసక్రీడలో అనేక శరీరములు ధరించి గోపికాస్త్రీలతో అనుభవించినట్లును, **'ఏకస్మిన్నేవ గోవిందః కాలే తాసాం మహామునే, జగ్రాహ విధివత్పాణీన్ పృథగ్గేహేషుధర్మతః ఉవాస విప్ర సర్వేషాం విశ్వరూపధరో హరిః'** అన్నట్లు శ్రీద్వారకాపట్టణమందు దేవులతో గూడపదునారువేల శరీరములను ధరించి అనుభవించినట్లును తమ శరీరము నందెక్కువ ప్రీతిగలిగి తీసుకొని వెళ్ళదలచిన శ్రియఃపతికి, **'పొంగై మ్బులనుమ్ పొరియైన్దుమ్ కరుమేందిరయమైమ్ పూతమింగివ్వుయిరేయ్ పిరకిరుతిమానాం గారమనంగళాన- ఉన్ మాయామైయై మంగవొట్టు** (తి.వా. 10-7-10) అనగా వర్ధిల్లు చున్న శబ్దాది విషయములను, అయిదు జ్ఞానేంద్రియములను, కర్మేంద్రియములను, పంచభూతములను, ఈ సంసారమునందు ఈ జీవాత్మతో గలిసి యున్న ప్రకృతిని, మహత్తత్త్వమును, అహంకారమును, మనస్సును నీ యొక్క ఆశ్చర్యకరములైనట్టి ప్రకృతి ప్రాకృతములను నశింపజేయుమా! అని తమ దేహమున గల దోషముల తెలియపరచి, దీనినుండి విడిపింపమని స్వామి శ్రీపాదములను బట్టుకొనిరి.

ఆళ్వారుల ప్రార్థను మన్నించి ప్రకృతి సంబంధమును పోగొట్టి, **'తానేతర'** అని చెప్పియున్నట్లు పరమపదము నీయబూని, ఉభయవిభూతి సంబంధము వలన గలుగునట్టి అన్యపరతను పోగొట్టి, తమను అటకు గొనిపోవుటకు వాహకులను నియమించుటలోను, తాను ముందుగా పోవుచు, వీరిని గొని పోవుటకై ఆతుర పడినవానిని, ఆళ్వారులు, కొంగుపట్టుకొని ఇట్లడిగిరి. **'ఇన్రై పొరుళాక్కి'** ఈరోజునన్ను ఒక వస్తువుగా ఎంచి, నిర్హేతుకముగ నన్ను అంగీకరించిన మీరు అనాదికాలముగ ఈ దాసుని ఉపేక్షించుటకు కారణమేమి? **'ఈ ప్రశ్నకు ఏమి ప్రత్యుత్తర మిత్తునా'** అని భగవంతుడు తనలో తాను ఆలోచించెను. తానే సమాధానము చెప్పినా దానిని ఆళ్వార్లు తనకే వర్తింపజేయగల సమర్థులని బదులు చెప్పక చిఱునగవుతో మౌనము



నాశ్రయించిరి. ఈ సందర్భమున శ్రియఃపతి తనలోతాను తలచుకొనినట్టి సంవాదమును తెలిసికొందుముగాక!

నమ్మాళ్వార్లు : ఈరోజు నన్ను ఆదరింపదలచిన మీరు చిరకాలము నన్ను అనాదరించుటకు హేతువేమి స్వామీ!

శ్రియఃపతి : మీరు ఇంద్రియముల తృప్తికై రసరహితములైనట్టి వానిని రసవంతములుగా నమ్మినన్ను పట్టించుకోనందుకుగదా ఇంతకాలము గడచినది!

నమ్మాళ్వారు : అవి ఎట్టి వారినైనను మిమ్ము ఎడబాయునట్లు చేయుటకై మీరు కల్పించినవే గదా!

శ్రియఃపతి : మీదేహ సంబంధమును బట్టి గదా అవి ఏర్పడునది?

నమ్మాళ్వారు : అదికూడ మీరు పెట్టిన భారమే గదా!

శ్రియఃపతి : ఆ భారము మీరు పూర్వము చేసినట్టి అంతులేని కర్మముల వలననే అని తెలిసికొనుడు.

నమ్మాళ్వారు : ఆ కర్మములు కూడ మీయొక్క నిగ్రహానుగ్రహముల బట్టి కదా!

శ్రియఃపతి : వాటి కర్తృత్వము, భోక్తృత్వము మీవి కావా?

నమ్మాళ్వారు : **'పయనుణ్బేనుమ్' 'కరుమముమ్ కరుమఫలను మాకియ'** పుణ్యాపాపరూపకర్మములకు, వాటి ఫలముకు మీరేగదా నియామకులు! కర్మ, కర్త, తత్ఫల భోక్తమీచే ఏర్పరుపబడిన వారగుట వలన, కర్తయును, భోక్తయును మీరే అందురు.

శ్రియఃపతి : **'యానే యెన్నై యఱియకిలాతే యానే యెన్ఱనదే యెన్నిరుందేన్'** నేను నన్ను తెలిసికొనలేక స్వతంత్రుడనని భావించి యుంటిని అని మీరన్నట్లు అజ్ఞాన అన్యథా జ్ఞానమువలన కదా కర్తృత్వ భోక్తృత్వములు ఏర్పడినవి.

నమ్మాళ్వార్ : అయోగ్యములైన అనేక మతములందు నామనస్సును పోనిచ్చినది మీరేకదా! చెడిన నా మనస్సును బాగు పరచుట మీ కృత్యము కాదా! 'నెఱి కాట్టి నీక్కుదియో' ఉపాయాంతరములను జూపి నన్ను దూరముగా నుంచెదరా? అని నిష్ఠురము లాడిరి.

**స్వామి** : (నిరుత్తరులైరి).

అప్పుడు ఆళ్వారుల పరమపదయాత్ర సూచకముగా మేఘసముద్ర భేరీ, గీత, కాహళ, శంఖ నాదములు ఆశీర్వాదములు. స్తుతికోలాహలములు ఆరంభమైనవి. అర్చిరాది మార్గమున అతివాహకులు చేయు సత్కారములు, దివ్యదేశప్రాప్తి, అచట అందించు బహుమానములు, పరమానందమయమగు పరమపదమునందు నివాసము, భగవంతుని శ్రీపాదములు శిరసాధరించుట మున్నగు దివ్యానుభవములు మానసగోచరములయినవి.

వీనిని ప్రత్యక్షముగ అనుభవింప గోరిన ఆళ్వార్. **'తలమిశైయాయ్ వన్దిట్టు ఇని నాన్ పోకలొట్టేన్'** నా శిరమున నీ శ్రీపాదములు అమరి ఉండునట్లు పొందితిని. ఇక నిన్ను విడజాలను అని, **'తలైమేల్ పునందేన్ శరణంగళే'** నీ శ్రీపాదములను నా తలపై ధరించితిని అని, **'తిరువాణై నిన్నాణై కండాయ్'** మహాలక్ష్మీ పై ఒట్టు, నీపై ఒట్టు ఇక మీరు నన్ను వీడి పోజాలరు అని శ్రియఃపతిని నిర్బంధించిరి.

శ్రియఃపతి : ఆళ్వీర్! మీరు నన్నిట్లు నిర్బంధించుట మీ శేషత్వమునకు తగదు సుమండీ!

నమ్మాళ్వార్ : స్వామీ! మిమ్ములను పొందుటకు అనర్హుడనైనచో తొలుతనే నన్ను విడచి ఉండవచ్చునే! అట్లుగాక, **'నేశమ్ శెయ్తు ఉన్నోడెన్నై ఉయర్వేఱిన్ని ఒన్నాకవే కూశం శెయ్యాతు కొండాయ్'** నాతో స్నేహముచేసి ప్రాణభేదము లేక నాలో ఒకటిగా చేరి నిస్సంశయముగ నన్నేల అంగీకరించితిరి? నా ఆత్మకు ఉజ్జీవన హేతువుగా మిమ్ములను తప్ప వేరొకరిని ఎరుగను. ఏ ఆధారములేనివాడను. నా కార్యమును మీపై ఉంచుకొని ఇపుడు నన్ను వేరుచేసి సంసారమున పడద్రోయుట మీకు దోషము సుమండి. ......నన్ను అనుభవింప నారంభించి, మధ్యలో విడిచిపెట్టుట తగదు స్వామీ! నీ ప్రేయసి అయిన మహాలక్ష్మీదేవియొక్క పురుషకారమును పొందినవాడను. మన ఇరువురికీ శరీర శరీరి సంబంధము గలదు. ఇటువంటి నన్ను విడనాడుట నీకు తగదు, తగదు! అని మొర పెట్టిరి.

ఆళ్వార్ల ఆర్తి పరమభక్తిగ పరిణమించినది. ఈ పరమభక్తి అతిశయించగా, **'అదనిల్ పెరియ ఎన్నవావర చ్చూళ్న్దాయే'** - తత్త్వత్రయము కంటె మహత్తరమగు ఆళ్వార్ల పరమభక్తి గోష్పదమైనది. శ్రియఃపతి అత్యంతప్రీతితో, **'అంకే భరత మారోప్య ముదితః పరిషస్వజే'** శ్రీరామచంద్రమూర్తి భరతుని తన అంకముపై కూర్చుండ బెట్టుకొని ఆలింగనము చేసికొనినట్లు, ఆళ్వారులను గాఢముగ ఆలింగనము చేసికొని



ఇంతకాలము సంసారమున ఉండుట వలన కల్గిన తాపమును తీర్చి, వారికి నిరతిశయబ్రహ్మానందమును కలిగించిరి.

భగవద్విరహతావలన మొరపెట్టుకొనినట్టి ఆ వాక్కుతోనే, **'ఆవావత్తు వీడుపెత్త కురుకూరు శడకోపన్'** శ్రమతీరి శ్రీవైకుంఠమును పొందినట్టి శఠకోపులు అని తానే స్వయముగ సాయించునట్లు, తాపములను హరించువాడనెడి అర్థము నిచ్చు, 'హరి' అను నామధేయము సార్థకమగునట్లు శ్రియఃపతి నమ్మాళ్వారులను అనుగ్రహించిరి. అట్లు తమయొక్క సకల తాపములను శ్రీహరి పోగొట్టి పరమపదమును కృపజేసిన ఈ విశిష్టవిషయమును ఆళ్వారులు పదవపత్తులో ప్రసాదించి, **'తిరువాయ్‌మొళి'** గ్రంథమును సుసంపన్నము ఒనర్చిరి. **'ఆచార్యహృదయ చంద్రిక'** మరొక్క అధ్యాయముతో పరిసమాప్తమగును. చిత్తగింతురు గాక!



## పదునెనిమిదవ అధ్యాయము

# ఆచార్యహృదయచంద్రిక విశిష్ట అనుబంధము

తమ ఆచార్యహృదయ గ్రంథము నకు సమకూర్చిన ఈ విశిష్ట అనుబంధములో శ్రీపిళ్ళైలోకాచార్యులవారి తమ్ములు అళకియమణవాళ ప్పెరుమాళ్ నాయనార్ వారు మూడు అంశములను సాకల్యముగా ముచ్చటించిరి. ప్రధాన గ్రంథమునకు విశిష్టవ్యాఖ్యానము నందించిన శ్రీమణవాళ మహామునుల వారు ఈ అనుబంధము నకు కూడ తమ అపూర్వ వ్యాఖ్యానమును అనుగ్రహించిరి. ఈ విశిష్ట అనుబంధములో వచ్చుమూడు విషయములు ఇవి : 1. శ్రియఃపతి నమ్మాళ్వారులను సంసారములో నుంచుటకు హేతువులు. 2. ఆళ్వారుల పరభక్తి. 3. జ్ఞానదర్శన ప్రాప్త్యవస్థలు, భగవదనుగ్రహము.

భగవంతుడు నమ్మాళ్వారులు ఆర్తులై శరణుజొచ్చినప్పుడే విరోధులను నివర్తింపజేసి తమను పొందునట్లు చేయక ఇంతవరకు వీరిని ఈ సంసారమున ఉంచియుండుటకు అనేక కారణములున్నవి.

**మొదటి కారణము :** తామొనర్చిన సృష్టివలనగాని, అవ మూలమున గాని దిద్దుబాటు గానట్టి జగత్తు వీరియొక్క ఉపదేశమువలన **'ఊరుమ్ నాడు ములకముమ్ తన్నైప్పోల్'** ఊరు, దేశము, లోకము తనవలె నాయెను అని చెప్పినట్లులోకమును సంస్కరించుటగా ఆళ్వారులను ఈ జగత్తులో ఇంతకాలముంచిరి.

**రెండవ కారణము :** ఆర్తులై ఆళ్వారులు ప్రపత్తి చేసిన తోడనే, వీరిని ముక్తులుగా జేసితే, ప్రపత్తికి దిగిన వెంటనే మరణమును సంభవింపజేయు విషపు మడుగుగా ఎంచి భయపడినవారై, ఇక మీదట దీనినెవ్వరు అవలంబించరని తలచి, ప్రపత్తికి ఆచెడ్డపేరు రాకుండుటకు ఆళ్వారులనుఈ జగత్తులో ఇంతకాలము ఉంచిరి.

**మూడవ కారణము :** తాము, తమ విభూతి ఆనందించునట్లు ఈ ఆళ్వారులచే కవిత్వము చెప్పించి, ఈ ప్రబంధము పూర్తియగు వరకు ఆళ్వారులను ఈ లోకములోనుంచిరి.

**నాల్గవకారణము :** కురువేరును తలలో పెట్టుకొనువారు, దాని పరిమళమున గల ఆశవలన, ఆ వేరుకు అంటుకుని ఉన్న మట్టిని కడిగి వేయకుండానే ధరించినట్లు, జ్ఞానులను చరమశరీరములో నుంచి అనుభవింపవలెనను ఆశకలవాడగుటవలన



శ్రియఃపతి వీరియొక్క జ్ఞానప్రేమరూపమగు పరిమళమంతయు ప్రకాశింపజేయునట్టి వీరి శరీరమునందును ప్రీతిజెందిరి. అందుకే ఇంతకాలము వీరిని ఈ లోకము నందుంచిరి.

**ఐదవ కారణము :** ఆళ్వారుల శరీరముపై గల ప్రీతి అని చెప్పుటకంటె, **'ఎన్నాళ్ యానున్నై యినివన్దు కూడువనే'** నిన్ను నేను ఇక ఎన్నిరోజులకు చేరుదును? **'ఎంగినితలై ప్పెయ్‌వనే'**- స్వామిని ఇక ఎచ్చట పొందెదను? అని, **'ఇని ఎన్నారముదే కూయరుళాయే'** నా అమృతమా! నన్నింక పిలుచుకొనిపో! అని **'ఆవికాప్పారినియార్'** ఇకనా ప్రాణములను నిలబెట్టువారెవ్వరు? అని, ఇక ఎప్పుడు? ఎప్పుడు అని ఇట్లు ఇరువది పర్యాయములు మొఱపెట్టుకొనునట్లు చేయుఆర్తివలన గలుగు అధికారి పూర్తికి గాను ఆళ్వారులను ఇంతకాలము స్వామి ఈ లోకమున ఉంచినారు. ఎక్కువ ఆర్తి ఉన్నవే గదా ప్రపత్యధికారము పరిపూర్ణము కాగలదు! గాన ఆళ్వారులను ఈ లోకములో ఇంతకాలము ఉంచుటకు ప్రధానకారణమిదే అని గ్రహించవలెను.

### ఆళ్వారుల పరభక్తి :

ఆళ్వారుల ఆర్తికి కారణభూతములు పరభక్తి, పరజ్ఞాన, పరమభక్తులే అని వివిధ తిరువాయ్‌మొళులలో నిరూపించినారు. వీటిలో పరభక్త్యవస్థ ఇట్టిదని, **'కమలక్కణ్ణన్'** అనుపాశురములో తెలిపినారు. అంతరానుభవమునిచ్చిన పాశురముల కంటె, బాహ్యచక్షువులతో భగవంతుని చూడవలెనని చెప్పినట్టి పాశురములు వాటికి రెట్టింపుగా నుండుట విశేషము. బాహ్యానుభవము గలిగిననే తప్ప ధరించి యుండ జాలనిది అగు పరభక్తి అవస్థ పరజ్ఞానములో లోపల ఉండును.

ఇక పరజ్ఞానము ఇట్టిది అని తెలియుటకు, **'అన్తమిల్ పేరిన్బత్తడి యరోడిరున్దమై'** అంతము లేని ఆనందమునను భవించు భగవద్భక్తులతో గూడి అని, **'అడియార్ కళ్' కుళాంగళైయుడన్ కూడవతెన్ఱుకోలో'** దాసుల గోష్ఠిలో జేరుట ఎన్నటికో అని ఆశ పడినట్లు అర్చిరాది మార్గమున దేశవిశేషమైన పరమపదమునకుబోయి భగవత్ స్వరూపాదులను పరిపూర్ణముగ అనుభవించుచున్న నిత్యసూరుల గోష్ఠిలో చేరిఉన్నట్టి వారుగాను, సాక్షాత్కరించి చెప్పిన **'శూళ్‌విశుమ్బణి'** అను తిరువాయ్‌మొళియందు పూర్ణమగు పరజ్ఞానమును తెలిపిరి.

అట్లు సాక్షాత్కరించినది మానసానుభవమై, బాహ్యానుభవ యోగ్యము గాకపోవుట జేసి, మిక్కిలి యాతురపడి, మొరపెట్టుకొని, ధరించి ఉండజాలక, ఒట్టుపెట్టి, అడ్డగించి,

లభింపరాని శపథముకానట్లు సాధించి, ఫలప్రాప్తితో ముగించిన, **'ముడిన్దవవావిలన్దాతి యుప్పత్తు'** అని సాయించిన **'మునియే నాన్ముకన్'** అను తిరువాయ్‌మొళి భక్తియొక్క చరమావధి ఐన పరమభక్తిని తెలుపును.

ఇక, ఈ పరభక్త్యాదుల స్వరూపములను భగవద్ వాక్యముల ప్రమాణముగా తెలుపుచున్నారు. 'భక్త్యాత్వనన్యయా శక్యః అహ మేవం విధోఽర్జున! జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప' అని అర్జునుని గురించి రథము మీద గీతాచార్యులు అనుగ్రహించిరి. **'పరభక్తిస్వభావం మాంకురుష్వ'** అని ప్రార్థించిన శ్రీరామానుజులవారిని గురించి, **'మత్ జ్ఞానదర్శన ప్రాప్తిషు నిస్సంశయ సుఖమాస్వ'** అని శ్రీరంగపీఠము నందును సాయించినవి జ్ఞానదర్శన ప్రాప్త్యవస్థలే అని తెలియవలెను.

భగవంతునితోజేరి ఉండుటయే సుఖముగాను, వానిని విడనాడి ఉండుటయేదుఃఖముగాను తలచి ఉండుట పరభక్తి జ్ఞానావస్థ. భగద్రూప రూపగుణవిభూతులను విశదతమముగ సాక్షాత్కరించునట్టి పరజ్ఞానము దర్శనావస్థగాను, అట్లు సాక్షాత్కరించిన వానిని వెంటనే పొంది అనుభవించక పోయినట్లయితే, అప్పుడే ప్రాణములను వీడునట్లు చేయునది పరమభక్తి ప్రాప్త్యవస్థగాను ఎరుగవలెను.

సంసారకారణమగు అజ్ఞానమును నివర్తించునట్టి జ్ఞానపూర్తిని కలుగజేసిన వాడు, జ్ఞానాది గుణపూర్ణుడగు భగవంతుని యొక్క నిర్హేతుక అనుగ్రహమువలన సంసారనివృత్తిపూర్వక భగవత్ప్రాప్తి రూపమగు మోక్షములభించునని చెప్పుటకే, **'మయర్వర మతినల యరుళిన'** అని ఆరంభించి, **'ఆవావత్తు వీడుపెత్తు'** అను పాశురముతో సమాప్తిచేసిన **'తిరువాయ్‌మొళి'** దివ్యప్రబంధతాత్పర్యార్థము. భగవదనుగ్రహమే అన్నింటికీ మూలము, రక్ష !

## ఆచార్యహృదయము ముఖ్యతాత్పర్యము :

ఈ ఆచార్యహృదయ గ్రంథమునందు శ్రియఃపతి తన అనుగ్రహవిశేషముచేత, అజ్ఞులగు చేతనులు తత్త్వజ్ఞులై సారాసార వివేకముగల వారగుటకుగాను శాస్త్రము నొసగిన విధమును తెలిపిరి. అట్టి శాస్త్రము ద్వారా తత్త్వజ్ఞానము గలుగుట దుర్లభమని తలచి శాస్త్రతాత్పర్యమగు తిరుమంత్రమును కృపతో బయలుపరచిరి. అట్టి శాస్త్రతాత్పర్యముయొక్క విషయభేదములును, శాస్త్ర, శాస్త్రతాత్పర్యనిష్ఠులగు అధికారుల విధములను, తెలిపిరి. ఇందు మూలంగా, ప్రసంగవశాత్తు తిరువాయ్‌మొళి వైభవమును, తిరువాయ్‌మొళిని అందించిన ఆళ్వార్ల ప్రభావమును, ఆ ప్రభావమునకు



మూలభూతమైన భగవన్నిర్హేతుక కటాక్షమును, ఆ కటాక్షము మూలముగ వీరికి గలిగిన జ్ఞానభక్తులను వివరించిరి.

ఆ మహోన్నత జ్ఞానభక్తి దశయందు భగవద్భక్తులతో ఆళ్వార్లకు గల సామ్యమును, ఆ అలౌకికదశలో వీరు పలికిన అన్యాపదేశవాక్యముల స్వాపదేశార్థములను, అట్టి భక్తికి విషయభూతములగు దివ్యదేశములందు వేంచేసి ఉన్న శ్రియఃపతిగుణవిశేషములను, భగవంతుని అనుభవించుట వలన గలిగినట్టి ప్రీతివలన ప్రేరితులై తిరువాయ్‌మొళి మున్నగు ప్రబంధములను సాయించిన విధమును, ప్రతిపాదింపబడునట్టి అర్థముతో గల సామ్యము వలన తిరువాయ్‌మొళికి శ్రీభగవద్గీతతోగల సామ్యమును, దానినుండి దీనికిగల వైలక్షణ్యమును వివరించిరి.

అట్లే, ప్రసంగవశమున, ఉపదేశము పొందునట్టి శిష్యునికుండవలసిన లక్షణములను, అట్టి శిష్యలక్షణములు లేనివారికిని వీరు ఉపదేశించుటకు హేతువులు. ఖ్యాతిలాభాదుల నాశింపక, భగవత్కైంకర్యముగా తలచి ఉపదేశించినందున ఉపదేశము సఫలమగుటను, ఉపదేశించినట్టి ఈ ప్రబంధములు రహస్యత్రయవివరణములగుటను, అట్టి రహస్యత్రయమును వివరించు అర్థపంచకమును ఈ ప్రబంధములందు సంగ్రహవివరణరూపముగ చెప్పబడినవి.

ప్రబంధారంభమున ఉండవలసిన మంగళాచరణాదులు, సాధుపరిత్రాణాదుల మూలముగ జగద్రక్షణార్థమగు భగవదవతారమువలెనే ఈ తిరువాయ్‌మొళికూడ ఒక అవతారమే అగును. దీనిలో పదిపత్తుల యందును ప్రతిపాదింపబడినట్టి భగవంతుని పరత్వాదిగుణములును, అట్టి గుణములతో గూడియున్న శ్రియఃపతి ఈ పదిపత్తులచేతను ఈ ఆళ్వారులకు తత్త్వజ్ఞానము మొదలుకొని, భగవత్ప్రాప్తి వరకు కలుగజేసిన దశావిశేషములును ప్రతిపత్తునందును వీరు ఇతరులకుపదేశించిన విధమును వివరించిరి.

తొలుతనే, ఆళ్వారులు ఆర్తికలిగియున్నను, సర్వేశ్వరుడు వీరిని ఇంకను సంసారములోనుంచుటకు కారణములు, వీరికి గలుగజేసిన పరభక్తి, పరజ్ఞాన, పరమభక్తులను దశావిశేష సందర్భములను, అజ్ఞాననివర్తకమగు జ్ఞానపూర్తిని కలుగజేసినట్టి భగవంతుని అనుగ్రహమే అనిష్టమగు సంసారమును పోగొట్టి, ఇష్టమగు మోక్షమును కలుగజేయుట ఈ ప్రబంధము యొక్క ముఖ్యతాత్పర్యము.

ఆస్తికులై ఆళ్వారుల అభిమానములోనుండి, వారి దివ్యసూక్తుల విషయమున ప్రీతిగలవారై అనన్యప్రయోజనులై ఉండువారందరు అనుసంధించుకొని, ఆచరణలో

నుంచుకొని ఆనందిచునట్లు, సాయించి, ఈ 'ఆచార్యహృదయము' గ్రంథమును శ్రీనాయనార్ సుసంపన్నం చేసిరి.

మణిప్రవాళములోని **'ఆచార్యహృదయము'** గ్రంథము మూలమును, వ్యాఖ్యానముతో సహా ఆంధ్రీకరించి తమ వేదాంతముద్రాయంత్రమున ముద్రించి (మదరాసు, 1927) విశిష్టాద్వైత సంప్రదాయ ప్రచారమునకు ఎనలేని సేవలొనరించిన **శ్రీఉ.వే. శ్రీమాన్ కందాడై శేషాచార్య స్వామి** వారి గ్రంథమును, మా ఉపకారకాచార్యులు **మహామహోపాధ్యాయ, ప్రవచన శిరోమణి శ్రీ ఉ.వే. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య** స్వామివారు అనుగ్రహించిన **'ఆచార్యహృదయము'** కాలక్షేపమును ఆలంబనముగా చేసికొని వ్రాసిన ఈ **'ఆచార్యహృదయచంద్రిక'**ను 2010 దీపావళి స్వాతినక్షత్రంలో 78వ సంవత్సరంలో అడుగిడి, కృతకృత్యుడగుచున్న ఈ ఆత్రేయ రామానుజదాసుడు ఆ సదాచార్యుల దివ్యస్మృతికి భక్తితో అంకిత మిచ్చుచున్నాడు. స్వస్తి.

**లోకా స్సమస్తా సుఖినో భవన్తు!**

పెరియజీయర్ తిరువడికళే శరణమ్

ఆళ్వార్ తిరువడికళే శరణమ్

ఆచార్యతిరువడికళే శరణమ్





అచార్యహృదయం కాలక్షేప సమాపన సమయంలో

పఠించవలసిన తనియన్‌లు, వాళి త్తిరునామాలు

## అ*ళ*కియమణవాళ ప్పెరుమాళ్ నాయనార్ తనియన్

**ఆచార్యస్వాంతవక్తార మభిరామవరాభిధమ్ ।**
**శ్రీకృష్ణతనయం వందే జగద్గురువరానుజమ్ ॥**

### వా*ళి*త్తిరునామం

మన్నియశీర్ మదిళరజ్గమ్ మకి*ళ* వన్దోన్ వా*ళి*యే
మార్గ*ళి*యిల్ అవిట్టత్తిల్ వన్ద వళ్ళల్ వా*ళి*యే
మిన్ను పుక*ళ్* ఆరియమనమ్ మొ*ళి*న్దరుళ్వోన్ వా*ళి*యే
మేన్మై మికు తిరుప్పావై విరిత్తురైప్పోన్ వా*ళి*యే
తెన్నురైయిల్ ఉలకారియన్ తిరువడియోన్ వా*ళి*యే
శ్రీకృష్ణపాదకురుశెల్వమైన్దన్ వా*ళి*యే
అన్నపుక*ళ్* ముడుమ్బై నమ్బిక్కన్బుడైయోన్ వా*ళి*యే
అ*ళ*కియమణవాళన్దన్ అడియిణైకళ్ వా*ళి*యే

## శ్రీమణవాళ మహామునుల తనియన్

శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్ ।
యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్ ॥

### వా*ళి*త్తిరునామం

ఇప్పువియిలరంగేశర్ క్కీడళిత్తాన్ వా*ళి*యే
ఎ*ళి*ల్ తిరువాయ్ మొ*ళి*ప్పిళ్ళై యిణై యడియోన్ వా*ళి*యే
ఐప్పశియిల్ తిరుమూల త్తవదరిత్తాన్ వా*ళి*యే
అరవరశ ప్పెరుఞ్జోది యనన్దనెన్డుమ్ వా*ళి*యే
ఎప్పొ*ళు*దుమ్శ్రీశైల మేత్తవందోన్ వా*ళి*యే
ఏరారు మెతిరాశ రెన వుదిత్తాన్ వా*ళి*యే
ముప్పురినూల్ మణివడముమ్ ముక్కోల్ దరిత్తాన్ వా*ళి*యే
మూదరియ మణవాళ మామునివన్ వా*ళి*యే

మంగళాశాసనపరైః మదాచార్యపురోగమైః ।
సర్వైశ్చ పూర్వై రాచార్యైః సత్కృతాయస్తు మంగళమ్ ॥

ఎంబెరుమానార్ తిరువడిగళే శరణమ్.

శ్రీ ఉ.వే. శ్రీమాన్ 'ఆదర్శాచార్య' చిత్రకవి ఆత్రేయగారి

## ఆధ్యాత్మిక గ్రంథాలు

1. 'ప్రవచన శిరోమణి' -'మహామహోపాధ్యాయ' శ్రీ.ఉ.వే. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామి వారి జీవితచరిత్ర
2. వకుళాభరణనాయకి - తిరువాయ్‌మొళిపై వ్యాస సంపుటి
3. తిరుప్పావై పూదండ, ధనుర్మాస మహావ్రతసర్వస్వం
4. ధర్మసందేహం-508 ధర్మసందేహాలకు సమాధానాలు
5. జీవన రామాయణం -సంపూర్ణ రామాయణ నాటకం
6. ఆచార్యహృదయ చంద్రిక- 'ఆచార్యహృదయము'నకు తెనుగుసేత
7. నిత్యజీవితంలో భగవద్గీత-ఆచరణం, పారాయణం.
8. పరమాత్మ కథలో ఆత్మకథ (మన జీవితపరమాశయం, ప్రస్థానం)
9. ఆళ్వారాచార్యుల కథలు - 'శరణ్య' తొలి సీరియల్
10. సత్సంప్రదాయ సంగతులు - వ్యాససంపుటి 'శరణ్య' మలిసీరియల్
11. 'ఆదర్శాచార్య' సాహిత్య, ఆధ్యాత్మిక ప్రసంగ వ్యాసాలు- సంకలనం
12. ATREYA'S ESSAYS ON LITERATURE, CULTURE AND RELIGION - PUBLISHED IN 'THE HINDU' OVER A DECADE- A COMPILATION

పై గ్రంథాలు అన్ని ప్రముఖ బుక్‌షాపుల్లోను లభిస్తాయి. వెల చెప్పదగినంత కాదు. సంప్రదించండి. ఎమెస్కోబుక్స్. ఫోన్స్:0866-2436643, సెల్ : 9849992890.

**ఆదర్శ ఆచార్య ఆత్రేయ, ఆత్మ ఆవిష్కార ఆలయం**

ఫోన్స్ : 9008588008,

080-26490364, 9980400555

